

## అగస్టు, 1947



వర్ణ చిత్రము : సంధ్యాతపము—వేలూరి రాధాకృష్ణగారు.



లింగోద్భవమూర్తి

(మద్రాసు మ్యూజియంలోనున్న చోళరాజులనాటి
ఒక్కశిలావిగ్రహము.)

—Courtesy : Museum Superintendent.



సంపుటము 24
సంచిక 8

భారతి

ఆగస్టు 1947
సర్వజిత్తు, అధిక శ్రావణము

# స్వతంత్ర భానుఁడు

= శ్రీ రేజేటి సీతారామస్వామి =

"తీరంబోని* విచార మారుటకు గాన్ధీయుక్తి రేయింబవల్
ఘోరంబౌ తప మాచరించె నలుదిక్కుల్ దద్దరిల్లన్ ఫలం
బీరీతిన్ మన కబ్బె తండ్రిదయచే నీక్షించితే తల్లి? లే
క్రూరుల్ †కద్రుసుతుల్ ‡సహోదరుని మార్కొన్లేరు ధైర్యంబుతో.

అమృతముఁ దేరఁబోయి లవణాంబుధివాసుల నుక్కడంచి, తా
నమరులతోడఁ బోరి, యమరాధిపునోంచి, సుధన్ గ్రహించి, యా
కుమతుల కివ్వఁజూపి, యదిగో తొలఁగించెను పారతంత్ర్య మీ
సమయమునందు మేల్కొనుము. చల్లఁగఁ జూడుము మమ్ము నందఱన్.

అమ్మా! లెమ్ము మదీయ సోదరుఁడు దాస్యశ్శృంఖలా బంధముల్
హుమ్మంచుం దెగఁగొట్టె నీపయి స్వతంత్రోత్కృష్ట సౌఖ్యాబ్ధిలో

---

* (1) విచారమారుటకు గాన్ + ధీయుక్తి
(2) విచారమారుటకు గాంధీ + యుక్తి

† కద్రుసుతుల్—(1) కద్రు=నాగమాత
(2) గోరోచనవర్ణము గలజాతి=దొరలు, ముస్లిములు

‡ సహోదరుఁడు—[illegible]

తమ్ముంగుజ్జులు నోలలాడెదరు నీ దైన్యంబు తీరెన్ బ్రభా
తమ్మయ్యెన్, దిమిరంబు బాసె, ఖగముల్ దాఁ గూసె మేల్కొఁగదే!!

మాసిన పుట్టముల్ విడుము మానుము చింత సుగంధవస్తుసం
వాసితస్వర్ణదీ*విమలవారిని బోసుక రమ్ముఁ గొమ్ము వే
భాసురమా దుకూలములు, భవ్యవిభూషణ రత్నహారముల్,
పూసల దండలన్ విడుము పూజల నందుము సింహపీఠికన్."

అని "యరుణుండు" భక్తిఁ దన యమ్మను లెమ్మనునట్టి వేళఁ దోఁ
చెను ఘనదీప్తి నల్దెసల శ్రీఘనతఁ గ్రమ్మ స్వతంత్రభానుఁ డా
†వినత ముఖంబు నెత్తి యటు వీక్షణఁ జేసి, నమస్కరించి, చెం
తను దనుఁ గొల్చు పుత్రకులఁ దాఁ గని దీవన లిచ్చె వేడుకన్.

---

* (1) విమల వారినిఁ + బోసుక + రమ్ము
(2) బోసుకరమ్ము + గొమ్ము
† (1) వినత + ముఖము, (2) వినతముఖము=వంచినముఖము.





# భారత విజయ పతాకము



స్రష్టా విష్ణుమహేశులు సృష్టి స్థితిలయము లెపుడు సేయఁగఁదగు న
త్కృష్టగుణత్రయరూపం బిష్టంబుగ మన పతాక నిమిడెఁ గనంగన్.

రాగబద్ధులకు వైరాగ్యంబు గల్పించఁ గాషాయవర్ణంబు గాంచునంత
మాత్సర్య మణఁచి సమత్వంబు గల్పించు శుక్లవర్ణంబును జూచునంత
సంరంభ ముడిపి ప్రశాంతిని గల్గించు క్షితి హరిత్కాంతి నీక్షించునంత
క్షితిచక్రమెల్ల రక్షించునా యనిపించు చక్రవిన్యాసదర్శనము చేయు
నంతఁ జూడఁగఁజూడఁగ వింత వింతలైన సద్భావములు గల్గు నహహ! భార
తీయ విజయధ్వజంబు నాత్మీయపరవిభేదముల మాన్పి దేశాలఁ బేరు నందు.

శాంతి సత్యాహింస సద్భావములు గూర్పఁజాలు నశోకుని చక్ర మిదియె
పరరాజ్యహరణ పిపాసల ఖండింపఁజాలు సుదర్శనచక్ర మిదియె



గ్రహతారకాగోళ గతులను మార్పంగఁజాలు మహాకాలచక్ర మిదియె
వివిధదేశసమైక్యవిభవ మాపాదింపఁజాలు నుత్తమధర్మచక్ర మిదియె
చూడుఁడో యన్నలార! యీ సుందరాచ్ఛ-ధవళవర్ణాంతరంబున ధగధగమని
కోటిసూర్యప్రకాస్తితోఁ గోమరుమిగులు-చక్ర మలరారు విజయధ్వజంబులోన.

ఈ పతాకను నిలుపు టెప్పుడో స్థిరముగ నంచుఁ గొండఱు కలల్ గాంచినారు
ఈపతాకను బట్టి యెందఱో విడువక యోర్మిమై లాటీల నోరగినారు
ఈపతాకను నిలుప నెందఱో ధీరులు కొంచక నెత్తు రర్పించినారు
ఈపతాకను గోరి యెందఱో చెరసాలలందున దీనులై మ్రందినారు
భారతావని స్వాతంత్ర్యభానుదీప్తి-భాసురపతాక సర్వజిద్వత్సరమున
నెగురఁ గంటిమి పూజింత మీపయి నిది-యిలను సుస్థిరమూర్తియై నిలుచుఁగాక.

ముల్లోకంబులు దీని నీడ నిలువన్ మూలంబు సుస్థాయిగాఁ
దల్లీ! దీని ప్రతిష్ఠ నల్పె నెహురూ తత్కీర్తిజ్యోత్స్నప్రభల్
ముల్లోకంబుల నింపఁగా నెగురుతన్ మువ్వన్నె జెండా యెదల్
చల్లంజేయుచు భారతీయులకు నాచంద్రార్క మీ భూమిపై.

—రేజేటి సీతారామస్వామి



# బౌద్ధమతగ్రంథములు

*

— శ్రీ పరవస్తు నైనార్ —

బౌద్ధమతగ్రంథము లన్నియు పాళీభాషలో వ్రాయబడినవి. పాళీ అనగా గీత, రేఖ హద్దు అని అర్థము. కాలక్రమమున ఆ అర్థము పోయి పాళీ అనగా 'వాక్యము, మతపుస్తకము, పవిత్ర గ్రంథము' అని వ్యవహరింపబడెను. పై పవిత్రగ్రంథముల వ్యాఖ్యాన, టీకాతాత్పర్యములను 'పాళీ' అని పిలిచెడువారు కారు. తరువాత బౌద్ధమతగ్రంథములు వ్రాయబడిన భాష అంతయు 'పాళీ' అని పిలువబడెను. సిలోన్, బర్మా, సయాం దేశములలో నివసించు బౌద్ధ మతస్థుల మతగ్రంథములు 'తిపిటక' మను పేరుతో వ్యవహరింపబడుచున్నవి.

బౌద్ధమతము రెండు శాఖలుగా విభజింపబడినది: హీనయానము, మహాయానము. సిలోన్, బర్మా, సయాం దేశములలో నివసించు బౌద్ధులు హీనయానమునకు చెందినవారు; టిబెట్టు, చీనా దేశీయులు మహాయానమునకు చెందినవారు.

మతగ్రంథములే గాక వాటి వ్యాఖ్యానము, కొన్ని కావ్యములుకూడ పాళీభాషలో వ్రాయబడినవి. బౌద్ధమతగ్రంథముల వ్యాఖ్యానము 'అట్ఠకథా' అని పిలువబడుచున్నది.

తక్కిన చక్కని శైలిగల పురాణభాషలవలె 'పాళీ' భాషయొక్క శైలి కుదుటబడినది కాదు. మిక్కిలి వివరముగా కూర్పబడలేదు. పాళీభాషకు విస్పష్టమైన క్రమత లేదు. పాళీభాష ప్రాకృతభాషలలో పురాతనమైనప్పటికిని, ఇది కొసవరకును పవిత్రమైనదిగా నుండక సంకరమైనది. ఆ దేశ(ప్రాంత)కాల ప్రాబల్యములనుబట్టి ఆయా దేశ(ప్రాంత) కాలపు ప్రాకృతభాషలతో మిళితమై ముఖ్యముగా నాలుగు భాగములుగా విభజింపబడినది.

(౧) పాళీభాషయొక్క బాల్యదశ పద్యరూపము చెంది 'గాథ'లలో కన్పించుచున్నది. ఈ గాథలు పాళీగద్యమత గ్రంథములలో సమ్మేళనమై యున్నవి.

(౨) పాళీభాషయొక్క రెండవ దశ గద్యరూపమగు మతగ్రంథములలో కన్పించుచున్నది. ఇందు నవీనత్వము కొంచెము గోచరించును.

(౩) పాళీభాషయొక్క మూడవ దశ బౌద్ధమతేతరగ్రంథములగు 'మిళిందపఞ్హా' మొదలగు గ్రంథములలో కనబడుచున్నది.

ఇటీవలి పద్యగ్రంథములలో పాళీభాషయొక్క చరమదశ గోచరించుచున్నది. ఇది సంస్కృత సారస్వతమును పోలియున్నది.

పాళీబౌద్ధమతగ్రంథము లన్నియు 'తిపిటక' మను పేరుతో పిలువబడుచున్నవి. 'తిపిటక' మనగా 'మూడుబుట్టలు' అని అర్థము. అవి యేవన—(౧) వినయపిటక, (౨) సుత్తపిటక, (౩) అభిధమ్మపిటక. ఈ మూడింటిలోను బౌద్ధధర్మములు, బౌద్ధశీలము, మతచర్చ మొదలగునవి వ్రాయబడినవి.

I వినయపిటకములో ఈ క్రింది గ్రంథములు చేర్చబడినవి. ౧ సుత్తవిభంగ. సుత్తవిభంగ రెండుగా విభజింపబడినది: (I) మహావిభంగ (II) భిక్ఖునీవిభంగ. ౨. ఖంధకాస. ఈ ఖంధకాసలో (i) మహావగ్గ (ii) చుల్లవగ్గ అని రెండుభాగములు. 3. పరివార.

II సుత్తపిటక:—ఇది ౫ నికాయములుగా విభజింపబడినది. "నికాయము" అనగా సమూహము, లేక ఏర్పు. (౧) దీఘనికాయ (౨) మజ్ఝిమనికాయ (౩) సంయుక్తనికాయ (౪) అంగుత్తరనికాయ (౫) ఖుద్దకనికాయ. ఖుద్దకనికాయము ఈ క్రిందివిధముగా విభజింపబడినది:

(i) ఖుద్దకపాఠ (ii) ధమ్మపద (iii) ఉదాన (iv) ఇతివుత్తక (v) సుత్తనిపాత (vi) విమానవత్థు (vii) పేతవత్థు (viii) థేరగాథా (ix) థేరీగాథా (x) జాతక (xi) నిద్దేస (xii) పటిసంభిదామగ్గ (xiii) అపదాన (xiv) బుద్ధవంశ (xv) చరియాపిటక.

III అభిధమ్మపిటక:—ఇందులో సప్త గ్రంథములు చేర్చబడినవి. ౧. ధమ్మసంగణి, ౨. విభంగ, ౩. కథావత్థు, ౪. పుగ్గలపఞ్ఞత్తి, ౫. ధాతుకథా, ౬. యమక, ౭. మహాపట్ఠాన.

ఇక పాళీభాషలో వ్రాయబడిన మతేతరగ్రంథములు ఏవన—౧. నెత్తిపకరణ. ౨. పెటకోపదేస, ౩. సుత్తసంగహ మొదలగునవి. వీటిలో నన్నింటిలోను "మిలిందపఞహ"మను గ్రంథము చాల ప్రఖ్యాతి పొందినది. ఈ పుస్తకములన్నియు క్రీ. శ. ౫౦౦ సం॥ పూర్వము వ్రాసినవే. దీపవంశముకూడ ఈ కాలమునకు చెందినది. తరువాత పండితులు "తిపిటకమునకు" వ్యాఖ్యానము వ్రాయ సంకల్పించిరి. తిపిటకవ్యాఖ్యానము క్రీ. శ. ౫౦౦ సం॥ తరువాత వ్రాయనారంభించిరి. వ్యాఖ్యానము చాలవరకు బుద్ధఘోషాచార్యునిచే వ్రాయబడినది. ఇతడేగాక బుద్ధదత్తుడు, ఆనందుడు, ధమ్మపాలుడు మొదలగు భిక్షువులుకూడ ప్రఖ్యాత వ్యాఖ్యాతలు.

'జాతకట్ఠకథా'అను వ్యాఖ్యానము జాతకపద్యములపై వ్రాయబడినది. జాతకపద్యములు బుద్ధుని పూర్వపుపుట్టుకలపై ౫౪౭ కథలుగా వ్రాయబడినవి. ధమ్మపదట్ఠకథా అను వ్యాఖ్యానము జాతకట్ఠకథా వ్రాసినపిమ్మటనే ఆరంభింపబడినది. ఇందులోగూడ జాతకకథలవలె కథలపైనే వ్యాఖ్యానము వ్రాయబడినది.

బుద్ధమతచరిత్ర ఒక పుస్తకరూపమున వ్రాయబడినది. అదియే 'మహావంశ'మని పిలువబడుచున్నది.

పాళీవ్యాకరణము ఈకాలమందే కచ్చాయనాచార్యునిచే వ్రాయబడినది. పై గ్రంథములు క్రీ. శ. ౫౦౦-౧౧౦౦ సం. కాలములో వ్రాయబడినట్లు తెలియుచున్నది.

పాళీవాఙ్మయపు పుట్టుక, దానివృద్ధినిగురించి విపులముగా చెప్పుటకు ఆధారములు అంత హెచ్చుగా ఏమియులేవు. బౌద్ధమతగ్రంథములు బుద్ధుని కాలములోనే పుట్టిన వనుటకు ఏమీ సందేహములేదు. కాని 'తిపిట'కమంతయు అప్పుడే వ్రాయబడియుండదు. కాలక్రమమున ఒక్కొక్క పుస్తకము చేర్చబడియుండును. తిపిటకములోని కొన్ని భాగములు అశోకచక్రవర్తి కాలమువరకే యున్నవని రూఢిగా తెలియుచున్నది. అనగా క్రీ. పూ. మూడవ శతాబ్దమువరికి ఆకాలములోనే బౌద్ధభిక్షు (సన్యాసు)ల మూడవ బౌద్ధమతసభ 'తిస్స'అనువతని అధ్యక్షతను జరిగినది.

అప్పటి'తిపిటక'గ్రంథముల పాళీభాషయే యిప్పటివరకును మార్పుచెందక వచ్చినదని నిర్ధారణచేయుటకు అవకాశము లేదు. బౌద్ధమతము మౌర్యసామ్రాజ్యమంతయు అశోకుని కాలములో వ్యాపించినది. బుద్ధశాసనములు వివిధరాజధానులలో వాటి వాటి(మాట్లాడు) స్వభాషలలో చెప్పబడి చివరకు అన్నిరాజధానుల పండితులు కూడి మూలగ్రంథములను వారివారి కాలములలో పెక్కుజనులకు విపులముగా అర్థమగు సాధారణభాషలలో తగుచోట్ల తిపిటకవాక్యములను, పదములను కూర్చి మెరుగుపెట్టి సులభశైలిలో ఒక ఏకాగ్రతకు (to a uniform tradition) తెచ్చియుండవచ్చును. అట్లు జరిగియుండిన తిపిటకములోని పురాతన పాళీభాష వివిధమౌర్యరాజ్యరాజధానులలో మాట్లాడు అప్పటికాలములో అనుసరింపబడెడు భాషాపదములు కలిసియుండవచ్చును. తిపిటకములోని భాష, శైలికూడ మొదటినుండి కొసవరకును ఒకసరిగా నుండక కొన్ని భేదములు కొన్నికొన్ని భాగములకు కన్పడుచున్నవి. ఒక్కొక్క భాగమునకు కొన్నిభేదము లుండుటయే కాక ఒకేభాగములోనే రెండుభాషాభేదములు కన్పిం

మటచే, కాలక్రమమున పండితులు మధ్యమధ్యను అంశములు విపులీకరించుటకుగాను పెంచియుందు రనుటకు సందేహము లేదు. ఇట్లు మధ్యమధ్యల పెంచుటచే భాషానవీనత కన్పించుటయేకాక క్రమముకూడ పోయియున్నది.

అశోకుని బైరాత్ శాసనమువలన త్రిపిటకము యొక్క వినయసుత్తభాగములు క్రీ. పూ. ౨౫౦ సం॥ నాటికే యున్నవని తెలియుచున్నది. అప్పటి భాగములకును, ఇప్పటి భాగములకును తారతమ్యము ఎంత వరకు ఉన్నదో ఏమియు తెలియదు. సాంచి, బర్హాట్ డగోబా (స్తూపము) ల (డగోబా=ధాతుగర్భ) వద్ద శాసనములు, రాతిద్వారములపై బుద్ధుని జీవితచరిత్రను చిత్రించిన శిలాచిత్రములు త్రిపిటకములోని 'జాతక' కథలను నిరూపించుచున్నవి. పై అంశములవల్ల సాంచి, బర్హాత్ స్తూపములనాటికే 'త్రిపిటక'ములు ఇప్పటిరూపములో నుండియుండకపోయినను ఏదో ఒక అస్థిపంజరరూపములో ఉండియుండవచ్చును. అదియునుగాక బర్హత్, సాంచి డగోబాలయొక్క శిలాశాసనములలో 'భాణక' వల్లెవేయువారినిగురించియు, 'సుత్తంతిక' సుత్తములు వల్లెవేయువారు, పంచనికాయిక'—౫ నికాయములు తెలిసినవారు, 'పెటకిన్' పిటకములు తెలిసినవారు, 'ధమ్మకథిక'—ధర్మబోధకులగు భిక్షువులనుగురించియు చెప్పబడియుండుటచే, పిటకము లనెడు బౌద్ధమతగ్రంథములు సుత్తములతో కూడిన ౫ నికాయములు ఆ కాలమునకు పూర్వమే వెలువడియుండెనని చెప్పుచున్నది. క్రీ.పూ.౧వ శతాబ్దమునకు చెందిన 'మిలిందపఞహ' గ్రంథమూలముగా త్రిపిటకము క్రీ. పూ. ౧వ శతాబ్దమునకు పూర్వమే యున్నదని తెలియుచున్నది.

పై కారణములవల్ల 'పాళీ' మతభాషగను, సారస్వతభాషగను కూడ క్రీ. పూ. ౩౦౦ సం. నుండి క్రీ. వె. ౧౧౦౦ సం. వరకును ప్రజలు ఉపయోగించెడు వారని నిర్ధారణచేసి చెప్పవచ్చును.

తరువాత కాలక్రమమున సంస్కృతభాషవలె మృతభాషయై పాళీభాష కొద్దిమంది పండితులచే చదువబడెడిది. రానురాను పండితులు పాళీభాషను ధారాళముగా వ్రాయలేక సంస్కృతపదములు హెచ్చుగా చేర్చి కొన్ని వ్యాఖ్యానములు వ్రాసిరి. సంస్కృతభాషకు గల నిబంధనలే (అలంకార, వ్యాకరణ, ఛందస్సూక్తములు) పాళీభాషకుకూడ అనుకరించిరి.

పాళీత్రిపిటక గ్రంథములు సింహళ, సయాం, బర్మాదేశభాషలలో వ్రాయబడియున్నవి. ఇంగ్లాండు దేశములో ఏర్పడిన పాళీగ్రంథసంఘమువారు ఈ గ్రంథములను రోమన్ లిపిలో అచ్చొత్తించిరి. జర్మనీ దేశములోకూడ కొన్ని పుస్తకములు ముద్రింపబడినవి. జర్మన్ బౌద్ధభిక్షువులు జర్మనుభాషలో త్రిపిటకమును సిలోనులో విహారము నిర్మించుకొని అనువాదము చేయుచున్నారు. ఈ విహారము 'రత్గమ' సరస్సులో నుండు చిన్న ద్వీపములో ఉన్నది. దీనినే 'పొల్గదువ' అని పిలుతురు. దొడన్డువ రైల్వేస్టేషనుకు ఇది కనుమాపు దూరములో ఉన్నది. ఈ జర్మన్ బౌద్ధభిక్షువులకు గా॥ జ్ఞానతిలక నాయక థేరో (Prof. A. Gusth) అధ్యక్షులు. వీరి ఆశ్రమమునుగురించియు, చరిత్రనుగురించియు విపులముగా మరియొకసారి వ్రాసెదను.

బొంబాయి విశ్వవిద్యాలయమువారుకూడ కొన్ని గ్రంథములను నాగరలిపిలో ఇప్పుడిప్పుడే ముద్రింపబోవుచున్నారు. మహాబోధి సొసైటీ (ఇండియా) వారుకూడ కొన్ని గ్రంథములను హిందీలోనికి తర్జుమాచేయుచున్నారు.

ఆంధ్రదేశమునకును సింహళమునకును పూర్వకాలమునుండి మతస్నేహవాణిజ్యబాంధవ్య ముండుటయేగాక ఆంధ్రచక్రవర్తులు సింహళదేశపు రాచకన్యలను (బోధిశ్రీ, చామశ్రీ) వివాహమాడినట్లును, వారిని మెప్పించుటకై కొన్ని విహారములను నిర్మించిరనియు చరిత్రవలన తెలియుచున్నది. ఆ విహారములే అమరావతీ, నాగార్జునవిహారము లని చరిత్రకారులు చెప్పినను రూఢిగా చెప్పుటకు తగిన నిర్ధారణయైన పాళీ

పుస్తకములు పూర్తిగా చదివినగాని నిర్ధారణ చేయలేము.

పొలన్నరువా శిథిలవిహారములలో (సిలోన్) మెట్ల క్రిందను పరచిన అర్ధచంద్రాకారపు చంద్రశిలలు (MoonStones—రాతిఫలకములు) కృష్ణానదీప్రాంతము నుండి ఎగుమతి అయినవని కొన్ని మాసములపూర్వము 'సిలోన్ అబ్జర్వర్' పత్రికలో నిరూపించిరి.

"కథావత్థు" అనే గ్రంథములో (అంధక దేశము) ఆంధ్రదేశమునుగురించి వ్రాయబడియున్నది.

ఆంధ్రవిశ్వవిద్యాలయమువారుకూడ శ్రద్ధవహించి పాళీ గ్రంథములను చదువ నుత్సాహితులకు వారి లైబ్రరీనుండి పుస్తకముల నిచ్చి ఆంధ్రసింహళదేశముల మధ్య నుండిన పురాతనసంబంధములను కనుగొనుటకు గాను ప్రోత్సహించెదరని నమ్ముచున్నాను.






"లక్సు టాయ్‌లెట్ సబ్బుతో
మీచర్మమును శుద్ధముగను,
అందముగను యుంచుకొనండి" అని
కుమారి ఎన్. రాజం చెప్పుచున్నది

సినిమా తారలకు
సౌందర్య మునిచ్చే సబ్బు



# బీటా కేఫిన్

(తలనొప్పి బిళ్లలు)

అన్ని నొప్పులను, జ్వరములను కుదుర్చును. తలనొప్పి, పంటినొప్పి, కాళ్లనొప్పి, నిద్ర లేకుండుట, కీళ్ల నొప్పులు, మలేరియా, స్త్రీల బహిష్టునొప్పులు, అలసట, వగైరా అన్నిటికి గ్యారంటీగా పనిచేయును. వాడు కొను విధము పొట్లములో నుండును.

పొట్లం 3 బిళ్లలు 1 అణా.



# బీటా లాక్సు

చాక్‌లెట్ భేదిబిళ్లలు.

సుఖవిరేచనౌషధము

ఇది సుఖ విరేచనము కలిగించి మలబద్ధమును పోగొట్టి మంచి జీర్ణశక్తి నిచ్చును. పొట్లం 2 బిళ్లలు 1 అణా.

అన్నిచోట్ల దొరుకును.

Stockists: M/S DADHA & Co.,
P. T. Madras.

*Manufactured by*
**BOMBAY TABLET MFG., CO.,**
P. O. Box 2092, BOMBAY. 2

# జగత్ప్రసిద్ధి వహించిన
# వైద్యనిపుణుడు

మీరు ఉత్సాహము, బలము లేనిచో వెంటనే డా॥ నారును కలుసుకొండి. అతడు



మీ దేహమును పరీక్షించి మీ బలహీనతకు, నిరుత్సాహమునకు గల కారణముల నెరిగి చికిత్స చేయుదురు. పూర్తిగ నయమగుటకు హామీ యివ్వగలరు. అకాల వృద్ధాప్యమునకు దివ్యౌషధము నివ్వగలరు. స్త్రీపురుష వ్యాధులకు చికిత్స చేయుటలో ప్రఖ్యాతి పొందినవారు.

డాక్టరు నారు, సెక్సాలజిస్టు,
నారు హాస్పిటల్, 24, బ్రాడ్వే, మద్రాసు.

ఉదయము 8 మొదలు 12 గంటలవరకు. సా॥ 4 మొదలు 7 గంటలవరకు, ఆదివారం, సెలవరోజులలో పగలు 8—12వరకు. సాయంత్రము మూసివేయబడును. రహస్యమైన చికిత్స-జవాబు వ్రాయుటకు స్టాంపు పంపవలెను.



# స్వతంత్ర భారతి

శ్రీ బట్టిప్రోలు కృష్ణమూర్తి

ఈ స్వేచ్ఛారహితార్తజీవితములో ఇన్నాళ్ళుగా గంటిమే
ఆ స్వప్నమ్ములు మూర్తమైన వదె లోహద్వారముల్ గూలగా
భ స్వాంతమ్మయి గానవచ్చు అమరస్వాతంత్ర్యసౌధమ్ము! వ
ర్వాశ్వాసాంతము భారతీయ పరసేవాఖ్యాయికన్ నేటితో!

ఆ దివ్యావసథాంతరాళమున సామ్యమ్మంట! చాంపేయ భూ
షా ద్వగ్గావనినాథహస్తమును సస్యక్షేత్రమ్ము తాన్నమయ
స్వేదాస్వీతము గా నిదే మధువు నాశింపంగరాదంట! వ
పాదద్వంద్వము నందజాలదట నిర్భాగ్యప్రణామ మ్మికన్!

ఆ లో వెల్గుచునున్న దీపికల దివ్యస్నిగ్ధరోచిశ్ఛటల్
పాలాడున్ సకలప్రజామృదులహృద్భాగాశ్రితస్ఫీత పా
తాళధ్వాంతచయమ్ములన్, ప్రతి దృగంతస్వాపభావమ్ములన్,
శ్రీలాలోచన వృత్తి గర్వమున మాంజిష్ఠ ప్రకాశమ్ములన్!

సహచరులార ! ఒక్కనిముస మ్మిట నాగుద మీయుపోమహా
న్మహాతరుణమ్మునం దమరమందిరసుందరశాంతిసీమలో
పిహ్వాతికి బోవుచుండు నెరవేర్పగనున్నది మానదీక్షతో
విహితము ధర్మ మొక్కడది విస్మృతిపాలయి పోవనిత్తురా ?

ఈ శుభవేళకోసము తపించి తపించి నశించిపోయినా
రాశయపూర్తి నందకె మహత్తరజీవులు లక్షలాదిగా !
పేశల పుష్పపత్రములు వేనకువేలుగ రాలిపోయె పై
దేశపు రాజదండము విధించిన స్వార్థపు నీతిరీతిలో !

గాసిలిబెట్టు ఆ స్మృతుల గాయము లీ హృదయాల ! భక్తిగ
న్వ్రాసి తోరంగనిందు తదనుస్మృతిగా ఒక బాష్పబిందువే,
ఆ సుమనః ప్రశాంతి కటు హైమనశీతలమృత్యుమందిరా
వాసము గొన్న సోదరుల స్వార్థవిహీనుల ఆత్మశాంతికై !

సోదరులార ! రండు మనసుల్ బరువున్ విడ! క్రొత్తయింటికిన్
బోదము—తెల్లవారినది పూర్వపు చీకటి జారె సర్వమున్ !
హ్లాదముతోడ గాలి గదలాడు స్వతంత్రపతాక మల్లదే!
ఈ దెసలెల్ల మ్రోగ పలికింతము జైయని ఈ యెలుంగులన్ !

తీరిన దిన్నినాళ్ళకు సుదీర్ఘపు దాస్యజీవితమ్మ్! చ
ల్లారిన వమ్మ గుండియల నగ్నమై జ్వలియించు వేదనల్!
తూరుపుకుం గిరీటమయి శ్రీకరియై వెలుగొందు శ్రీలన
ద్భారతభూమి శాంతిమధువారిధి చుట్టిన దివ్యసీమమై!



# లింగవచనములు

= శ్రీ గరికిపాటి కృష్ణశాస్త్రి =

ప్రాణం గల వస్తువులన్నీ స్త్రీ లింగములలోనో, పుంలింగములలోనో ప్రయోగింపబడుతై; ప్రాణం లేనివి నపుంసకలింగములలో అని సామాన్యంగా లోకంలో అంతా అనుకునే మాట. కాని, శబ్దముల స్త్రీపుం నపుంసకలింగములను నిర్ణయించుట అనుకున్నంత తేలిక గాదు. ఫ్రెంచి భాషలోను, హిందీభాషలోను స్త్రీ పుంలింగములు మటుకే ఉన్నై. నపుంసకలింగము లేనే లేదు. బల్ల, కుర్చీలను ఆ భాషలలో స్త్రీలింగంలోనే వ్యవహరించాలి. ఇంగ్లీషుభాషలో మూడు లింగాలూ ఉన్నైగాని చంద్రునికి స్త్రీలింగములోనే ప్రయోగము; రైల్వే ఇంజను కూడా స్త్రీ లింగములోనే. అచేతనమైన వస్తువులను చెప్పే శబ్దాలు అన్నీ ఏ భాషలోనూ నపుంసకలింగములోనే లేవు. "స్త్రీలు ఒక పదార్థమును నిర్దేశించి చెప్పినప్పుడు వారు దానిని స్త్రీ లింగములోనే వ్యవహరించి ఉంటారు. పురుషులు చెప్పినప్పుడు పుంలింగములోనే చెప్పి ఉంటారు"[1] అని గ్రైజరు అనే పండితుడు ఒక సిద్ధాంతము నిలబెట్టి, ప్రాణం లేని వస్తువులను స్త్రీలింగములోనో, పుంలింగములోనో చెప్పే ఆచారము ఏలాగు బయలుదేరినదో నిర్ణయించాడు. ఋజువు చెయ్యటానికి వీలులేని విషయాలలో ఎన్నైనా సిద్ధాంతాలు చెప్పవచ్చును. "కాంతాలగ్నమనస్కుడై పురుషుడు పదార్థములన్నిటిలోనూ స్త్రీత్వం చూచి వాటిని చెప్పే శబ్దాలను స్త్రీలింగములోనే వ్యవహరించాడు. అలాగే కాంతాలగ్నమనస్కురాలై స్త్రీ సర్వపదార్థములందును పుంస్త్వమే చూచి వాటిని పుంలింగశబ్దములలోనే వ్యవహరించినది" అని సిద్ధాంతీకరిస్తే — ఇదేమీ అసహజంగా ఉండదు.

సంస్కృతశబ్దముల లింగము తెలుసుకోవటము పడే ఇబ్బంది ఇంతా అంతా కాదు. స్త్రీపుంనపుంసకములకు భేదం ఏమిటి అని ఎవరైనా అడిగితే పతంజలితోబాటు ఇలాగ చెప్తారు:

"స్తనకేశవతీ స్త్రీ స్యాత్
లోమశః పురుషః స్మృతః,
ఉభయోరంతరం యచ్చ
తదభావే నపుంసకమ్."

స్తనకేశములు గలది స్త్రీ, రోమభూయస్త్వం చేత పురుషుడు, ఈ రెంటికీ సదృశమై ఈ రెండూ కాకుండా ఉన్నది నపుంసకము. లోకంలో అంతా ఈ గుర్తులనుబట్టి లింగనిర్ణయము చేస్తారు.

లౌకికమైన లింగమును అనుసరించి శబ్దముల లింగనిర్ణయము చేస్తాము అంటే సంస్కృతములో అసలే కుదరదు. తటశబ్దము నపుంసకలింగములోనే ఉండవలసినది మరి. లింగములలోనూ ప్రయోగింపబడుతున్నది- తటః, తటమ్, తటీ అని. దీనికి స్త్రీ పురుష లక్షణములు లేవుగదా! ఈ శబ్దము ఒకటే ఏలాగో ఒప్పుకుందాము అంటే కేవలము స్త్రీత్వవిశిష్టమైన పదార్థమును చెప్పే శబ్దములు లింగవ్యత్యయమును పొందినై. భార్య అనే పదార్థము, శబ్దముకూడా స్త్రీలింగవిశిష్టమే. ఆ అర్థమును చెప్పే కళత్రశబ్దము నపుంసకలింగములో ప్రయోగము; దారశబ్దమునకు

"1. Quoted in Sarkar's Linguistic Speculations of the Hindus."

పంచమీప్రయోగము యుక్తము. కాని యీ పంచమి సప్తమినుండి యేర్పడినదే యైనను (నలను—నలనక్) దీనిపై 'ఉండి' శబ్దముకూడ చేర్చినగాని, అనగా "నాయందునుండి, నావలననుండి" అని చెప్పినగాని, అర్థస్ఫురణము కలుగుటలేదు. "సర్వార్థమునందు ఋణ విముక్తుడు" అనగా సురువున కివ్వవలసిన యర్థము, లేదా ప్రయోజనరూపమైన ఋణమునందుండి, ఋణము వలన నుండి విముక్త దన్నమాట. "నాయం దర్థము గొని పొమ్ము" అనగా నాయందునుండి, నావలననుండి, నాదగ్గరనుండి ధనము గ్రహింపుము అని యర్థమగును. 'మత్తః' అని గ్రహణార్థాదియోగంబున పంచమి విధింప బడినది. తెలుగున పెద్దన చెప్పినట్లుగా "తృతీయయు, పంచమి, సప్తమియును ఏకార్థనియతి కెల్లం" గావున అన్నంతముతోపాటు అందు అనునదికూడ పంచమ్యర్థమున వాడబడినది. తరువాత నీ యర్థము వ్యక్తము చేయవలసివచ్చినపుడు 'అందుండి', 'దానివలననుండి' అని 'ఉండి' శబ్దముకూడ చేర్చబడుట ఘటిల్లినది. ఈ పని సప్తమ్యర్థకమే యగు 'లో' అను శబ్దము ప్రయోగించినపుడు కూడ చేయవలసివచ్చినది. నన్నయ "నూతిలో వెలువడ గోమలిం దిగిచె" నన్నపుడు నూతిలో వెలువడుట యేమిటని యిప్పు డనిపించక పోదు. 'లో'కిగూడ 'ఉండి' చేర్చి "నూతిలోనుండి వెలువడునట్లుగా" కోమలిం దిగిచినా డని చెప్పకొనిన గాని మన కిపుడు బోధపడదు.

ఈ చిక్కు నన్నయనాటికి కొంతవర కేర్పడి యుండవచ్చును. కావుననే "నీరిలోననుండి రొంగయు దెంచె"నని యాతడే ప్రయోగించినాడు. "నూతిలో వెలువడె" నన్నట్లు "నీరిలో నెగయుదెంచె"నని చెప్ప లేదు. అర్థస్ఫూర్తి లేకపోవుటచే గాబోలును. "భూమి దేవి నీరిలోనుండి వెలువడినది."

ఈ 'అందు' అనుదానిని నన్నయ యింకను విశేషార్థములందు బ్రయోగించినాడు. అతనికి పూర్వమున గల శాసనముల భాషలో గనబడకపోవుటచే నాతడే యిట్టి వాడుకకు మూల మనవలసియుండును.

"నీవు మాయందు గుడిచి" అనగా 'మాయింటి లో'నని యర్థము.

"ఇంద్రునం దునికియు" అనగా 'ఇంద్రుని పట్టణమున, లేదా సభలో' నని యర్థము.

"గిరివ్రజంబు నద్వారంబునందు జొచ్చిరి" అనగా 'ద్వారములేని ప్రదేశముమూలముగా (ద్వారా) లోన ప్రవేశించి' రన్నమాట.

ఈ యర్థమునందే 'అన్'-"విమతగపతి యహి లోకమున కరిగె ధూవివరమునన్." (ఆది. ౧-౧౦౨) ఇట్లే 'అందు' అనునది స్థలవాచకశబ్దమగు 'అల్' అను దాని రూపాంతరమే యై, (అల్ > అన్ > అందు) ప్రదేశము అను నర్థమే కలదైనను, సందర్భానుసారముగా భిన్నార్థములందు నన్నయచే బ్రయోగింప బడినది.

"లాలితాపూర్వసభాలోకనంబున యందు జాదంబు కార్యంబె చెపుము"—అనగా "సభాలోకన సమయమందు, లేదా సభాలోకనమాత్రమునకే వచ్చిన సందర్భమునందు" అని చెప్పకొనవలె. "సభా లోకనమే ఉద్దేశముగా పెట్టికొని వచ్చిన సమయమం"దని తాత్పర్యము.

"అఖిలలావణ్యపుంజంబు నబ్జభవుడు
మెలతగా దీనియందు నిర్మించెనొక్కొ."

"లావణ్యపుంజము నంతను దీని స్వరూపముగా దీనియం దమరునట్లుగా జేసినాడా"యని అర్థము చెప్ప కొనవలెను. 'దీనియందు నిర్మించుట' యనునది సులభముగ బోధపడునట్టిది కాదు.

"అట్టియందు గోవిందుందు శ్రీసధ కేగి"

"ఎల్లయందు నధికసాత్వికు డాస్తికు డనగ జనులం"

"అట్టి సందర్భమునందు, ఎల్లలోకమునందు = లోకమునం దెల్లెడల" అను నర్థము సులభముగానే స్ఫురింప వచ్చునుగాని, ఇప్పటి వాడుకలోనివి కావు. "నారదు వచనంబువలన ద్రౌపదియందు సమయక్రియ" = "ద్రౌపది విషయమున జేసిన ప్రతిజ్ఞ".

"ధర్మరాజును రాజ్యంబునందు సమర్పించిన" = రాజ్యముచేయుటకై ధర్మరాజును నియోగించిన. "రాజ్యే నివేశ్య" అనుదానికి తెలుగు కాబోలు.

శబ్దముల లింగనిర్ణయము చేస్తాము అంటే వైయాకరణులకు కుదరదు అని అన్నాడు.

లింగవచనములు శబ్దగుణములే. గౌః అనగానే ఒక ఆవు అని అర్థసంప్రత్యయము కలుగుతున్నది. గోశబ్దమునకు ఎద్దు అనే అర్థము ఉన్నదికాని లోకంలో ఆవును నిర్దేశించినప్పుడే గోశబ్దప్రయోగము చేస్తారు అని భావము. గౌః అని అనగానే గోత్వజాతి (ఆకృతి) స్ఫురిస్తున్నదా, లేక గోవ్యక్తి (ద్రవ్యము) స్ఫురిస్తున్నదా? ద్రవ్యాభిధానం వ్యాడిః—వ్యాడి అనే ఆయన వ్యక్తి స్ఫురిస్తున్నది అంటాడు. అదృష్టలింగమైనది వ్యక్తికాబట్టి ఈవాదంలో స్త్రీపుంనపుంసకలింగములు శబ్దమునకు సిద్ధమౌతై. ఆలాగే వచనము కూడాను. ఏకత్వద్విత్వబహుత్వము వ్యక్తికి సిద్ధమే కదా. కాని ఈ వాదము అవలంబించినందున ఒక ఇబ్బంది ఉన్నది. "బ్రాహ్మణో నహంతవ్యః, సురా నపేయా—బ్రాహ్మణుని చంపకూడదు. సుర త్రాగకూడదు" అని ధర్మశాస్త్రము. వ్యక్తివాదములో బ్రాహ్మణశబ్దవాచ్యుడైన ఒక వ్యక్తిని విడిచి మిగిలిన బ్రాహ్మణుల నందఱనూ చంపినప్పటికీ దోషము ఉండదు. ఆలాగే సారాయిబొట్టు ఒకటి మిగిల్చి సీసా అంతా ఖాళీచేసినవాడు ధర్మశాస్త్రవిరోధంగా ప్రవర్తించినవాడౌతాడు.

వాజప్యాయనుడు అనే ఆచార్యుడు శబ్దము జాతిని చెప్పుతున్నది అంటాడు. ఈయనమతం ఒప్పుకుంటే 'బ్రాహ్మణో నహంతవ్యః' అన్నప్పుడు బ్రాహ్మణమాత్రుడుని చంపకూడదు; సురామాత్రము త్రాగకూడదు. కాని ఈ వాదములో లింగవచనములు సిద్ధముకావు. ఆకృతి అనేది ఒకటే అయివుండాలికదా! ఆలాగున ఉన్నప్పుడు ద్వివచనము, బహువచనము అనేవి ఆకృతిలో ఉండవు. ఆకృతిసహచరితమైన ద్రవ్యము శబ్దముచే నిర్దేశించబడేది అని చెప్పినట్టయితే వచనమునకు వచ్చిన ఇబ్బంది తీరిపోతుంది. గోత్వజాతి ఒక్కటే అన్నప్పుడు అనేకమైన గోవ్యక్తులలో ఈ గోత్వజాతి ఒక్కటి ఏలాగు సిద్ధమౌతుంది అంటే 'ఇంద్రవద్విషయః' అని వార్తికం వ్రాశాడు కాత్యాయనుడు. ఇంద్రుడు ఒకడే. అనేకక్రతువులలో ఆయనను పిలుస్తారు. ఈ క్రతువులన్నీ ఒక్కసారిగా చేసినప్పటికీ ఇంద్రుడు అన్నిటిలోనూ ఒక్కసారిగా ప్రత్యక్షమౌతాడు. ఆలాగే అనేకవ్యక్తులలో జాతి ఒక్కసారిగా ప్రత్యక్షమౌతుంది.

లౌకికమైన లింగమును ఆశ్రయించిన, ఆకృతి వాదంలో, శబ్దముయొక్క లింగముకూడా సిద్ధముగాదు. అవిష్టలింగమైన ద్రవ్యము ఉత్పత్తిప్రభృతి వినాశం వరకు తన లింగమును విడిచిపెట్టదు. బ్రాహ్మణశబ్దము పుంలింగములో ఒకసారి చెప్పినట్టైతే మళ్ళీ "ఇయం బ్రాహ్మణవ్యక్తిః" అని స్త్రీలింగప్రయోగము గాని, "ఇదం బ్రాహ్మణవస్తు" అని నపుంసకలింగప్రయోగముగాని కుదరదు.

కాబట్టి స్తనకేశాదిలౌకికలింగాశ్రయణమువలన శబ్దలింగనిర్ణయము చేయుటకు వీలులేదు. 'అశక్యం స్వకృతాంత ఆస్థేయః'—వైయాకరణులు తమసిద్ధాంతము ఏదో ఒకటి చెప్పుకోవాలి. 'సంస్త్యానప్రసవౌ లింగమ్'—గుణముల సంస్త్యానము స్త్రీలింగలక్షణము; గుణముల ప్రవృత్తి పుంలింగలక్షణము. శబ్దస్పర్శరూపరసగంధముల సంఘాతమే, తిరోభావమే, క్షయమే స్త్రీలింగలక్షణము; వాటి ప్రవృత్తి, ఆవిర్భావమే, వృద్ధియే పుంలింగలక్షణము. వృద్ధిక్షయములు లేక సామ్యావస్థయైన స్థితి నపుంసకలింగలక్షణము.

సత్త్వరజస్తమోగుణములు శబ్దాదిగుణములుగా పరిణమించినవి. ఈ శబ్దాదిగుణముల సంఘాతమే ఘటపటాదిద్రవ్యసముదాయము. ఇది సాంఖ్యసిద్ధాంతము. దీనిప్రకారము పతంజలి ఈ లింగనిర్ణయము చేశాడు అని కైయటుడు. యోగభాష్యములోకూడా 'గుణసమూహః ద్రవ్యము' అని పతంజలి చెప్పినాడు అని ఉన్నదట. నాగోజీభట్టు సాంఖ్యసిద్ధాంతమును ఇలాగు వివరించాడు. సత్త్వరజస్తమోగుణాత్మకమైన ప్రకృతి 'మహత్' శబ్దవాచ్యమైన బుద్ధిగా పరిణమించినది. బుద్ధినుంచి అహంకారము, అహంకారమునుంచి గంధరూపరసస్పర్శశబ్దాత్మకపంచతన్మాత్రలు, దశేంద్రియములు, మనస్సు వచ్చినవి. గంధాదులు అయిదు గుణములు పృథివిగాను, రూపాదులు నాలుగు జలముగాను, రసాదులు మూడు తేజస్సుగాను, మిగిలిన రెండూ

వాయువుగాను, శబ్దము ఒకటి ఆకాశముగాను పరిణమించినవి. పురుషుడు పరిణామరహితుడు, చైతన్యస్వరూపుడు అని, ప్రకృతి అచేతనము అని, భోగాపవర్గలక్షణమైన అర్థమును పురుషునకు సమకూర్చుటకు అచేతనమైన ప్రకృతిని ఈశ్వరుడు ప్రవర్తింపజేస్తాడు అని సేశ్వరసాంఖ్యుల సిద్ధాంతము.

గుణముల ప్రవృత్తి, ఆవిర్భావము, వృద్ధి కనబడే పదార్థము పుంలింగములో ప్రయోగించాలి అని, గుణముల తిరోభావము, అపాయము కనబడే పదార్థము స్త్రీలింగములో ప్రయోగించాలి అని చెపితే ఒక ఆక్షేపం వస్తుంది. పదార్థములు అన్నీ ఎప్పుడూ పరిణామము పొందుతూ ఉంటై. ఒక్క ముహూర్తము కూడా ఒక్క స్థితిలో నిలకడగా ఏదీ ఉండదు. పెరుగుతూనో తరుగుతూనో ఉంటుంది. "నహి కశ్చిదపి స్వస్మిన్ ఆత్మని ముహూర్తమప్యవతిష్ఠతే, వర్ధతే వా యావదనేన వర్ధితవ్యమ్, అపాయేన వా యుజ్యతే" వృద్ధిక్షయములు ఒకే పదార్థములోనే కనపడుతూ ఉన్న స్వరూపలింగవిభాగం చెయ్యటం ఏలాగు అని ఆక్షేపం వచ్చింది. అప్పుడు వివక్షచేత శబ్దముల లింగము చెప్పాలి అన్నాడు పతంజలి. గుణముల వృద్ధి చెప్పదలచినప్పుడు పుంలింగము, గుణముల అపచయము చెప్పదలచినప్పుడు స్త్రీలింగము. ఒక శబ్దము పుంలింగములోనే ప్రయోగింపబడుతున్నది అంటే ఆ శబ్దముచే చెప్పబడే పదార్థము యొక్క గుణముల వృద్ధినే చెప్పదలచుకున్నారు అని దీనివలన అర్థమౌతున్నది. అలాగే స్త్రీలింగనిర్దేశము కూడా.

వివక్షమీద ఆధారపడి ఉంటుంది లింగనిర్ణయము అని చెప్పినప్పుడు ఆ వివక్ష శిష్టులదే. 'తిస్రోక్తా లోకతో నామ' శిష్టలోకమునుంచి లింగవ్యవస్థ తెలుసుకోవలెను. బ్రహ్మతత్త్వసాక్షాత్కారము పొందిన శిష్టులు శబ్దార్థములయందు ప్రమాణము. ధర్మజ్ఞాన కర్తవ్యబుద్ధిచే శిష్టులు శబ్దమును ఏ లింగమునందు ప్రయోగించిరో ఆ లింగమునందే ఆ శబ్దమునకు ప్రయోగము అని భర్తృహరి వ్యాఖ్యానం చేశాడు.

ఈ సిద్ధాంతము అంతా ఒప్పుకున్నా ఇంకా లింగనిర్ణయంలో ఉన్న ఇబ్బందులు తీరవు. "ఏకార్థే శబ్దాన్యత్వాత్ దృష్టం లింగాన్యత్వమ్, అవయవాన్యత్వాచ్చ" అని పాణిని. ఒకే పదార్థమును చెప్పే శబ్దాలలో లింగాన్యత్వము ఉన్నది. తారకా, పుష్యః, నక్షత్రమ్ అని ఒకే పదార్థమునకు మూడు లింగములు ఉన్నవి. శబ్దాన్యత్వభేదంచేత పదార్థము ఒకటి అయినప్పటికీ, లింగభేదం కుటీ, కుటీరః అనే చోట్ల కనబడుతున్నది. ఇవన్నీ చూచి చివరకు ప్రాణంవిసిగి పాణిని 'లింగమశిష్యం లోకాశ్రయత్వాల్లింగస్య' లింగము శాసించకూడదు అది లోకమును ఆశ్రయించి ఉండును అని అన్నాడు. లోకము అంటే శిష్టలోకము అన్నమాటే. వృద్ధిక్షయము లేకుండా స్థితిలక్షణము కలిగినది నపుంసకలింగము. ఆవిర్భావతిరోభావములకు మధ్యన ఉన్న అవస్థ స్థితి అని కైయటుడు. స్థితి బ్రహ్మపదార్థలక్షణము కాబట్టి బ్రహ్మన్ శబ్దము నపుంసకలింగములోనే ఉన్నది అని కొందఱు. ఈ నపుంసకలింగమే ప్రధానము అన్నాడు పతంజలి. నపుంసక అనపుంసక శబ్దముల సన్నిధిలో నపుంసకశబ్దమే మిగులుతున్నది. నపుంసకలింగప్రాధాన్యము లోకంలో కూడా కనబడుతూనే ఉన్నది. పుంలింగలక్షణమో స్త్రీలింగలక్షణమో కలిగి, అనిర్జ్ఞాతమైన అర్థముగల శబ్దమును లోకంలో నపుంసకలింగములోనే ప్రయోగిస్తారు. 'కింజాత మిత్యర్థ్యతే, ద్వయం చైవహి జాయతే స్త్రీ వా పుమాన్ వా'—ఆడపిల్ల గాని, మొగపిల్లవాడు గాని పుడతాడు. కాని ప్రయోగంలో ఆ రెండు లింగాలూ విడిచిపెట్టి నపుంసక లింగంలో "ఏమిటి పుట్టింది" అని అడుగుతారు. దూరాన చూచి "ఆ వస్తున్నది ఏమిటి? మనుష్యుడా, దున్నపోతా?" (మహిషీరూపమివ బ్రాహ్మణీరూపమివ) అని అంటారు. కాబట్టి ప్రధానమైనది నపుంసకలింగము అని పతంజలి.

---

# ప్రాచీన భూగోళము

— శ్రీ వేలూరి శివరామశాస్త్రి —

రఘువంశమున నాలవ సర్గము చదువుచో దేశభ్రమణము చేయవలయు ననుకోరిక కలుగును. అది తీఱు నుపాయ మందఱకును గలుగదు. తెలుఁగుకవులలో దేశాటనము చేయించినవాఁడు పింగళిసూరన. పురాణములలోని బ్రహ్మాండవిన్యాసమును చదివినచో ఆ దేశభ్రమణపు కోరిక దిగ్భ్రమణముగా మాఱును. ఏలన, ఈ పురాణములలోఁ గల ద్వీపములు సముద్రములు కొండలు నదులు మొదలగువానినిఁ జదివికొనుచుఁ బోవుచో నివి యన్నియు కల్లయనియో, లేక ప్రళయము వెనుకటివనియో తోఁచును. ఏకారణమువనో, ౧౯ వ శతాబ్దిలోని పాశ్చాత్యవిమర్శకులు కొందఱు ఈ పురాణము లన్నియు పెంటకుప్పలకు శరీరవృద్ధి చేయునని వ్రాయుటకు తెగించిరి. స్మిత్, విల్సనులు వంశానుచరితమును మాత్ర మొకకంట నాదరించి పరిశిష్టమును సమ్మకముగా బూటకమని బూకరించిరి. Pargitor మొదలగు కొందఱు పైవారికి ప్రతికక్షులు.

ఇరువదవ శతాబ్ది ఆరంభము మొదలుకొని మన దేశమునందు ప్రాచ్యపాశ్చాత్య సంప్రదాయము తెలిఁగిన విద్వాంసులు పురాణములను పరిశోధించుచున్నారు. ఇప్పుడు శ్రీ పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారును, శ్రీ వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రిగారును పురాణములను శోధింపఁబూనుట తెలుఁగువారి భాగ్యము.

తలనొప్పి రావించుకొనఁదలఁచుచో పురాణము లందలి భూగోళవర్ణనమును, పిదప రాజవంశవర్ణనమును చదువవలయును. Pargitor, దీక్షితార్, B. C. Law, జె. సి. రే మొదలగువారిలోఁ గొందఱు ఈ తలనొప్పికి అమృతాంజనమును, కొందఱు మిరియపుగంధమును వ్రాయుచుఁబోయిరి. ఇంకను దీనికి సరియగు మందు కనఁగొనవలసియేయున్నది.

## పురాణ ప్రాచీనత

పురాణములలో వాయు విష్ణు మత్స్య మార్కండేయములు ప్రాచీనము లనియు, వానిలో వాయుపురాణము ప్రాచీనతమ మనియు పరిశోధకులలో పలువుర విశ్వాసము. దీని ఉత్పత్తికాలము క్రీస్తుశకము ౪ శతాబ్దుల వెనుకకుపోదు, క్రీస్తుశకము ౪ శతాబ్దుల కీవలకు రాదు అని వారి యూహ. మఱియు ప్రకృతము మన కుపలబ్ధమగునది వాయుసంహిత. తొలుతటి వాయుపురాణమనునది దీనికంటెఁ జాలఁ జిన్నదయియుండును. ఇది మూఁడు కాలములలో పరివర్ధితము, పరిశోధితమును అయినది. ఈ మాట మత్స్యపురాణమునకును, విష్ణుపురాణమునకును చెల్లును. దీనికి సాక్ష్య మీ పురాణములందే కలదని కొందఱు విమర్శకులు సోదాహరణముగా నిరూపించిరి. ఈ పురాణములలో వాయుపురాణము ప్రాచీనతమ మనుటకుఁ దగు హేతువు లివి: పురాణలక్షణము సర్గము, ప్రతిసర్గము, వంశము, మన్వంతరము, వంశా(శ్యా)నుచరితమును దీనికి2 గలవు. మిగిలినవానిలో భిన్నలక్షణము లెక్కడు. అనఁగా ఇతర

1. స్కాందభాగవతాదుల పురాణ పరిగణనములో వాయుపురాణము లేదు. దేవీభాగవతాదులలో ఇది మహాపురాణ మని యున్నది.

2. భాగవతము తనకు పదిలక్షణములు కలవని చెప్పుకొనెను. భాగవతము రెండవస్కంధమున పదవ యధ్యాయము చూచునది. పురాణసామాన్యలక్షణము కంటె నిది విలక్షణము. కావునఁ గొన్ని పురాణములు భాగవతమును పురాణములలో జమకట్టలేదు. ఐనను ఇది 'నిగమకల్పతరోర్గళితం ఫలమ్'.

పురాణములందు ప్రక్షిప్తము లెక్కువ. దీన కక్కువ 3. ఈ పురాణమునం దవతారవాదము లేదు 4. భారతమును, దాని కనుబంధమగు హరివంశమును దీనిని పేర్కొనెను 5.

## పండిత సంప్రదాయము

పురాణముల కాలనిర్ణయము చేయుటకు వీలు లేదు. కల్పాదియందు బ్రహ్మ పురాణములను మనస్సులో సంకల్పించెను 6.

'పురాణములందు రాజవంశవర్ణనము కలదుకదా! కావున దానిఁబట్టి పురాణముల కొక కాలమేర్పడుట లేదా?'

'లేదు. ప్రతికల్పమునందును రాఁగల రాజవంశముల వర్ణనము ఉండవచ్చును.'

'అగుచో ప్రతికల్పమునందును ఈ రాజవంశమే యుండునా?'

'ఉండును—సూర్యాచంద్రమసౌ ధాతా యథా పూర్వ మకల్పయత్'

'ఐనను దీనికి ఏదో యొకకాలము కనఁబడుచున్నదిగదా!'

'అగును. ఇది సంసారమువలె అనాది. అటులే రాజవంశముకూడ అనాది. అటులఁ గానిచో శ్రుతులందును ఇతివృత్తములు 7 కలవు. కావున పురాణము లనాదులు. కావుననే ఛాందోగ్యమున 'ఇతిహాసపురాణం పంచమం వేదానాం వేదమ్' అనికలదు.

కావున పురాణకాలపరీక్ష వీలుకానిది. మఱియు బ్రహ్మాండ మెల్లయు భగవంతుని స్థూలరూపమని తెలుపుటకే కాని పురాణములలోని భూగోళఖగోళవర్ణనము నేఁటి అర్థములో భూగోళవిజ్ఞానము కాదు. మఱియు, మాటిమాటికి మాఱుచుండు నీ జనపదములయు, దేశములయు వర్ణనమువలన నేమి యుపయోగము కలదు! ఆధునికులు స్థూలదృష్టితో సర్వే చేసి స్థూలజగత్తును వర్ణింతురు. మహర్షులో, యోగదృష్టితో సూక్ష్మలోకములను చూచి పురాణములలో వర్ణించిరి. కాఁబట్టి పురాణములందలి బ్రహ్మాండవిన్యాసవర్ణనము నేఁటి జాగ్రఫీ కాదు. విరాడ్ బ్రహ్మాండ వర్ణనము సూక్ష్మరూపానుధ్యానముకొఱకే. ఇది ప్రాచీనపండిత సంప్రదాయము.

## పురాణవిద్య

'వేదములఁ జదివినను పురాణములను జదువకున్నయెడల విచక్షణుఁడు కాఁజాలఁడు. పురాణేతిహాసములచే వేదజ్ఞానమును పెంపొందించుకొనవలెను. అటులఁ గానిచోఁ దనను కొట్టవచ్చుచున్నాఁడేమో యని ఆ యల్పునిఁజూచి వేదము భయపడును' అని పురాణములు చెప్పును.

పురాణము లోకవిద్యగా పూర్వకాలమున పరిగణింపఁబడెను. నన్నయాదులు పురాణవిద్యాపారీణులని వారి గ్రంథములే చెప్పును. పురాణములు తెలియవలయుచో నన్నిఁటినిగాని, కొన్నిటినిఁగాని చాల శ్రద్ధగా చదువవలయును. హిందూదేశమున నెల్లెడ మొన్నమొన్నటివఱకును అందఱును సామాన్యముగా పురాణములను వినుచుండెడివారే. ఇపుడు పురాణపఠనమును శ్రవణమునుగూడ బక్కరమయిపోయెను. ఇఁకఁ గొలఁదినాళ్లలో ఈ యుచితవిద్య కఱవయిపోవును.

---

3. ఇందలి ఖగోళసంగీతాద్యధ్యాయములు ప్రక్షిప్తములని నవీనుల యూహ. అటులగుచో భూగోళాధ్యాయములుమాత్ర మేల ప్రక్షిప్తములు కావు! ఇది సర్గమునకు సంబంధించిన దందురా, ఖగోళముమాత్ర మేల సర్గమునకు సంబంధింపదు!

4. రుద్రావతార మవతారవాదములోఁ జేరదని నను విష్ణ్వవతారముల ముచ్చట ఇంగు అందందు కలదు. చూ- ౩౭-౩౮ మొ.

5. భారతము వనపర్వము చూచునది.

6. ప్రథమం సర్వశాస్త్రాణాం
పురాణం బ్రహ్మణా స్మృతమ్,
అనంతరం చ వక్త్రేభ్యో
వేదాస్తస్య వినిఃసృతాః.
(వాయు ౧-౬౦, ౬౧)

7. 'ఉర్వశీ హాప్సరాః, సా పురూరవస మైడం చకమే'

### చిక్కు

ఇపు డతికాయులను, మహాకాయులను అగు ఈ పురాణసంహితలనుండి అసలు పురాణములను విడఁదీయఁజాలము. ఇపు డచ్చయినవానిలో పాఠభేదములు, ప్రక్షిప్తములు, అప్రాకరణికములు, తప్పులు మొదలగున వెన్నియో మన కడ్డువచ్చుచుండును. ఇంతియకాక ముఖ్యములయిన గొట్లు వట్లే. ఆయాద్వీపములయు, పల్లియలయు, పత్తనములయు పేరు ఏయే భూములలోనివో యెవరు చెప్పఁగలరు? నాఁటి దేశకాలము లెంత తాఱుమాఱాయెనో అది ఊహకు అందునా! వాయుపురాణమున నొకచో ఇది వాయుప్రోక్తమని యున్నది. రెండుపుటలు తిరుగవేసినంతనే ఇది బ్రహ్మప్రోక్తమను విషయము కంటఁబడును. ఈ రెండు పాఠములను అంగీకరించినచో వాయురూపము కల బ్రహ్మ చెప్పె ననికాని, బ్రహ్మరూపుఁడగు వాయువు చెప్పెననికాని చెప్పవలసివచ్చును. ఇది డొంక తిరుగుడు కదా. ఈ వాయుపురాణముననే యొకచో వాయుపుర మను [8] నొక పురము కలదని కనఁబడును. అటులే వాయు వను మహర్షి యొకఁడు దీనిని జెప్పెనని యూహించవచ్చునని యుండగా 'ఇది మరుత్ ప్రోక్త'మని యుండే మఱియొకచోటఁ గలదు. ఇది మనలను గిజగిజలాడించును. దీనిని ప్రవచించినవాఁడు వాయుదేవుఁ డనియు, రచించినవాఁడు కృష్ణద్వైపాయనుఁ డనియు, అతఁ డిప్పటికి సుమారు ౫ వేల పైచిలుకు ఏండ్లవెనుక కలిద్వాపరసంధిలో నుండెనని అధికారికసూత్రభాష్యమున శంకరులు చెప్పిరని సంప్రదాయవిదులు తెలుపుదురు.

### ప్రక్షిప్తములు

జ్యోతిశ్శాస్త్రము పెరుఁగుచు వచ్చినకొలఁది దానికి అనురూపకముగా ఆయాయీ గ్రహనక్షత్రాది యోగములందు పెక్కు వ్రతాదికములు చాల పురాణములలో ప్రవేశము పొందెను. పద్మపురాణము ఇట్టి వానికి గని. పద్మపురాణమునందు రఘువంశము రెండవ సర్గము దూరెను. అగ్నిపురాణమున కావ్యశిల్పము. భవిష్యపురాణముమాట యిఁకఁ జెప్పనే యక్కఱలేదు. ఆటంబాం బపుడే అందు దూరియుండును. ఈ పురాణమునందు పురాణఋషులకు త్రికాలజ్ఞత చూపఁబోయి యెవరో రాజవంశప్రసంగమున విక్టోరియాను వికటగా మార్చి యామె త్రిజటావతారమని కొన్ని శ్లోకములు ఇఱికించి అచ్చువేసిరి. కొందఱు పండితులు 'రాఁబోవు కల్క్యవతారము పురాణములలో లేదా? భవిష్యద్రాజవంశము లేదా?' అని ఎదురుప్రశ్న వేసిరి. ఇట్టివా రందఱును భవిష్యపురాణపు వ్రాఁతప్రతు లన్నియుఁ జూతురుగాక!

ఈ పురాణములలో చేరిన అన్యపదార్థము చాల వట్టు బంగారమే కాని యిది కొన్నియెడల అనర్థకముగా నున్నది. కొన్నికొన్ని నిర్ణయములకు దీనినుండి అసలుపురాణములను జాడింపవలయును.

ఒకరికి ప్రక్షిప్తములుగా తోఁచిన ఘట్టములు మఱియొకరికి ప్రకరణానుగతములుగాఁ దోఁచును. పరంపరాసంబంధముచే ప్రసక్తానుప్రసక్తి సులభసాధ్యము. కాఁగా ఎవరి మతమున కేది సరిపడదో వారి కది ప్రక్షిప్తమగుచుండును. విపరీతముగాఁ జెరిఁగిన నేఁటి పురాణములు చదువుట కలవాటుపడినవారు పూర్వప్రకరణమునకును, పరప్రకరణమునకును సంగతి ఉండవలయు నను మాటయే మఱచిపోవుదురు.

### తప్పులు

దీనిలో అచ్చుతప్పులు మిక్కుటము. వ్రాఁతప్రతులు దీనికన్న చెడుగా నుండును. ఏ పండితున కెటు తోఁచెనో ఆ పండితుఁ డటులు దిద్దెను. ఇపు డీ తప్పులను, పాఠభేదములను కనుఁగొనుటయే కష్టము. వానిని దిద్దుటకు కృష్ణద్వైపాయనుఁడే మరల నవత

---

8. ఇచటనే హనుమంతుని పుట్టుక. చూ ౬౦, ౬౮. వాయు.

9. 'అచింత్యాఃఖలు యే భావా స్తాన్నతర్కేణ సాధయేత్' అను శ్లోకము విద్వాంసుల కందఱకును కంఠపాఠము. 'తాంస్తు తర్కేణ సాధయేత్' అని కొన్ని ప్రతులలోఁ గలదు. ఇది పాఠభేదమా, లేక తప్పా?

రింపవలెనుగాని వానిలో వేలుపెట్టుట కెవరికిని అధికారము లేదు.

ఈ గండములన్నియు నటుండఁగా అర్థముకాని పదములును10, శాస్త్రములనుగూడ శాసించు అపూర్వ ధాతువులు నిరుక్తులు మొదలగున వెన్నియో కనులుచుండును. శివా అని ఏపురాణము తీసినను 'నారాయణం నమస్కృత్య......తతో జయ మదీరయేత్' అని యుండును. ఈ 'జయ'పదమునకు 'భారతము' అని కొందఱు అర్థము వ్రాసిరి. అటు లగుచో అన్ని పురాణములందును ఈ శ్లోక మేల యుండవలయును! భారతమే ప్రశంసించిన, అనఁగా భారతముకంటె వెనుకటిదగు వాయుపురాణమున నిది యెటు లుండఁ గలదు? కావుననే పండితస్వామియగు శ్రీధర స్వామి భాగవతమున నీయర్థము పొసఁగదని కాఁబోలు జయమనఁగా గ్రంథమని 11అర్థము వ్రాసెను. ఇఁక మన ఏఱ్ఱాప్రెగడ ఏమి వ్రాసెనో చూతము—

గీ. "వ్యాసమును పుస్తకము గొని యెలమి యొలయఁ
బ్రాఙ్ముఖోదఙ్ముఖత్వ తత్పరత నుండి."

క. "నారాయణు నరుని నమ
స్కారంబునఁ దలఁచి వాణిఁ గల్యాణి సదం
జేరిచి వేదవ్యాసుల
నారాధించి మతి వలయు నారంభింపన్"
(హరి-ఉ. భా. ఆ-౧౦)

ఇఁక తిక్కన యేమి వ్రాసెనో పరికింతము—

ఉ. "భ్రాజితవృత్తిమైఁ బరఁగు
భారతసంహిత సంయమీంద్రులా
రా జయనామకంబునను
రాజితభంగి జగత్త్రితంబునన్
బూజితకీర్తియై వెగడు" (స్వర్గా-౪౫)

ఏఱ్ఱాప్రెగడ వ్యాసుఁడనికాని, గ్రంథమనికాని అర్థముచెప్పెనని అనుకొనవచ్చును. తిక్కన భారతమని చెప్పెను. కావున గ్రంథభారతోభయవాచకము జయ మనవలెను. ఇట్టి కష్టము లెన్నియోయున్నను ఈ పురాణములందలి బంగారమును పైకెఁదీయుట కెవరికి వారు ప్రయత్నింపవలయును. భరతవర్ష మునందలి విజ్ఞానసంపద యెంతయో యీ పురాణములం దున్నది. నియమపూర్వకమయిన పరిశోధన మీఁకముం దెంతయో యావశ్యకము.

## ముక్కారుపంట

వాయుమత్స్యబ్రహ్మాండములందలి భూగోళవర్ణన మించుమించు సమానము. వాయువిష్ణుపురాణములు మూఁడుకాలములలో ముమ్మాఱు పెరిఁగినటులు ఊహింపవచ్చును. విష్ణుపురాణమున మూఁడవతూరి పెరిఁగిన పంటకు లెక్కడుగాఁ గావఁబడునుగావనిచట దీనిని వదిలి పై మూఁడు పురాణములలోని అంశములనే చూతము.

## నాలుగు దీవులు

దీవు లెన్ని? సముద్రము లెన్ని? కొండలెన్ని? వర్షము లెన్ని? ఏలు లెన్ని? వీని పేరు లేమి? ఈ భూమి పరిమాణమెంత? అని ఋషులు సూతు నడిగిరి 12.

'దీవు లేడు. వీనిలో వేనవేలు దీవులున్నవి. వీని నన్నిఁటిని నేఁ జెప్పఁజాలను' అని యనుచు సూతుఁడు చెప్పుకొనుచుఁబోయిన దీవుల వెతికినయెడల విస్మయము కలుగును. ప్రాచీనపాంథులు చైనుకంపాసు పుచ్చుకొని భూప్రదక్షిణమునకు బయలుదేఱలేదు. భూమి యాకారము పైని నక్షత్రములు ఈ మొదలగునవియు

---

10. 'నైవ హూషితః-నహూషః' చూ. పాద్మ. భూ- ౧౦౫ అధ్యా. 'హుష' ధాతు నీ ప్రపంచములో లేదు. ఇఁక 'భుక్ జ్ఞాపిత'వంటి వింత కావలసినంత.

11. చూ. ౧ స్కం-౩-అధ్యా-౧౦ శ్లో.

12. ఈ వాయుపురాణశ్లోకమే మార్కండేయమునఁ గలదు. దానికి మారన యిటులు తెలుఁగు చేసెను—

గీ. ఎన్ని దీవులు జలనిధు లెన్ని నగము
లెన్ని వర్షంబు లెన్ని? యింకేలు లెన్ని?
(మార్కం. ౪-౧౩౧

భావనయు పరంపరాశ్రుతియు వారికి సంబళము. కొంత అనుకొనినటుల యోగదృష్టితోడను వారు కనుఁగొనలేదు. మిగిలినవానిమాట యేమోకాని జంబూద్వీపమునమాత్రము వారి యోగదృష్టికి గుఱి యైనటుల లేదు.

ఇవి సూక్ష్మలోకములును గావు. వారి స్థూలదృష్టి కంటె స్థూలలోకములు. పురాణకర్తలు తర్కసాహాయ్యముననే యీ దేశములను వర్ణించిరి.13. సూక్ష్మదృష్టితోఁ జెప్పిన విషయములును గొన్ని కలవు. ఈ రెండు మాటలును పురాణములందే కలవు 14. పిడుగునకును బియ్యమునకును ఒకటే మంత్రము కాదు.

---

18. 'సప్తద్వీపం ప్రవక్ష్యామి
చంద్రాదిత్యగ్రహైస్సహ
తేషాం మనుష్యాస్తర్కేణ
ప్రమాణాని ప్రచక్షతే.' (వాయు.౩౪-౭)
'యత్రయత్రహి దృశ్యన్తే
ధావన్తి పంచభౌతికాః,
తేషాం మనుష్యాస్తర్కేణ
ప్రమాణాని ప్రచక్షతే' (పద్మ-ఆది-౪-౧౧)

14. 'అచింత్యాః ఖలు యే భావా
స్తాన్న తర్కేణ భావయేత్,
ప్రకృతిభ్యః పరం యచ్చ
తన్నిత్యం చ ప్రచక్షతే' (వాయు.౩౪-౯)

దీనికి భాగవత ౫ స్కంధ-౨౧ అధ్యాయమున 'అనుములు పెసలు మొదలగువానిలో నొక దళ మెంత యుండునో రెండవ దళమును అంతయే యుండును. అటులే బ్రహ్మాండమునందు భూగోళప్రమాణ మెంతో ఖగోళపరిమాణ మంత' అని కలదు. పురాణములన్నిటిలోని మేరువర్ణనమును కలిపి చూచినచో నిది యేదోయొక సూక్ష్మలోకవర్ణన మని తోఁచును. దీనికి ఇలావృతవర్ష వర్ణన మొకటి తోడు. 'ఇందు పరపురుషుఁడుగాని పురుషుఁడు ప్రవేశింపలేఁడు' అని యున్నది. మేరువునకు మేరుదండము ప్రతినిధి. దీనికి రహస్యశాస్త్రములు చూచునది.

వారు తూరుపు, పడమర, దక్షిణము, ఉత్తరము అని స్థూలముగా నాలుగుదిక్కుల నాలుగు దీవులను నిర్దేశించిరి.

## మేరువు

ప్రాచీన దేశవర్ణనమునకు మేరువు నాభి. మనము ఇప్పటికిని 'జంబూద్వీపే భరతవర్షే భరతఖండే మేరో ర్దక్షిణదిగ్భాగే' అని సంకల్పము చేయుచున్నాము. అది ప్రాచీనార్యుల స్వదేశ మయియుండవచ్చును. కావున అది నాభి, లేక వారి భూగోళ పరిగణనమునకు అది మధ్యము కావచ్చును. కావున అది నాభి. దీనినే వారు స్వర్గమనియు, దేవలోక మనియు కొనియాడుటలో చతుర్ముఖులైనది. "సహి స్వర్గ ఇతి ఖ్యాతః" దానికి స్వర్గమని ఖ్యాతి. దీనికే మఱియొక పేరు సుమేరువు. ఇది పర్వతమధ్యమును, విశాలము నగు సమభూమి. దీనినిబట్టియే ఎత్తగు నేలకు మేరు వని పేరువచ్చెను. ఈ పద మచ్చతెలుఁగుపదముగాఁగూడ భుక్తమాయెను యయాతిచరిత్రము చూచునది. ఇది క్రమక్రమముగా జపమాలలలో పెద్దపూసకును, హారమణులలో నాయకమణికి, శ్రేణీగీతలలో పెద్దగీతలకును, పెద్దపెద్ద కట్టలకును, వెన్నెముకకును పేరాయెను.

## పర్వతములు

పర్వతములు లేనియెడల మేరువు కాదు. పర్వము లేనిచో పర్వతము కాదు. పర్వము లేనిది గిరి. రెండు పర్వతముల నడుమ నున్న లోయ లేక సమభూమి ద్రోణి. పర్వతము బ్రద్దలగుచో దరి.

పర్వతము లిరుదెఱఁగులు. వర్ష పర్వతములు, కులపర్వతములు, మనుష్యులు ఉనికి చేసికొనినవి వర్ష పర్వతములు. ఇవి మిగుల పొడుగైనవి. ఇట్టి కొండల వరుసల నడిమి నేలలలో మనుష్యులు నివసించుటకు వీలగును. దేశమునకు దేహరూపముగను, పంజరరూపముగను ఉన్నవి కులపర్వతములు.

## ద్వీపములు

రెండువైపుల నీరు క్రమ్మిన భూభాగము ద్వీపము. 'ద్వ్యన్తరుపసర్గేభ్యోఽప ఈత్'. ఒకవైపునఁ

గాని, మూఁడుపాలుగనైపులఁగాని నీరు క్రమ్మిన భూభాగమునకును ద్వీపమని వ్యవహార మున్నది. జలసంలగ్నమగు ఎత్తునేలను ద్వీప మనవచ్చును. ప్రాచీనులును ఇటులు వ్యవహరించిరి. సముద్రజలమునకేకాక నదీహ్రదముల జలముచే సంలగ్నములగు భూభాగములును ద్వీపములే. ఇట్టి ద్వీపములు ఆంధ్రదేశమున పెక్కులు. కావున భారతము ద్వీపము. మఱియు వర్ష పర్వతముల సంబంధమువలన వర్షము. వర్ష పర్వతముల దాపుననుండి సముద్రముచే అంతరితములగు ద్వీపము లంతర్ద్వీపములు. ద్వీపముల దాపున నున్న చిన్నచిన్న ద్వీపములు అనుద్వీపములు.

## సాగరములు

సముద్రములకేకాక పెద్దపెద్ద నదులకును సాగరమను వ్యవహార మున్నది. పెద్దపెద్ద హ్రదములకును సాగర మను వాడుక యున్నది.

ఇపు డొకసారి సింహావలోకన మొనరింతము. తొల్లి పురాణఋషులకు మేరువు నాభి. పృథివి గోళాకారము కాదు. మఱి చక్రాకారము.

మేరువు చిన్న బిందువు కాదు. దానికి నలుదెసలను నాలుగు ద్వీపములు. మఱియు ఆ ద్వీపముల చుట్టును సాగరము. వాయుమత్స్యబ్రహ్మాండపురాణాదులయందును, భారతాదీతిహాసములందును భూమి చతుర్ద్వీప, చతుస్సాగర.

సాగరములు నాలుగనుట చాల ప్రచురము. నాలుగను అంకెకును, నాలుగు వస్తువులకును పర్యాయముగా సముద్రమును చెప్పు పదముల నన్నిటిని వాడుదురు. ఛందోజ్యోతిషములం దిది ప్రసిద్ధము.

ఈ మేరువునకు ఉత్తరమున కురుద్వీపము. తూర్పున భద్రాశ్వము. దక్షిణమున జంబూద్వీపము. పడమట కేతుమాలము.

మేరువునకు నలుదెసలను దవ్వుగా నాలుగు కొండలు. వాని నాశ్రయించుకొని సముద్రమువఱకును నాలుగు ద్వీపములు. మేరువు మతిభేదముచే అష్టకోణము, త్రికోణము, సహస్రకోణము, చతురస్రము, శరావాకారము, సముద్రాకారము. ఏఋషి ఏవైపును జూచెనో ఆవైపునుబట్టి దాని యాకారము నిటులు చెప్పెనని పురాణమునఁ గలదు.

'యద్యద్దృష్టహి యత్పార్శ్వం
పర్వతాధిపతే ఋషిః
తత్తదేవాస్య తేదాఽఽహ (వాయు. ౩౮-౬౮)

మేరువు ఉత్తరభాగము ఎత్తు. దక్షిణభాగము గూడ ఎత్తు. ఉత్తరభాగమునకు ఉత్తరవేది యనియు, దక్షిణభాగమునకు దక్షిణవేది యనియు పేరు. మేరువునుండి నాలుగు మహానదులు బయలుదేఱి నాలుగు సముద్రములలో కలిసెను.

(పక్క పుటలో 1 వ పటము చూడుడు.)

ఇపు డాసియాపటము చూచిచూడఁగనే మేరువనఁగా పీఠాయనిగాని, తుర్కీయనిగాని తోఁచును. ఈ పీఠాతుర్కీలకు నలుదెసలను కొండలు. నలుదెసలనఁగా తూర్పుపడమరఉత్తరదక్షిణములని అనకోరాదు. ఏ కొండలును తీర్చినటులు సరిగా దిక్కులకనురూపముగా నుండవు. నలుదెసలఁగల నాలుగు నదులకును తూరుపున నేఁటి తరిమ్[15] దక్షిణమున అక్సస్. పడమట సిర్ దరియా. ఉత్తమురన ఇర్తిష్.

## జంబూద్వీపము

మేరువునకు దక్షిణమున జంబూద్వీపము. భరతవర్షమునకు వెనకటి పేరులు- అజనాభము, జంబూద్వీపము. ఈ 'జంబూ' కే తత్సమము జమ్మూ. ప్రకృతమున ఈ జమ్మూ కాశ్మీరమునం దొక మండలము.

---

15. తరిమ్ దేశము నేఁ డిసుకలో పూడిపోయెను. నదియు లవనర్ హ్రదమున నదృశ్యమాయెను. హోయాంగ్ హో అని యీ నదికి పేరు. చాలఁ గాలము వెనుక అలకనంద గంగ యాయెను. కొండలలో శిలల నిరూపించుట దుర్ఘటముకదా. తరిమ్ దేశము పడమట నున్న యిసుక త్రవ్వఁగా తొంటి పత్తనములు బయటఁబడెను. ఇంకను లోఁతుగా త్రవ్వినచో పూర్వకాలావశేషములు తెలియరావచ్చును.




## అశ్వద్వీపము

భూమి నాలుగు దీవులు తొమ్మిది వర్షములు ఏడు దీవులు కలది. ఇటులు ముమ్మాఱు విభక్తమాయెను. ఇందు నాలుగు దీవులు ఏడు దీవులు కొన్ని వర్షములు మాత్రమే కలవు. ఇతర పురాణోక్తములగు మఱికొన్ని దీవులు కలవు.

'జంబూపర్వతము నేటి పామిర్[16]. నేను బంతును నిలువుగాఁ గోసి నేలమీఁద పెట్టినటు లీ పామిరు చతికిలు లుండును. ఉత్తర దక్షిణములు వాలు, నడుమ ఎత్తు. ఇచట నిపుడు హిందూకుష్, కారకోరం, కుయెన్ లుంగ్, తియాన్ శాన్ అను నాలుగు కొండలు కలిసెను. పామిరుకొండలు బ్రద్దలగు చుండును. ఈ కొండలలో ద్రోణులకును, సరోవరముల కును లెక్కలేదు. పామిర్ పదమునకు ద్రోణి యని యర్థము.'

16. పామిర్ పదము ప్రాఙ్మేరుపదమున కప భ్రంశ మేమో విచారింపవలెను.

'సంస్కృతమున అగనగశిఖరి పదములకు చెట్లనియు, కొండలనియు అర్థము. జంబూనగముల నుండి హస్తిపృష్ఠాకారములగు జంబూఫలములు పడు నని పురాణముల కవిత్వము. ఈ పామిర్ కొండలు పగిలి హస్తిపృష్ఠాకారములగు పానవులు జాతి పడు టయే ఈ కవిత్వమున కర్థ మయియుండు ననియు, పురాణములం దిందుల కాధార మున్నదనియు శ్రీ జే. సి. రేగారు వ్రాసిరి. కాని మిగిలిన కొండలమీఁది చెట్ల కును, వాని పండ్లకును, వాని నదులకును వీరు సమాధానము చెప్పవలసియుందురు.

## భద్రాశ్వము

చీనా మంగోలియాలు కలిసి భద్రాశ్వము. ఒక జాతియొద్దకు భద్రవృషములనియు, ఒకజాతి యేనుఁగు

లకు భద్రగజములనియు పేరున్నటులే ఒకజాతి గుఱ్ఱములకు భద్రాశ్వము లని పేరుండియుండును.

మంగోలియా గుఱ్ఱములకు ప్రసిద్ధి. సుమంగలమే మంగోలియా యినదియెనల భద్రాశ్వ మను మాట అన్వర్థ మగును. ఆసియా అనునది అశ్వద్వీపాపభ్రంశము. పడమటితుర్కీ గుఱ్ఱములకు జన్మస్థానము. సమరఖండపు గుఱ్ఱములు ప్రసిద్ధములు. ఋగ్వేదమున అశ్వనామములు కలవు. ఈ ద్వీపమున వాయుదేవుఁ డుండునని భాగవతము.




## కేతుమాలము

మేరువునకు ఉత్తరమున కేతుమాలము. సముద్ర మథనమునాఁడు దేవదానవులకు కలిగిన కయ్యములో చెట్లన్నియు కాలిపోఁగా ఇంద్రుఁడు ఈ ద్వీపము నందలి రావిమ్రాఁద కేతువుగా మాల వైచినందువలన దీనికి పేరు వచ్చెనఁట. ఇప్పుడిది పడమటి తుర్కీస్తాన్.

## కురుద్వీపము

మేరువునకు ఉత్తరమున కురుద్వీపము. ఇది మానసపుత్రులగు సప్తర్షుల నివాసము. ఎవరి మానస పుత్రులు? బ్రహ్మమానసపుత్రులు. ఎవరి పుట్టుక బ్రహ్మ కడకుఁ బోవునో వారి పుట్టుక అనాది యన్నమాట. వీరు సనత్కుమారాదివరజాలు. వీరికి కురువు లని పేరు. వీరి పేరుబట్టి యీ ద్వీపమునకు కురుద్వీప మనియు, ఉత్తరకురుదేశము లనియు పేరు.

ఇటులు మేరువు నలుప్రక్కలఁ గల నాలుగు ద్వీపములను పురస్కరించుకొని లోకము చతుర్దళములు గల పద్మమువలె నున్నదను కల్పన ఉదయించెను. ఈ విమర్శనము గుఱించి ముందు.

## నవవర్ష విభాగము

ఈ పైఁజెప్పిన చతుర్ద్వీప విభాగము స్వాయంభువమనువునకు వెనుకటిది గాన చాల పురాతనము. స్వాయంభువుని కొడుకు ప్రియవ్రతుఁడు తన కొడుకులకు భూమిని పంచిపెట్టవలసివచ్చెను. అప్పుడు అది తొమ్మిది చీలికలై తొమ్మిది వర్షము లాయెను.

“వృష్ణ్యతే సిచ్యతే మేఘైరితి వర్షః” = వానలచేఁ దడుపఁబడునది గావున వర్షము. ఈ తొమ్మిది వర్షములును పంట పొలములై యుండవలయును.

ఆసియాపటము చూచినచో తూర్పు పడమరల పొడవగు కొండలు కానఁబడును. ఇవి హిమాలయమును కుయేన్‌లున్, ఆల్‌టిన్ తాగ్. ఈ మూఁడును వర్ష పర్వతములు. వీనిని బట్టి మూఁడు వర్షములు. మఱియు ఉత్తరమున దక్షిణ-ఆల్‌తాయ్ పిమ్మట చాంగాయ్ పర్వతములును, అటుపిమ్మట ఉత్తర-ఆల్‌తాయ్ పర్వతములును కనఁబడును. ఈ మూఁడు వర్షపర్వతములఁ బట్టి ఉత్తరసముద్రమువఱకును మఱి మూఁడు వర్షములు. మిగిలిన రెండు ద్వీపములును మఱిమూఁడు వర్షములుగా విభక్తము లయియుండును.

ఆసియాపటము చూడఁగా దక్షిణసముద్రమునకు ఉత్తరముగా (౧) భారతవర్షము. పిమ్మట హిమాలయము. పిమ్మట (౨) కింపురుషవర్షము (టిబెట్). పిమ్మట హేమకూటము (కుయేన్‌లున్). పైని (౩) హరివర్షము. అటుపైని నిషధపర్వతము (ఆల్‌టిన్). ఆపైని (౪) ఇలావృతవర్షము (చీనా తుర్కీ-గోబీ ఎడారి). దానిపైని నీలపర్వతము (దక్షిణ-ఆల్తాయ్). పైని (౫) రమ్యకవర్షము (మంగోలియా). దానిపైని శ్వేతపర్వతము (చాంగాయ్). పైని (౬) హిరణ్మయ వర్షము. దాని కెగువ శృంగవత్పర్వతము. (ఉత్తర-ఆల్‌తాయ్). పైని (౭) కురువర్షము (సైబేరియా). దాని కావల సముద్రము. ఇలావృతమునకు తూర్పు పడ

మరల గంధమాదనమాల్యవంతములు. వాని సానువులని (౮) భద్రాశ్వవర్షము (౯) కేతుమాలవర్షము.

*ఈభద్రాశ్వవర్షమున నారాయణుఁడు నాలుగు చేతులతోడను, గుఱ్ఱపుఁ దలతోడను ఉండు ననియు, ఆ నారాయణుని చేతులు కాళ్లు తల మొదలగు అవయవము లన్నింటను కృత్తిక మొదలగు చుక్కలన్నియు నుండుననియు, కేతుమాలమున హరి వరాహరూపమున నుండుననియు కాళ్లు మొగము హృదయము తోఁక పార్శ్వములు వీనియందు క్రమముగా కృత్తికాది నక్షత్రములు ఉండు ననియు, కురువర్షమున హరి మత్స్యావతారము గొనియుండు ననియు, అయన తొమ్మిది అవయవములయందు చుక్కలును జనపదములును ఉండు ననియు మార్కండేయపురాణమునఁ గలదు. ఇట్లే భారతవర్షమున హరి కూర్మరూపముతో నుండుననియు అతని మొగము తూర్పునను, పుచ్ఛము పడమటను, పార్శ్వములు దక్షిణోత్తరములుగను, ఆగ్నేయాది విదిక్కులయందు కాళ్లును ఉండుననియు, ఆ కాఁళ్ల నడుమనుండి మొగము మొదలు దక్షిణముగా తొమ్మిది అవయవములనడుమ మూఁడుమూఁడు తారలు ఉండు ననియు మార్కండేయమునఁ గలదు. హిరణ్మయ వర్షమున హరి కూర్మరూపమున నుండునని భాగవతము· (చూ. ౫-స్కంధ-౧౮-అధ్యా) ఈ రీతిగనే భాగవతమున ఇంకను మార్పులు గలవు.

దీనిఁబట్టి ఆకాలమునందు భూస్వరూపస్వభావాదులను చూచి దానిని భగవదవతారాదులతోఁ బోల్చుటయు, అచటనుండి చూచినచో నక్షత్రము లెట్లు కనఁబడునో చూచి వానిని భూమ్యాకారముతో గుతి చూచి గుఱుతులు పెట్టిరనుట తెల్లమగుచున్నది. మార్కండేయమేకాక భాగవతముగూడ ఈ ద్వీపము లన్నింటికిని ఒక అధిదేవతను వర్ణించినది, ఇందు నక్షత్రములమాట లేదు. భగవంతుని సూక్ష్మరూపము నెఱుఁగుటయే స్థూలరూపవర్ణనమున కేకైకప్రయోజన మని భాగవతము కంఠోక్తముగాఁ జెప్పి యటులే చేసెను.

## సప్త ద్వీపములు

వాయు బ్రహ్మాండపురాణాదులలో ఈసప్తద్వీపములకు మూలము దొరకదు. భాగవతాదులలో నాలుగు ద్వీపముల మాట లేదు. వానికి సప్తద్వీపములే యాధారము. వెనుకటి నవవర్షవిభాగము ఎంతకాలము ప్రచారములో నుండెనో అది మాఱి సప్తద్వీపవిభాగ మెప్పుడాయెనో మిగుల లోఁతుగా నాలోచింపవలయును. వేఱువేఱు కాలములలో చేయఁబడిన దేశవిభాగములును, క్రొత్తగా కనుఁగొనఁబడిన దేశములును, వాని విభాగములును అతి స్థూలములగు ఎరిహద్దులతోనయినను నిరూపించుటకు ప్రకృతగ్రంథసామగ్రి చాలదు. ప్రకృతపురాణములలో వేఱుపఱచి చూపుటకు వీలులేనంతగా ద్వీపములును, వర్షములును, అనుద్వీపములును కలగాపులగమైపోయెను.

మేరుగిరిమీఁద నివాస మసంభవము. దానికి చుట్టును గల ఉపపర్వతములు నివాసయోగ్యములు. మేరువునకు దాపునఁగల దేశము మేరుదేశము. ఇది పలు ప్రక్కల నుండవచ్చును. మేరువునకు తూర్పున ఇలావృతము. కాలక్రమమున మేరువుపడమటిభాగము కొంత ఇలావృతములోఁ జేరెను. చాలకాలము తరువాత ఇలావృతమెంతయో పెరిఁగెను. ఏలనఁగా, మేరువిలావృతవర్షమునకు నడుమ నున్నదని పురాణములలో కనిపించును. ఇది ౪౦-౪౫ అక్షాంశముల నడుమ నున్నది.

(ప్రక్కపుటలోని మూడవ పటము చూడుఁడు.)

ఈ నవవర్షవిభాగములో ఆసియాపూర్వపశ్చిమములందు మూఁడు వర్షములు. కేతుమాలము, ఇలావృతము, భద్రాశ్వము. మనువుల కొడుకులు వీనిని పంచుకొనుటచే ఇవి రూపాంతర నామాంతరములకు ఆస్పదమాయెను. ఆ విభాగములకు మరల ద్వీపసంఖ్య వచ్చెను. కేతుమాలముగూడ విభక్తమాయెను. ఆ విభాగములకును మరల ద్వీపసంజ్ఞ వచ్చెను. ఇపుడు కేతుమాలముతక్క పృథివియంతయు జంబూద్వీపము. ఇదియు తక్కుఁగల ఆఱు దీవులును గలిసి సప్తద్వీపములాయెను. భాగవతములో ఈ యేడుదీవులును ఏడేసు చొప్పున ౪౯ దీవులయినటులున్నది. పద్మపురాణము చతుర్ద్వీపవిభాగము చెప్పెను. మఱియు సుదర్శనాదిద్వీపములను చెప్పెను.

జంబూద్వీపమునందలి పురాణ నామధేయములతో నిప్పటి నామములు కొన్ని కలియును. ఆ కలియుటమాత్రమే ప్రమాణముగా స్వీకరించుచో స్థలశైలాదికమును నిర్ధారింపవచ్చును. మిగిలిన ఆఱు ద్వీపులలో ఈసులువుగూడ దొరకదు.

పౌరాణికులు స్వాయంభువ మనువున కేడుగురు కొడుకు లనియు, వారిలో ఒక్కొక్కడి కేడుగు రేడుగురు కొడుకు లనియు, వారి అందఱకును ఒక్కొక్క ద్వీప మనియుఁ జెప్పిరి. ఒక్కొక్క ద్వీపమున కేడేసి కొండలకు, ఏడేసి యేఱులకు పరిఘృద్ధిరి. ఒక్కొక్క ద్వీపమును తొమ్మిదేసి వర్షములుగా విభజించినటు లెచటను లేదుగాని భాగవత మీ యేడు దీవులను ఏడేసి వర్షములుగా విభజించెను.

ఆద్వీపము లివి : జంబూ ప్లక్ష గోమేద శాల్మల కుశ క్రౌంచ శాక పుష్కరములు. మత్స్యపురాణమున నామక్రమమాత్రము భిన్నము.

(వీని వివరణాదికము ముందు సంచికలో)



# సాహిత్యము - సారస్వతము - వాఙ్మయము

— శ్రీ పిల్లలమఱ్ఱి వెంకట హనుమంతరావు —

సాహిత్య మనే పదాన్ని లోకంలో అనేకులు అనేకవిధాల ఉపయోగిస్తున్నారు. ఈ పద మెలా సంభావితమైందో ఆలోచిద్దాము:

'సహితస్య భావః సాహిత్యం' అని కొందరు. సహితమంటే కూడినది అని అర్థం; దేనితో కూడినది అని తమకు తామే ప్రశ్న వేసుకొని, సకలశాస్త్ర రహస్యాలతో కూడినది సాహిత్యమని సమాధానం చెప్పుకున్నారు. అంతేతప్ప సాహిత్య మనే శబ్దానికి ఆ అర్థం లేదు. సకలశాస్త్రరహస్యము అని వారు చెపితే వేరొకరు మరోదానితో కూడినది అని చెప్పవచ్చుగదా! ఇదివరలో శాస్త్రానికీ సాహిత్యానికీ సంబంధం ఎలాంటిది అనే చర్చ బాగా జరిగింది. తత్ఫలితంగా సాహిత్యం ఆనందాన్ని అందించేదనీ, శాస్త్రం సత్యాన్ని బోధించేదనీ పరిశీలించడం జరిగింది. అప లోకదానికొకటి అతిరిక్తమైందిగా భావింపబడింది.

"*Poetry is the antithesis of science having for its immediate object, pleasure, not truth*"—*Coleridge*.

కావ్యంయొక్క ప్రప్రథమసర్గం ఆనందమని చెప్పడంలో శాస్త్రసర్గమైన సత్యాన్వేషణంకన్నా భిన్నమైన దని తెలుస్తోంది. కాని సాహిత్యం ప్రకృతి సత్యాన్ని సౌందర్యవంతం చేసి, ఆనందపర్యవసాయిగా చిత్రిస్తుంది. ఇలా సాహిత్యసత్యం సుందరమైంది; శాస్త్ర సత్యం నగ్నమైంది. కాబట్టి సాహిత్యానికీ శాస్త్రానికీ చుక్కఎదురు.

సాహిత్యం అనేది శబ్దార్థసంబంధి—శబ్దం సుఖదుఃఖాది ద్వంద్వాల్ని అందించే శక్తి కలది. సకలశబ్ద ప్రపంచము ఓంకారజన్యము; శబ్దమే బ్రహ్మ. బ్రహ్మానంద సహోదరమైన కావ్యానందానికి శబ్దమే సాధనం. శబ్దాలతో కూడింది సాహిత్యంకనుక సాహిత్యంకూడా సుఖదుఃఖోపేతమైందిగా గ్రహించడానికి అవకాశంఉంది. శబ్దార్థాల్ని ప్రకృతిపురుషసంబంధం కలవానిగా మహాకవి భావించాడు. ఆ విధమైన మైత్రి లేనిదే సాహిత్యం రమణీయంకాదు.

కొందరు 'హితేన సహితం' సాహిత్యమని చెప్తున్నారు. హితంతో కూడింది సాహిత్య మనడంతో ఒక మీమాంస బయలుదేరింది. హితం అంటే మేలు కూర్చేది అనీ, ప్రీతిదాయకమైందనీ, నీతిని బోధించేదనీ, ధర్మప్రతిపాదనం చేసేదనీ అర్థాలు చెప్పుకుంటూ సాహిత్యాన్ని తత్వజ్ఞాన (*Philosophy*) దాకా తీసికొనివెళ్లి దానితో ముడిపెట్టినవాళ్లూ ఉన్నారు.

హితాన్ని బోధించేది సాహిత్యం అన్నాముగదా! అందుచేత సాహిత్యనిర్మాత ఉపదేశకుడు కావాలి అని మరో మెట్టు పైకి వెళ్లారు. వేదాంతానికీ, సాహిత్యానికీ సాజాత్య మేమిటీ అని ప్రశ్న బయలుదేరింది. బ్రహ్మపదార్థాన్ని సాధించడంలో ఉపనిషత్తు లెలా బోధిస్తాయో అల్లాగే సాహిత్యమూ నని అభిప్రాయపడేవారు లేకపోలేదు. సాహిత్యం దర్శనంగా భావించారు వీరు. శబ్దాద్వారా బ్రహ్మసాక్షాత్కారం పొందవచ్చునని వీరి విశ్వాసం. ఈ సాజాత్యాన్ని పొడిగిస్తూ కవి ఋషిత్వాన్ని పొంది అధికారికమైన రచనల్ని వెలువరిస్తాడనీ, నానృషిఃకురుతే కావ్యం అనీ ఇత్యాదిగా ప్రతిపాదించారు.

హితము కూర్చేదే సాహిత్యమైతే, ఆ హితం ప్రజలకు ఉద్దేశింపబడిందిగనుక ప్రజలకు నిన్న ప్రియమైంది, ఇష్టమైంది ఇవ్వాళ రుచించకపోవచ్చు ననే వాదం లేవదీసి, సాహిత్యం అనేది ఏనాటి ప్రజల కానాడు వర్తించేదేనని పరిమితావకాశం కలదానిగా వ్యాఖ్యానిస్తూ వచ్చారు కొందరు. దీనివల్ల పూర్వ కాలంలో వర్తిల్లిన ప్రజలకు రచింపబడిందాయా యుగాలలోని సాహిత్యం అనీ, అది ఇప్పటి ప్రజలకు రుచించదనీ, కాబట్టి తుప్పుపట్టిన ఆ సాహిత్యం పరిహరించదగిందనే ధోరణి కన్పిస్తున్నది. కాని హితమన్నపుడు మానవలోకానికి కల్యాణప్రదమైందీ, విశ్వశ్రేయస్సు కూర్చేదీ అనే గ్రహించాలి. మానవత్వానికి (*Human race*) అంతటికీ హితాన్ని కూర్చేది సాహిత్యమని గమనించాలి. ఒకవర్గాని కున్న అధికారలోపం చేత అందుబాటులో లేనంతమాత్రాన దానిని అలా గర్హించ కూడదనీ తెలుసుకోవడం అవసరమే ఔతుంది. మానవ ప్రకృతికి సంబంధించిన సూత్రాలన్నీ సర్వసామాన్యాలే గదా! ఆ ప్రాథమిక సూత్రాలకూ, ఆ ప్రధానమానవ నిసర్గభావాలకూ క్షతి రానంతమట్టుకు సాహిత్యం విశ్వజనీనమే అవుతుందిగదా! ఆవిధంగా ప్రకృతిసూత్రాల్ని రమణీయమైన శబ్దార్థాలతో ప్రతిపాదించేదే సాహిత్యమౌతుంది.

సాహిత్యపదానికి లోకంలో మరోలాగా ప్రయోగం కన్పిస్తున్నది. 'వాడు మంచి సాహిత్యం కలవాడండీ' అంటారు; సంస్కృతి (*Culture*) కలవాడనే భావంతో. సంస్కృతి అనే పదం సూచించే భావం చాలా విశాలమైంది. వ్యుత్పన్నుడు అన్నా అదే భావం స్ఫురిస్తుంది. లోకకావ్యాద్యవేక్షణం కలిగి చక్కని శబ్దార్థజ్ఞానం కలిగి నైసర్గికాలైన సభ్యతా సంప్రదాయాలలో అనుభవజ్ఞానం అలవరచుకొన్నవాడు సాహితీసంపన్నుడౌతాడు. అతడే సంస్కారి. ఇంతటి గౌరవం సాహిత్యశబ్దానికి సామాన్యవ్యవహారంలో కన్పిస్తుంది.

మరో ప్రయోగం చూడండి. 'త్యాగరాయకృతుల్లో సంగీతసాహిత్యా లున్నాయి. కాని సాహిత్యాన్ని ఎవరూ గుర్తించలేదు' అన్నప్పుడు సాహిత్యమంటే రమణీయమైన—రసస్యంది అయిన శబ్దార్థాల పోహళింపనే అర్థం.

లాక్షణికవ్యవహారంలో సాహిత్య మనే పదం శాస్త్రమనేపదంతో సమసించి విచిత్రంగా భాసిస్తున్నది. సాహిత్యం వేరు; శాస్త్రం వేరు. దీనికీ దానికీ పొత్తు కుదరడానికి వీలులేదనుకున్నపుడు సాహిత్యశాస్త్రం అనే సమాసం ఎలాగు అని మొదట్లో ఆశ్చర్యం కలుగజేస్తుంది. 'సాహిత్యశాస్త్రం' అనే పదాన్ని అలంకారశాస్త్రానికి పర్యాయపదంగా వాడుతూవచ్చినట్లు తెలుస్తుంది. సాహిత్యంయొక్క శాస్త్రం అని షష్ఠీసమాసం చేసుకొని అర్థం చెప్పుకోవాలి. సాహిత్యానికి లక్షణం గనుక ఈపేరు స్థిరమై ఉంటుంది. దీన్నిబట్టి సాహిత్యానికీ అలంకారానికీ సన్నిహితసంబంధం ఉన్నదనే కాకుండా సాహిత్యమంటే అలంకారమా అనే సందేహం పొడముతుంది. సాహిత్యానికీ అలంకారానికీ అవిభాజ్యమైన సంబంధం ఉంది. నిరలంకృతమైన రచన సాహిత్యమే కాకపోతుందనికూడా సిద్ధాంతీకరించారు లాక్షణికులు. ఈ సాహిత్యశాస్త్రాన్ని పరిశీలించగా సాహిత్యపదం కావ్యపరమైనదనీ, కావ్యానికి నిర్దేశించిన లక్షణాలలో అలంకారాలకు సమధికమైన స్థానమున్నదనీ గుర్తిస్తాం.

ఈ విధంగా సాహిత్యపదానికి కవిత్వ మనే అర్థం సిద్ధించింది. ఇక్కడ కవిత్వ మనే పదాన్ని గూర్చి లోకంలో ఉన్న భ్రాంతిని చెప్పాల్సిఉంది.

కవిత్వమంటే ఛందోమయమైందే ననీ, కవి అంటే ఛందోమయములైన రచన సాగించిన అతడే ననీ ఒక దురభిప్రాయ మెలాగైతేనేమి ప్రాచుర్యం వహించింది. ఇది సరిగాదని ప్రాక్ప్రతీచీ సాహిత్యశాస్త్రజ్ఞుల వాక్యాల్ని పరికిస్తే తెలుస్తుంది. "గద్యం కవీనాం నికషం వదంతి" అని ప్రాచ్యులూ, "*Verse is apparalled only being but an ornament and no cause to poetry, since there have been many poets that have never versified*" అని పాశ్చాత్యులూ అన్నప్పుడు కవిత్వమనగా కేవలఛందోబద్ధమైన రచనే కాదని తెలిసికొంటాం. కాబట్టే దండ్యాచార్యుని "ఇష్టార్థవ్యవచ్ఛిన్నా పదావళీ" అనేదీ, "రమణీయార్థప్రతిపాదకః శబ్దః" అనే వాక్యాలూ కావ్య నిర్వచనాలుగా నిలువగల్గినై. ఈ నిర్వచనాలకు నిలిచిన రచన కావ్యత్వం పొందుతుంది. అలాంటి రచన చేసిన రచయితే కవి అవుతాడు. అది వచనమూ కావచ్చు. సంస్కృతకవులలో బాణుడు వ్రాసిన కాదంబరి, దండి వ్రాసిన దశకుమారచరిత్రా కావ్యత్వం పొందినవే. అల్లాగే ఆంగ్లంలోను ఉత్తమ కవిత వచనం ద్వారా అందింపబడుతూవచ్చింది.

"*Very few poets have been succeeded in being so poetical as Isaiah, Sir Thoman Browne, and Ruskin have been in prose.*" (*Arnold Bennett.*)

ఇక సాహిత్యపదానికీ, కవిత్వపదానికీ భేదాన్ని కల్పించే వ్యవహారమూ కన్పిస్తున్నది. అదికూడా ప్రమాదమే. ఉత్తమ కవితాధోరణి కలిగిందంతా సాహిత్యమౌతుంది.

"*In the sense in which poetry is best understood, all literature is poetry, or is at any rate, poetical in quality.*" (*Ibid*)

సాహిత్యమాలోచనామృతాన్ని ప్రసాదించేది. అది అందించే ఆలోచనం అమృతమైంది. మన మెన్నో రచనల్ని చదివి ఉంటాము. అందులో కొన్ని తత్కాలానికి ఏవోకొన్ని ఊహల కవకాశ మీయవచ్చు. కాని ఆ ఊహాలు మనస్సులో ఉద్బుద్ధాలైన మరుక్షణానికో, లేక కొద్దికాలానికో నాశమైపోతాయి. కాని ఉత్తమకావ్యాన్ని ఒక్కమాటు చదివినతర్వాత దానిలో సృజింపబడ్డ పాత్రలుగాని, ప్రతిపాదింపబడిన భావాలుగాని మనల్ని వెన్నాడుతూనే ఉంటాయి. మరచిపోదామన్నా మరపునకురావు. ఆలోచించిన కొద్దీ ఆనందాన్ని పొందుతూఉంటాము. ఇది పాఠకుని ఆస్వాదనయోగ్యతకొద్దీ వృద్ధిపొందుతూ ఉంటుంది. మధువును రుచిచూచిన భృంగరాజ మెలా పునఃపునః సుమం చెంతకు చేరుతూఉంటుందో అలాగే పునఃపునః పఠించాలనే ప్రేరణ కలిగి మళ్లీ కావ్యం దగ్గరికి వెళ్లుతాము. ఈవిధంగా అది అమృతమైన, శాశ్వతమైన ఆనందాన్ని ప్రసాదిస్తుంది. అలాంటి కావ్యం ఉత్తమమై ప్రపంచంలో శాశ్వతంగా నిలుస్తుంది.

"*It survives because it is a source of pleasure and because the passionate few can no more neglect it than a bee can neglect a flower.*"—*A. B.*

ఇలాంటిదంతా సాహిత్యమౌతుందని గ్రహించాము.

సాహిత్య మనే పదంకాక, సారస్వతవాఙ్మయ పదాలు వ్యవహారంలో ఉన్నాయి. ఈ పదాలు పర్యాయపదాలుగా వాడుకలో అగుపిస్తున్నాయి. సారస్వతపదానికి 'సరస్వతీసంబంధమైన' అనే అర్థం ఉంది. సరస్వతి చదువులతల్లి; సరస్వతి అనే నది అంతర్వాహిని ఒకటున్నదికూడ. దీన్ని పురస్కరించుకొని సారస్వత మనే పదానికి అర్థం చెప్పుకోదానికి ప్రయత్నిస్తే శబ్దాల్లో రమణీయార్థం లేక రసభావం అంతర్వాహినిగా ప్రవహించవలెనని చెప్పుకోవాలి. ఈవిధమైన రచనావ్యాపారాన్ని సారస్వత మనవచ్చు. 'సాహిత్య'శబ్దార్థానికి సమీపంలోనే ఉన్న దీ సారస్వతశబ్దార్థం. ఈ విధంగా సారస్వతశబ్దం కావ్యపరంగా వాడడం సమంజసంగానే తోస్తుంది.

ఇక వాఙ్మయం అనే పదం ప్రత్యేకంగా ఒక పదం కాదు. అది సమస్తపదం. దీన్ని నిఘంటు

# స్వరాజ్య చతుర్దశి

— శ్రీ కపిలకాశీపతి —

"—కామధేనువుకీ, కల్పవృక్షానికీ, అక్షయపాత్రకీ, అన్నపూర్ణమ్మకీ ఆశ్రయమైన ఈ కర్మభూమిలో, ఈనాడు ప్రజ 'అన్నమో రామచంద్రా! అలో లక్ష్మణా!' అని అల్లాడిపోతూంటే ఏమానవుని గుండె నీరుకాదు? కడుపు చెరువు కాదు? మన దేశాన్ని ఈ దౌర్భాగ్యస్థితికి తీసుకురావడానికి బాధ్యులెవరు? జవాబు ప్రతిధ్వనిస్తోంది. భూనభోంతరాళాలలో మారుమ్రోగుతోంది. బ్రిటిష్‌వారు-బ్రిటిష్‌వారు-బ్రిటిష్‌వారు."

సభలో—"నీబట్టకలకి కారకు లెవరు?"

"బ్రిటిష్‌వారు-బ్రిటిష్‌వారు-బ్రిటిష్‌వారు."

అధ్యక్షుడు—అందర్ ఖామోష్.

సభలో—"ఇది పాకిస్థానం కాదయ్యా."

—అది మహాసభ. భారతస్వాతంత్ర్య మహోత్సవాలు ఏవిధంగా జరపాలో నిర్ణయించడానికి సమకూడిన దేశభక్తుల మహాకూటం.

మహావక్త మాట్లాడుతున్నాడు:—

"మహాజనులారా! ఈ సందర్భంలో భారత ప్రజ ఏమి చెయ్యవలసివుంది? తరతరాల నాటి మన వారసులకి ఈ దినం జ్ఞాపకం ఉండేడానికి, చిరస్థాయిగా యీ విషయం ప్రజాహృదయంలో నాటిపోవడానికి మనం చేయవలసిన పని ఏమిటి? కర్తవ్యం ఏమిటి? ఆనాడు యావద్భారత ప్రజా తిరిగి బద్ధకంకణులు కావాలి. దేశంలో క్షామం, కరువు, కాటకం లేకుండాచేయాలి. ఎనిమిది జొన్నల లేమను అనే మాట గవర్నమెంటు పుస్తకాల్లోంచి తీసిపారెయ్యాలి. ఇది చేయాలి అంటే రాజకీయపరిస్థితులలో మార్పు అవసరం. ప్రభుత్వం అనేది ప్రజ్ఞావంతుల చేతిలో వుండాలి. ప్రజానాయకుల చేతిలో వుండాలి."

అధ్యక్షుడు—"తమరు అనవసర విషయాలు ప్రసంగిస్తున్నారు. ప్రస్తుతం చర్చనీయాంశం అందరూ కలిసి స్వాతంత్ర్యోత్సవ విధానం నిర్ణయించడం."

సభలో—"మాట్లాడండి. ఆయనతో మీ కేంటి?"

మహావక్త ఉపన్యసిస్తున్నాడు—"మహాజనులారా, అధ్యక్షులవారు నా వాగ్ధాటి అరికట్టడానికి ప్రయత్నిస్తున్నారు. స్వాతంత్ర్యోత్సవం ఏ విధంగా చేయాలో నిర్ణయించటానికి ముందు స్వాతంత్ర్యం అంటే ఏమిటో తెలుసుకోవలసివుంది."

సభలో—అది తెలియకేనండీ ఈ గొడవంతాను.

మహావక్త—స్వాతంత్ర్యం అంటే ఈ దేశంలో జన్మించిన ప్రతివ్యక్తికీ మత, కుల, జాతి, లింగవివక్షతలు లేకుండా తినడానికి తిండి, కట్టడానికి బట్ట, వుండడానికి ఇల్లు ఏర్పాటు కావాలి. ఇటువంటి ఏర్పాట్ల

చేయడానికిగాను పోయిన మంత్రివర్గంవారు ఒక బ్రహ్మాండమైన ప్రణాళిక తయారుచేశారు.

అధ్యక్షుడు—తమరు మళ్ళీ అప్రస్తుతంలోకి వస్తున్నారు.

వక్త—మహాజనులారా! నమస్కారం. మాట మాటకి అడ్డొస్తుంటే నా హృదయంలో వున్న ఆవేదన మీకు చెప్పడం దుర్లభం. ఈ అధ్యక్షులవారి నిష్పాక్షికదృష్టిలో నాకు నమ్మకంలేదు. నేను ప్రొటెస్టుచేసి నా ఉపన్యాసం ఇంతటితో ముగిస్తున్నాను.

సభలో—ఇంక్విలాబ్ జిందాబాద్! జై హింద్!

అధ్యక్షుడు—స్నేహితులారా! కాలవ్యవధి చాలా తక్కువగా వుంది. కార్యక్రమం చాలా వుంది. మాట్లాడవలసినవారు చాలామంది వున్నారు. ఇక తక్కినవారందరూ ఐదు నిమిషాలు మించకుండా, విషయం సంగ్రహంగా చెప్పి ముగించవలసిందని నా ప్రార్థన. తరువాతివారు.

ఉప—అయ్యా, యాభై సంవత్సరాలుగా భారతజాతీయమహాసభ అధ్యక్ష్యంక్రింద దాదాభాయి నౌరోజీ, బాలగంగాధరతిలక్, మహాత్మాగాంధి మొదలయిన మహానాయకుల సారథ్యంక్రింద నడచిన భారత స్వాతంత్ర్యసమరచరిత్ర ఐదు నిమిషాలలో అవలీలగా చెప్పమంటే అది అసాధ్యమైన పని. నాకు పూర్వం ఉపన్యసించినవారు మహామేధావులు, వక్తలు, విశేషించి—దేశంకోసం త్యాగంచేసిన మహాపురుషులలో ఒకరు. అటువంటి మహనీయులకి ఈనాడు ప్రభుత్వంలో-మన కాంగ్రెసు ప్రభుత్వంలో పలుకుబడి లేదంటే శోచనీయమైన విషయమని మీరందరూ అంగీకరిస్తారు. అధికారవాంఛాధురంధరులైన, స్వార్థపరులైన పెట్టుబడిదారుల కీలుబొమ్మలాటలో అస్మదాదులకు ఆశ్రయం లేకపోవడం మంచిదేనంటాను.

అధ్యక్షుడు—మీ టైమ్ అయిపోతోంది.

ఉప—నామీదకూడా ౧౪౪ సెక్షన్ ప్రయోగించారు. నేను చెప్పదలచుకొన్నది ఒకటే విషయం మన దేశం బాగుపడాలంటే ప్రాజెక్టు లవసరం. రామపాదసాగరం, తుంగభద్ర, సంగమేశ్వరం, మచికుండ మొదలైన ప్రాజెక్టులు పైకితీసుకొచ్చి ప్రజాబలమున్న ప్రభుత్వం అందరికీ క్షేమం చేయాలి. పూర్వమంత్రివర్గంవారు పెట్టిన ఈ ప్రాజెక్టులన్నీ—

సభలో—ఎడ్వైజరీ ప్రభుత్వంవారు పెట్టినారండి.

ఉప—ఎవరైతేనేం, అవి అమలుజరపటం ముఖ్యం. ఆ పని ప్రస్తుత ప్రభుత్వంవారు చేయవలసివుంది. వారు చెయ్యకపోతే వారికి వత్తిడి కలిగించవలసిన విధి ప్రజలమీద వుంది.

అధ్య—తరువాతి వారు.

ఉపన్యాసకుడు—భాయియో, భాయినో!

సభలో—ఇది ఉత్తరహిందూస్థానం కాదురా?

ఉప—స్వాతంత్ర్యభారతానికి రాష్ట్రభాష అయిన యీ హిందీమీద ఆంధ్రులకి యింత ద్వేషం ఎందుకో నాకు బోధపడటంలేదు. యావద్భారతదేశంలోనూ ఎక్కువమంది ప్రజలు మాట్లాడే భాష హిందీ.

సభలో—"కాదు, హిందూస్తానీ."

"హిందూస్తానీభాష అనేది లేదు."

"పాకిస్థానం పోయింతరువాత హిందూస్థానీ ఎందుకురా?"

ఉప—మహాజనులారా! యీ సంకుచితదృష్టివల్ల దక్షిణదేశానికి నష్టమేగాని లాభం లేదు. ప్రపంచమంతా ఒక్కభాషక్రింద తీసుకురావాలని ప్రయత్నాలు జరిగేటప్పుడు భారతదేశంలో యిన్నిభాషలు ఉండడం విచారకరమైన విషయం.

సభలో—ఆ ప్రపంచభాషే భారతదేశానికి పెట్టరాదూ?

"అదే ఇంగ్లీషు"

ఉప—ఆంగ్లమానసపుత్రులైన మీకు నేను చెప్పగలిగింది లేదు.

సభలో—నువ్వు హిందూస్థానీమానసపుత్రుడివా?

ఉప—ఈ అభిప్రాయభేదాలవల్లనే, మనలో మనకు కొట్లాటమూలంగానే, ఇంతవరకూ పట్టాభి

రాష్ట్రపతి కాలేదు. ఆంధ్రకేసరిమంత్రిత్వం పోయింది. చెన్నపట్టణంకోటమీద తెనుగుజండా పడిపోయింది.

సభలో—"తెనుగుజండామీద అంత మోజు ఉంటే నీవు హిందూస్థానీ ఎందుకయ్యా?"

"పోతేపోయిందిలే. కొత్తజండా వచ్చిందిగా, గాంధీగారి రాటంతీసేసి, బుద్ధదేవుడి చక్రం పెట్టి."

ఉప—హతోస్మి. హతోస్మి! పాపము శమించునుగాక. భారతప్రజాపరిషత్తులో అంగీకరించబడిన, ఆమోదించబడిన భారతీయధ్వజంమీద యింత నిరాదరణ పనికిరాదు. నాకు కాలం సమీపించింది. నేను చెప్పేది ఒకటే విషయం. భారతదేశం బహుభాషా సమస్య పరిష్కారం అయిననాడుతప్ప మనకు స్వాతంత్ర్యం వచ్చినా లాభం లేదు. ఆ ఏకభాషాసంస్థాపన కోసమే స్వాతంత్ర్యోత్సవదినంనాడు మన జీవితాలు మళ్లీ మనం పునరంకితం చెయ్యాలి.

అధ్య—తరువాతివారు.

ఉప—ఇప్పుడు, యింతక్రితం ప్రసంగించినవారు భాషావిషయమై ప్రస్తావించారు. మనకు సంపూర్ణ స్వరాజ్యం సార్థకం కావాలీ అంటే మన సంస్కృతిని పునరుద్ధరించుకోవాలి. భాషగానీ మరేదిగానీ విజ్ఞానాన్ని అనుసరించే ఉంటాయి. భారతీయ విజ్ఞానం యీనాడు అడుగంటిపోయిన దేవభాష—సంస్కృత భాషలో, నివురుగప్పిన నిప్పులాగా యిమిడివుంది. ఆ సంస్కృతభాష తిరిగి రాజాదరణం పొందిననాడే భారతదేశానికి ముక్తి, భుక్తి. సంస్కృతభాషతో పాటు వేదమతం పునరుద్ధరించవలసిన అవసరం వుంది. ప్రపంచస్వాతంత్ర్యచరిత్రలో మహాత్మ మోహన్దాస్ కరమ్‌చంద్ గాంధీ ఒక నూతనఅధ్యాయం రచించారు. ఈ రామాయణంలో అది అహింసాకాండ. భౌతికాంధకారంలో పడి కొట్టుకుంటున్న ఈ పామరప్రపంచానికి ఆధ్యాత్మికదృష్టి ప్రసాదించిన మహానుభావుడు మహాత్ముడు. అవతారపురుషుడు. ఈ ఆధ్యాత్మికదృష్టే భారతీయ సంస్కృతికి పట్టుగొమ్మ. పాశ్చాత్యులు పంచేంద్రియాలకు స్పష్టమయే పాంచభౌతికప్రపంచం స్థూలంగా పరిశీలించి అటంబాంబు సృష్టించి మానవ నిర్మూలనతంత్రంలో ఒక నూతనఅధ్యాయం కల్పించారు. అదే యీనాడు సర్వప్రభుత్వాల్నీ బాధిస్తున్న సమస్య. ఈ శక్తినే మన పూర్వులు సూక్ష్మంగా సాధించారు. దానికి మార్గం యోగాభ్యాసం. ఈనాడు పాశ్చాత్యులు భౌతికంగా సాధించిన రేడియో, టెలివిషన్, అటంశక్తి మొదలయినవన్నీ మన పూర్వులు సూక్ష్మంగా సాధించారు. వీటినే దూరశ్రవణం, దూరదృష్టి అన్నారు. శివుడు మూడోకన్ను తెరిచాడూ అంటే ఏమిటి? తనలో వున్న అటంశక్తి ప్రయోగించాడన్నమాట. ఇదేవిధంగా మానవసౌభాగ్యంకోసం మనవారు సృష్టించిన శాస్త్రాలు, కళలు, విద్యలు అనేకం వున్నాయి. ఒక్క ఆయుర్వేదం తీసుకోండి మచ్చుకి. కొన్నికోట్లు ఖర్చుపెట్టి పరిశోధన చేసి నిర్మించిన అల్లోపతీకి యీనాటికీకూడా అందని, అందరాని సూక్ష్మవిషయాలు ఆయుర్వేదం గ్రహించింది ఏనాడో. మన అథర్వణవేదంలో పాశ్చాత్యులు యీనాడు కనిపెట్టిన మారణయంత్రాలు అన్నీ వున్నాయి. రష్యావారు అథర్వణవేదం మీద పరిశోధన చేస్తున్నట్టు తెలుస్తున్నది. ఇతరజాతులకి ఆకర్షణీయమైన మన పూర్వవిజ్ఞానం మన దేశంలో అడుగంటి పోవడం చాలా శోచనీయం. భారత స్వాతంత్ర్య ప్రభుత్వం భారతజాతీయవిజ్ఞాన పునరుద్ధరణ కార్యక్రమం వెంటనే ప్రారంభించి దేశాన్ని బాగుచేస్తే తప్ప.........

సభలో—బ్రాహ్మలకి మళ్లీ ప్రభుత్వం రాదు.

అధ్య—తరువాతి వారు.

ఉప—సోదర సోదరీమణులారా! సోమయాజుల వారు భారతీయ విజ్ఞానవిషయమై ప్రసంగించారు. జాతీయత అనేది ప్రతివిషయంలోనూ ఉండాలి. యజ్ఞోపవీతం తెంపిపారేసి, పిలక కత్తిరించి, నోట్లో సిగరెట్టుతో, చేతులో కాఫీకప్పుతో నేను వేదపారాయణం చేస్తానంటే మీరంతా నవ్వుతారు. అదే విధంగా కేవలం మాంచెస్టరునుంచి ఈమధ్యనే దిగుమతిఅయిన తెల్లని మల్లుపంచె చీకటిబజారులో సేకరించి ధరించిన శ్రీ సోమయాజులవారు జాతీయ సంస్కృతివిషయమై ప్రసంగించడంకొంచెం హాస్యాస్పద

దంగా ఉంటుందంటే అతిశయోక్తి గాదు. జాతీయ సంస్కృతి కావలసినవారు జాతీయవస్త్రంగూడా ధరించాలి. అదేమి ఖర్మమో మన సహోదరులందరికీ కాస్మొపోలిటన్ క్లబ్బులమీద, గ్లాస్గోమల్లులమీద, ఫ్రెంచి సెంట్లమీద వ్యామోహం. స్వరాజ్యం సంపూర్ణం కావాలంటే జాతీయత సంపూర్ణం కావాలి. మన జాతీయపరిశ్రమలు వృద్ధిచేసుకోవాలి. దేశంలో, రాష్ట్రంలో, జిల్లాలో, తాలూకాలో, ఫిర్కాలో, గ్రామంలో స్వయంసంపూర్ణత్వం, స్వయంపోషకత్వం రావాలి. స్వతంత్ర్యంతరువాత భారతప్రజానీకానికి ముఖ్యాధారమైన వస్త్రపరిశ్రమ—మనదేశానికి రెండో ఊపిరితిత్తి అన్నాడు గాంధీగారు ఖాదీపరిశ్రమ—అది వృద్ధికావాలి. మిల్లువస్త్రంమీద ఆధారపడితే మిల్లులకోసం విదేశాలమీద ఆధారపడాలి. వాటికోసం విదేశాలనుంచి నిపుణులు రావాలి. ఇవన్నీ లేకుండా మన దేశసౌభాగ్యానికి ధనికతత్వం రాకుండా, ప్రజానీకం మేలుకోసం మహాత్మాగాంధీగారు పెట్టిన నిర్మాణకార్యక్రమం సక్రమంగా నడిపితే తప్ప మనకి మోక్షం లేదు, లేదు, లేదు; ముమ్మాటికీ లేదు.

అధ్య—తరువాతి వారు.

ఉప—ఆర్యులారా! ఈనాడు, మన దేశంలో ప్రతినాయకుడి నోట్లోను—వినాయకుల నోట్లోగూడా—రెండే మాటలు వింటాం: మహాత్మాగాంధీ, ప్రజానీకం. మహాత్మాగాంధీగారు చెప్పిన ప్రతివిషయం అక్షరాలా అనుసరించిన స్త్రీగాని, పురుషుడుగాని సప్తసముద్రాలు దాటి కుంచుకాగడాలు పెట్టి వెతికినా ఎక్కడా లేరని ఘంటాపథంగా చెప్పగలను. మాలవిరాట్‌లాగా ఏ భంగీకాలనీలోనో ఆ మహలాయన్ని ప్రతిష్ఠచేసి పదిమాట్లు దర్శనంచేయడంతప్ప ఆయనమాట విన్న మనిషొక్కడున్నాడా? పోనీ, ప్రజానీకం అన్నారు. ఈ ప్రజానీకంకోసం యీనాడు ఏమయినా సక్రమంగా సజావుగా చేస్తున్న పెద్దమనుషులున్నారా? లేరు. ముమ్మాటికీ లేరు. ఇది మనదేశ చరిత్రలో ఒక మహామహూర్తం. కాంగ్రెసు అనండి, అఖండహిందు అనండి, అగస్టువిప్లవం అనండి, రష్యా అనండి, అమెరికాఅనండి, ఏకారణాలవల్లనో—అవి మనకు తెలియవు—బ్రిటిషువాడు మనకు ఏదో యిచ్చి వెళ్లిపోతున్నాడు. ఇరుగు పొరుగుల్లో యిరుక్కునివుంటాడో, నిజంగా వెడతాడో పరమేశ్వరుడికెరుక. చచ్చినవాడి పెళ్లికి వొచ్చిందే కూడని యీ సమయంలో మనం మన దేశాన్ని బలపరచుకోవాలి. దీనికి మార్గం తఖిలీగాదు, ఆటంశక్తి. పదిసంవత్సరాలలో, మనకంటే పెద్దదేశమయిన, మనకంటే అధోగతిలో వున్న, మనకంటే భాషాబాహుళ్యం వున్న, మనకంటే ఎక్కువ జాతిమతభేదాలు వున్న రష్యాదేశం నిత్యకళ్యాణం పచ్చతోరణంగా వుంది. రష్యాపేరు చెప్పానని నన్ను మీరు కమ్యూనిష్టు అనుకోవద్దు. జరగవలసినవిషయం ఏమిటీఅంటే మన దేశసంపద మనం అనుభవించే అర్హత, సామర్థ్యం సంపాదించుకోవాలి. దీనికి మార్గం విజ్ఞానం; తన్మూలంగా సాధించగలిగిన విద్యుచ్ఛక్తి. ఆ విద్యుచ్ఛక్తి ఉత్పత్తిచేయడానికి మన దేశంలో సప్తసాగరాలవంటి సప్తనదులున్నాయి. విద్యుచ్ఛక్తితో పాతాళగంగ పైకొస్తుంది. ఆకాశగంగ కిందికి దిగుతుంది. దానివల్ల జరగని పని లేదు. ప్రజలు, ప్రభుత్వం ఏకమయి యీ శక్తినిర్మాణం చేసిననాడే మనకు పుట్టగతులుంటాయి. లేకపోతే గుండుసూదిమీద గుండుకూడా తయారుచెయ్యలేని యీ దౌర్భాగ్యదేశం తుమ్మముళ్లతోటీ, దర్భపుడకలతోటీ కాలక్షేపం చెయ్యవలసిందే.

అధ్య—తరువాతివారు.

ఉప—యింతవరకు ఎంతమందో ఎన్నో విషయాలు చెప్పారు. ఒక్కరయినా నిమ్నజాతుల సంగతి ప్రసంగించలేదు. మన దేశములో కొన్నికోట్ల మంది అంటరానివారున్నారు. యీ అంటరానితనం నిర్మూలం చేస్తేతప్ప యీ దేశం యింతే నంటాను. నిమ్నజాతులకి అన్నిహక్కులూ యివ్వాలి. బంజరు భూములన్నీ ఆళ్లకే రాయాల. యిదంతా ఎందుకూ? భారతదేశానికి మొదటి అధ్యక్షుడు హరిజనుడే కావాల.

సభలో—"హరిజనుల్లో తెగలు లేవా?"

"మాలమాదిగలు పరస్పర వివాహాలు చేసుకుంటారా?"

ఉప—యిన్నివేల సంవత్సరాలుగా మీరు మమ్మల్ని తొక్కిపారేసి ఊరుబయట అణగ్గొట్టి సమవు లేకుండా, ఆస్తిలేకుండా పాడుచేసి, యీనాడు పరస్పరయివాహాలంటావా? నీవు మళ్లీ చదుకొచ్చి, నీవు మళ్లీ డబ్బుండి, నలుగుర్లో తిరిగేటప్పుడు, మాలా లేదు మాదిగాలేదు. బ్రాహ్మలు, క్షత్రియులు, కోమట్లు, శూద్రులు అనే కులాలు పోయినప్పుడు మా కులాలు కూడా పోతయి.

సభలో—తథాస్తు!

అధ్య—తరువాతివారు.

ఉప—జైహింద్! కామ్రేడ్స్! యీనాడు భారతదేశానికి నిజంగా సుదినమో దుర్దినమో నేను చెప్పలేకుండా వున్నాను. కష్టపడి సాధించింది ఒకరు, అనుభవించేది ఒకరు. దేశం విడిచిపెట్టి పరాయిప్రభుత్వాల ప్రాపు సంపాదించి అజాద్‌హింద్‌ఫౌజు నిర్మించి మన శత్రువులమీద దండయాత్ర సాగించి వాళ్ల గుండెల్లో గాలం వేసిన మహానుభావుడు, ద్వితీయ భారత స్వాతంత్ర్యసమరనేత, నేతాజీ సుభాస్ చంద్రబోస్!

సభలో—"జైహింద్, నేతాజీ బోస్‌కీ జై!"

అధ్య—నిశ్శబ్దం, నిశ్శబ్దం. యీ స్వాతంత్ర్యం ఎవరు ఎల్లా సాధించారు అనే చరిత్రవిషయం యిప్పుడు చర్చనీయంకాదు. యికముందు వచ్చే ఉపన్యాసకులకు రెండునిముషాలకంటే ఎక్కువ యివ్వటానికి వీలు లేదు. తరువాతివారు మహిళా సంఘాధ్యక్షురాలు శ్రీమతి శరీమకుసుమంగారు.

శరీమం—అధ్యక్షా, సోదరసోదరీమణులారా! పురుషనిర్మాణమైన యీ చట్టంలో యింతవరకు పురుషులే ఎక్కువగా మాట్లాడివుండడం అంత ఆశ్చర్యకరమైన విషయం కాదు. అయినప్పటికీ నాకు మాట్లాడడానికి అవకాశం యిచ్చినందుకు మీకూ మీ అధ్యక్షులవారికీ నా అభివందనాలు. నేను ఒక్కవిషయం మాత్రం మనవిచేస్తాను. అదేమిటీ అంటే, యీ స్వాతంత్ర్యసాధనలో వీరమాతలు, వీరపత్నులు, వీరనారులు ఎంతమందో తమ సర్వస్వం ధారపోసిన సంగతి మీకు తెలియని విషయం కాదు. వెనకటి కోమటికవి వ్రాశాడు. పురుషుడైనా ధన్యాత్ముడు—"ఘనపతివ్రతాశాప కారణమున భానునుదయంబు వారింపబడియెగాన భారతీయాభ్యుదయమందు పాలుగొనగ ఆడువారికి మీయంత హక్కు కలదు." తత్కారణంగా స్వతంత్రభారతంలో నిర్మాణంకాబోయే నాగరికతాభవనాలలో అంతఃపురాలు తీసేసి, స్త్రీకి పురుషులతో సమానహక్కు లిచ్చి, విడాకుల చట్టం పెట్టి దేవదాసీపద్ధతి నిర్మూలంచేసి, సృష్టికారకులైన స్త్రీమూర్తి శక్తి గ్రహించి ఆరాధించిననాడే పురుషుడికి పుణ్యం పురుషార్థం లభిస్తాయని మనవిచేసి విరమిస్తున్నాను.

అధ్య—తరువాతివారు జాతీయముస్లిం నాయకులు అబ్దుల్ ఖాదర్‌సాహెబు బహదూర్‌వారు.

అబ్దుల్ ఖాదర్—స్నేహితులారా, నేను మొదణ్ణుంచీకూడా పుట్టిన దేశంలో వుండి, ఏమతాలవారైనాసరే అన్యోన్యంగా వుండాలని చెప్పేవారిలో ఒకణ్ణి. అబ్దుల్‌ఖాదర్ అంటే సంస్కృతంలో భగవద్దాసు అని అర్థం. ఏకోనారాయణం అనే ఉత్కృష్టమైన వేదాంతమతానికీ, ఒకడే దేవుడనే మహమ్మదీయమతానికీ ఏవిధమైన వ్యత్యాసమూ లేదు. ఈనాడు కారణాంతరాలవల్ల రెండు భాగాలైన యీ అఖండహిందూస్థానము మళ్లీ ఏకీభవిస్తుందని నా విశ్వాసం. జాతీయముస్లిముల తరఫున నేను మాతః భారతీయ జాతీయపతాకానికి జోహారు లర్పిస్తున్నాను

అధ్య—తరువాతవారు క్రైస్తవ సంఘ కార్యదర్శి సెల్లీమర్ల చినజానుగారు.

చినజాను—భారతీయ క్రైస్తవులు ఎప్పుడూ జాతీయవాదులే. కాని ఒక్కవిషయం. అల్పసంఖ్యాకులైన కులాలన్నిటికీ స్వతంత్రభారతదేశంలో అన్నివిధాలైన అనుకూలాలూ కలగజేసి వారి హక్కులు కాపాడతారని నా విశ్వాసం. రేపు జరగబోయే స్వాతంత్ర్య ఉత్సవాలలో మా సంఘంవారు పాల్గొన

డానికి సంసిద్ధులం. మా చర్చిలలో యీ సందర్భంలో ప్రార్థనలు జరపటానికి ఏర్పాట్లుచేశాం. తక్కిన కార్యక్రమం పెద్దలంతా ఏవిధంగా నిర్ణయిస్తే ఆవిధంగా మేం అనుసరిస్తాం.

అధ్య—తరువాతివారు.

ఉప—మహాజనులారా! సర్వజిత్తునామ సంవత్సర అధికశ్రావణ బహుళ చతుర్దశి శుక్రవారం భారతదేశానికి మహాసుదినం. ఇన్నాళ్లుగా మనం ఉవ్విళ్లూరి, ఆపిల్ల బాలాది ఎంతో త్యాగంచేసిన స్వాతంత్ర్యం అనే మహాధనం మనకు ఆనాడు పూర్తిగా లభిస్తుంది. ఆ మహాపర్వదినంనాడు మన సంతోషం ప్రకటించడానికీ, ప్రజానీకానికి స్వాతంత్ర్య సందేశమర్మం తెలియజెయ్యడానికీ ఏవిధంగా కార్యక్రమం నిర్ణయించాలి అనే విషయం చర్చించడానికిగాను ఈ సమావేశం ఆహ్వానించడమైంది. కాంగ్రెసు హైకమాండు వారు దీనికిగాను కొన్ని నియమాలు చేశారు. రాష్ట్రీయ ప్రభుత్వంవారుకూడా యీ విషయం ఆలోచించి కొన్ని ఏర్పాట్లు చేశారు. ఇందులో ముఖ్యమైన విషయం భారతస్వాతంత్ర్య ధ్వజారోహణం. పెద్దలంతా ఆలోచించి మనం యావన్మందీ యిన్నాళ్లుగా ఏపతాకంక్రింది ప్రజాసమరం సాగించామో, ఆ జాతీయ పతాకంలోనే కొద్దిగా మార్పుచేసి, దాన్నే స్వతంత్ర భారతధ్వజంగా నిశ్చయించారు. రాట్నచిహ్నం తీసేసి బౌద్ధధర్మచక్రం జండామీద కెక్కించారు. అవతార పురుషులలో అగ్రగణ్యుడైన గౌతమబుద్ధుడు లోకానికి ప్రసాదించిన అహింసాధర్మం, మానవసేవ, త్యాగదీక్ష మూర్తీభవించి మూడు రేకలా మనకు ఆ మహదాశయాలు స్ఫుర్తింపచేసే కాలచక్రమే ఆ మహాచక్రం. ఆ చక్రంలోనూ, ఆ చక్రం ఎక్కిన జండాలోనూ మన జాతిగౌరవం, మన జాతిప్రభావం, మన జాతి భవిష్యత్తు మూర్తీభవించి వున్నాయి. ఈ జండా స్వాతంత్ర్యరథానికి కట్టి "మాధవా మన రథంబు మరల రాదు" అన్నట్టుగా నిరోధం లేకుండా భావిభారత అభ్యుదయయాత్ర సాగిపోవాలి. ఏనాడో పురాణయుగంలో ఒకానొక చతుర్దశినాడు లోకకంటకుడైన నరకాసురుణ్ని సత్యభామసహాయంతో నిర్మూలం చేశాడు శ్రీకృష్ణమూర్తి. ఆనాటి సంస్కృతి మా సోదరి శరీమం చెప్పినట్టు కేవలం పురుషనిర్మాణమే కాదు. స్త్రీ పురుష సహకారానికి చిహ్నంగా అర్ధనారీశ్వరమూర్తిని సృష్టించిన యీ భారతీయ నాగరికతలో హెచ్చుతగ్గులు భావించేవారికి గాని కనపడవు. రేపు శుక్రవారంనాడు మళ్ళీ చతుర్దశి. నరకచతుర్దశి తరువాత మళ్లీ స్వరాజ్యచతుర్దశి. దీపావళిపండుగ చేసినట్టుగా యీ మహాపర్వదినంకూడా భారతదేశంలో తరతరాలుగా నిలిచిపోతుంది. నరకచతుర్దశి ఒక్క హిందువులకు మాత్రమే కాని యీ స్వరాజ్యచతుర్దశి సర్వమతాలవారికీ సంబంధించింది. జాతిమతవిభేదాలు లేకుండా, స్త్రీ పురుష భేదాలు లేకుండా, కులభేదాలు పాటించకుండా, ఆసేతుహిమాచలపర్యంతం, ఆబాలగోపాలం, స్వరాజ్యచతుర్దశి మహాపర్వదినంగా చెయ్యాలి. ఇంటింటా ఆనాడు దీపావళిచేసి, స్వరాజ్యలక్ష్మిని ఆరాధించి, శుక్రవారం నోములు చెయ్యవలసిన పర్వదినం. శ్రావణ శుక్రవారంనాడు మహాలక్ష్మిలాగ చల్లని చూపులతో ఘల్లు ఘల్లని వచ్చిన స్వరాజ్యలక్ష్మిని ఆ రోజున గ్రామగ్రామంలోనూ, వాడవాడలలోనూ, గుమ్మంగుమ్మంలోనూ ప్రతిష్ఠాపన చేసి, ఆరాధించవలసిన సుదినం. మన నాయకులూ, కేంద్ర, రాష్ట్రీయ ప్రభుత్వాధికారులూ నిర్ణయించిన కార్యక్రమం అక్షరాలా జరిపి, యితోధికంగా ఎవరి శక్త్యనుసారం వారు స్వరాజ్యలక్ష్మీవ్రతం చేసి ధన్యాత్ములు కావాలని నా ప్రార్థన.

అధ్య—కాలాతీతమైంది. అందుచేత యింకా మాట్లాడదలచుకున్నవారికి అవకాశం యివ్వలేకపోయినందుకు నేను విచారిస్తున్నాను. నాకు తోచిన విషయాలు ఏవో రెండు చెప్పి అంతటితో సభ ముగింపు చేస్తాను. యీ రోజున యీ సభకు అధ్యక్షత వహించడంవల్ల నేను నేర్చుకున్నది, మీకు చెప్పదలసింది ఒక్క విషయం వుంది. అది ఏమిటి అంటే మన జాతి అనవసర ప్రపంచం మానెయ్యవలసిన అవసరం. పిడికిటికీ విద్యానికీ ఒకటే మంత్రం అన్నట్టు ఏ సభలోకి

వచ్చినా, ఏ వేదిక ఎక్కినా, "గుడ్డెద్దు చేలోపడ్డట్టు" ఒకే ధోరణిలో ౧౯౪౭ సంవత్సరంలో ఏ ఉపన్యాసం చేశామో, ఏ అంశాలు మాట్లాడామో అవే చర్వితచర్వణంగా చెప్పడం మన జాతీయనాయకులకు పరిపాటి అయిపోయింది. యీ రోజున యిక్కడ మాట్లాడినవా రందరిలో ఒకరిద్దరు మినహా అసలు విషయంమీద ఎవరూ ప్రసంగించలేదు. మాట్లాడవలసిన విషయ మేదో గ్రహించి, చెప్పదలుచుకున్న దేదైనా ఉంటే అది క్లుప్తంగా చెప్పి వెళ్లిపోవడం నాగరికులైన జాతి మనుష్యుల లక్షణం. ఆ లక్షణం నేర్చుకున్నప్పుడే స్వరాజ్యం సార్థకం అవుతుంది. యింతక్రితం మాట్లాడినవారి సలహాలన్నీ మనం యావన్మందీ ఆమోదించవచ్చునని నా అభిప్రాయం. ప్రజానీకానికి యీ స్వాతంత్ర్యసందేశం అందజేయాలీ అంటే స్వరాజ్య చతుర్దశినాడు సర్వమతాలవారూ స్వరాజ్య లక్ష్మిని ఏకోవిసంగా ఆరాధించాలి. తరువాత భారత జాతీయ గౌరవచిహ్నమైన చక్రధ్వజం ఊరూరా ప్రతిష్ఠాపనచేసి, జాతీయగీతాలు పాడి, పర్వదినంగా చెయ్యాలి. ఇందుకుగాను ప్రభుత్వంవారు మన రాష్ట్రంలో వున్న ప్రతిగ్రామానికీ కూడా ఒక చక్రపతాకం అందజేయాలి. మన రాష్ట్రంలో వున్నవి మొత్తం ౩౮౦౦౦ గ్రామాలు. ఏ జిల్లాలో ఆ జిల్లా కలెక్టర్లు పతాకాలు తయారుచేయించి తహసీల్దార్లగుండా, రెవెన్యూ ఇన్‌స్పెక్టర్లగుండా, మునసబుల ద్వారా గ్రామాలకు చక్రపతాకాలు సరఫరాచేసి, ధ్వజారోహణ మహోత్సవం జరిపించాలి. దీనికి కాలవ్యవధి లేదు అని ప్రభుత్వంవారు అనడానికి వీలులేదు. తలుచుకుంటే యిది రెండుమూడురోజుల్లో జరిగే పని. స్వాతంత్ర్యోత్సవాలు కేవలం పట్టణాల్లో జరిగి లాభం లేదు. గ్రామాలకు స్వాతంత్ర్యసందేశం అందాలి అంటే చక్రపతాకం ప్రతిగ్రామంలోనూ ప్రతిష్ఠ చెయ్యాలి. ఈ అంశాలు విపులంగా చర్చించి ఏర్పాట్లు చెయ్యడానికిగాను ప్రభుత్వంవారు వెంటనే ఒక చిన్నకమిటీ పెట్టి దానికి కావలసిన సొమ్ము మంజూరుచేసి స్వాతంత్ర్యోత్సవాలు జరిపించాలి అని సభవారి తరఫున నేను ఒక తీర్మానం ప్రతిపాదిస్తున్నాను. ఇది అందరూ ఆమోదిస్తారని అనుకుంటాను.

సభలో—అందరూ, అందరూ.



# పారతంత్ర్య తమస్సు పలచబారే వేళ

●

పారతంత్ర్య తమస్సు
పలచబారే వేళ
భ్రాంతిలో బడకుమా
శాంతి వీడకుమా.

కలతమై బహువ్యథా
ఫలితమౌ నవసుధా
కలశమును శకలముల
గావింపబోకుమా—పారతంత్ర్య.

అత్యాతురుడ వౌచు
అరువదేడులు కన్న
అరిది కలల వెలుంగు
ఆరిపేయకుమా—పారతంత్ర్య.

విదళద్దళావళీ
విగళన్మధూళికాం
చితమైన మాలికను
చిదిమివేయకుమా—పారతంత్ర్య.

నవ్యశుభదీప్తిలో
నైకసుకలాప్తిలో
మానవతయే లుప్త
మౌనటు చరింపకుమ—పారతంత్ర్య

పారతంత్ర్య తమస్సు
పలచబారేవేళ
భ్రాంతిలో బడకుమా
శాంతి వీడకుమా!

— జానకీజాని

—

# నా కవిత్వము - నా విమర్శ

(హాస్యరచన)

●

— శ్రీ సామవేదుల సీతారామశాస్త్రి —

[ గత సంచిక తరువాయి ]

(తదనంతరము శ్రీ బిందుకవిగారు ప్రవేశిస్తారు.)

"అన్నట్లు! ఒక్క మాట. ఈ కవిత్వం ఉచ్చారణారాహిత్యం గల సంజ్ఞాయుక్తమైనది గాబట్టి యిది చదివి వినిపించడానికి అసాధ్యమైనది. అందుచేత ఆ పద్యాలను శ్రీ బిందుకవిగారు యీ నల్లబల్లమీద వ్రాసి చూపిస్తారు."

(శ్రీ బిందుకవిగారు బల్లమీద యీ క్రింది విధంగా వ్రాస్తారు.)

"—!" '!...............' '!!!' (?).

"Excellent' Wortby · f exp aioing! Too much Praisewortby! A thing that provides vast discussion—అన్నట్లు! ఇది ఆంగ్లానువాదం! ఆహా! ఏం ఉన్నతమయినది! వ్యాఖ్యానానికి సరియైనది! ఎంతో హెచ్చుగా పొగడతగినది. అనంతమైన భావాలు కుప్పలుగా కుప్పించు పుష్పగుచ్ఛము.

"మీ కిందులో ఏమైనా భావం తట్టిందా? అరె! అలా నోళ్లు తెళ్లబెట్టుకొని కళ్లు విప్పి చూస్తారేం! ఇంతటి అదృశ్యభావసంద్రంలో ఒక్క చిటి బొట్టయినా మీ కళ్ల పడ్లేదూ అంటే, మీకు దృష్టి లేదనే అనుకోవాలి. లేదా నాకు ఆ విధంగా కనిపిస్తూ ఉండడంచేత నా దృష్టిలోనే మసకేమో అనుకోవాలి. నా దృష్టిపై నాకు దృఢవిశ్వాసం ఉన్నది గాబట్టి ఇది మీ లోపమే. మీ ఊహాప్రపంచంయొక్క సంకుచితత్వంవల్లనే అనుకుంటాను.

"మీ ఊహాలోకానికి గోడలు పడగొట్టండి. మానసిక భావనకు రెక్కలు కట్టండి. భావవిహంగానికి బంధనం తీసిపారేయ్యండి. అప్పుడే యిలాంటి పద్యాల అర్థం చేసుకోగలరు. అప్పుడే యిట్టి కావ్యాలను ఆనందించగలరు. అప్పుడే యీ విశేషమైన కృతులను తయారుచెయ్యగలరు.

"ఈ పైకావ్యం భగవద్గీతలోని సారమంతా తెల్లము చేస్తోంది. శ్రీకృష్ణప్రభుశేఖరుని సుందర ముఖారవిందప్రసాగీతామధుప్రసంగిని గ్రోలిన ఆ అర్జునుని యొక్క మానసిక పరిస్థితిని తెల్లము చేస్తుంది.

"అదిగో! ఆ బల్లమీద చూడండి! ఆ అల్లికలో ఒక్కసారి మీ దృష్టి సారించండి. మొదటి కొటేషన్ల మధ్య ఉన్న "—!" చూశారా?...దీని భావం ఏమిటో తెలుసా?...రెండు సేనల మధ్యనున్న ఆ అర్జునుని మనస్సు ఒక Black, అంటే 'ఖాళీ' అయిపోయి ఉంటుంది. అంటే 'ఏమిటి కర్తవ్యము' అనే ఆలోచనవల్ల బుర్ర ఖాళీ అయిపోయిందన్న మాట. ఆ తర్వాత ఏమిటి చెయ్యడం అనే ఒక ప్రశ్నార్థకపు సంజ్ఞ బుర్రలో ప్రవేశించింది. అది ఆ అర్జునుణ్ణి ఒంటిపూసతేలులాగ ఊరంత వేధించడం మొదలుపెట్టింది.

"అప్పుడు శ్రీకృష్ణపరమాత్మ రెండవ రెండు కొటేషన్ల మధ్య అంటున్నాడు. అంటే, ఆ రెండు సేనల మధ్య నిలబెట్టి అర్జునునికి తత్త్వబోధ చెయ్యడం మొదలుపెట్టేడు.

"ఓయి! వెర్రివాడా! నీకీ నూతనకవిత్వం ఎక్కడనుంచి అలవడిందోయి!" అని అడిగినప్పటి అప్పుడు చూపిస్తూ ఒక జండాకొయ్యను (!) జారీ చేశాడు. చూశారా! ఎంత భావగాంభీర్యమో! ఆతర్వాత తాపీగా ఒక్కటొక్కటిగా ఉపనిషత్తు రమ్య, అర్థమనోమూలసిద్ధాంతాలను ఒకదానితర్వాత ఒకటి విశదపరుస్తూ ఆ చుక్కలున్న భాగాన్ని కాస్తా నింపిపోస్తాను. దాంతోటి భగవత్స్వరూపాన్ని గ్రహించిన అర్జునుడు ఆఖరి రెండు కాళ్ళేవన్న మాన్యస్థలంలోనూ అశ్వనీకాంతదాహ్యాలతో మూడు జండాకొయ్యలున్నాయి శ్రీకృష్ణపరమాత్మను స్తోత్రం చేసి తన దేహాన్ని సాష్టాంగపడ్డ పెట్టేసి అంతటి కవిత్వానికి ఒక పెద్ద ఫుల్‌స్టాప్ పెట్టేస్తాడు.

"ఏం! ఇప్పు దగ్గరయిందా దీని భావం! ఇప్పటికి తెలిసిందా దీని ఔచిత్యం! ఈనాటికి గ్రహించేరా దీని గొప్పతనం! ఇంకా నే నొక్క అర్థమే చెప్పేను. ఈ కావ్యానికే శృంగారకావ్యాల నన్నింటికీ తీర్పు చిద్దగర్భిత భావాలతో అన్వయించి వ్యాఖ్యానించవచ్చు. కాని ఇప్పుడు నేను చెప్పదలుచుకోలేదు లెండి. అది మీ మీ తెలివితేటలనుబట్టి మీ అంకెల మీరే మీ అక్షరములకు తగినట్టు అన్వయించుకోడం శ్రేయస్కరం. దానికల్లా మరేమీ చిక్కు లుండవు మరేమీ దెబ్బలాటలుండవు.

"ఇన్ని విధాల గానూ విపులీకరించి చెప్తున్నప్పటికీ మీరు ఈ కవిత్వ మేమిటా అని తేలికగా చూస్తున్నట్టున్నారు. ఈలాగున అనుకుంటారనే నా ప్రారంభోపన్యాసంలో ఈ విషయం గూర్చి చాలా చెప్పించేను. ఈపాటికి మీరు మరిచిపోయివుంటారని మళ్ళీ చెప్తున్నాను.

పూర్వకవిత్వానికి వ్యాకరణం అన్న బంధనం ఎప్పుడు వచ్చిందో కాని, అప్పటినుండీ యీ కవితాధార ఒకే కాలువగుండా, వాళ్ళు త్రవ్విన కాలువ వెంబడే, వాళ్ళు కట్టిన ఆనకట్టలమీంచే, వాళ్ళు తెచ్చిన కొలతలలోనే పారాలని చాలా నిర్బంధించి, కవితానదియొక్క సహజత్వాన్ని, బహుముఖత్వాన్ని నాశనం చేశారు. కొన్నాళ్లవరకూ ఆ ప్రవాహం అవిచ్ఛిన్నంగానే ప్రవహిస్తూవుండేది. ఆ ప్రవాహంలో కలియడానికి తగిన ఔన్నత్యంలేని నవీనకవులు స్వతంత్రించి పారిపోయేరు. వారి సంకుచితత్వంనుంచి, నిర్మూమ కత్వంనుంచి బేరుపడ్డామని గర్వించేరు. యతి, ప్రాస లెంచుకన్నారు. దానిమీద కొంత రాద్ధాంతసిద్ధాంతాలు జరిగినప్పటికీ, ఆ తర్వాత మీరే దానికి ఒప్పుకొన్నారు—కట్లు తెగిపోయినా నీరసేది ఉందిగదా అని......రానురాను యతే కాదు, ప్రాసే కాదు, గణాలే కాదు, వ్యాకరణమే కాదు, ఏవిధంగానైనా, భావం వెల్లడిచేస్తే అదే చాలన్నారు కొంతమంది. దానికీ మీరు ఒప్పుకొన్నారు— నెత్తిమీదపడ్డా రుచిగా ఉన్న మామిడిపండే కదా అని......ఆ తర్వాత వారు నెత్తిమీద తగలబలసినదానికి రుచికూడా చూడకుండా గీకిన తాటిటెంకలతో కొట్టడం మొదలుపెట్టేరు. గద్యపద్యాలనే పిల్లలలో కాళ్ళనికూడా తెంపేసి దానికి బయలుదేరారు. దానికీ మీరు ఒప్పుకొని, అఖండసన్మానం చేస్తున్నారు. ఇన్నివిధాల బాధాకరంగానూ, అసహ్యకరంగానూ ఉన్న సాహిత్యమును, ఇన్నివిధాల అభినందిస్తున్న మీయొక్క అనిర్వచనీయహృదయవిశాలత్వం నాకు కూడా విదితమయింది. ఏది రాసినా, మీరు ఆనందంతో స్వీకరిస్తారని నాకు తెలుసును. అటువంటి సమయంలో కష్టతరమయిన ఆ పాతమార్గాల్లో ఎందుకు పోవడం! నూతనత్వానికి ఈ రోజుల్లో విలువ ఉన్నప్పుడూ, చాలా సునాయాసంగా నూతనత్వం సంపాదించగలప్పుడూ ఇంక వేరే ఆలోచన దేనికుడు!

"అయితే; మా కవిత్వంలో అర్థం లేదంటారా! ఇప్పటివరకూ పుట్టి గ్రంథాల్లో అర్థముండి, నా గ్రంథాలయములోని గ్రంథాలలోనే అర్థముండదా! ఏదీ! ఆనుభవకకవులలో ఎవరైనా ఒకరి పుస్తకం తెచ్చి అందులో ఒక పాటో, పద్యమో, వచనపద్యమో పద్యరచనమో, సీసదండకమో, శార్దూలవిక్రీడితమో చదివి అర్థం చెప్పండి...మీ అర్థంలో వీరంతా ఏకీభవిస్తారేమో కనుక్కోండి...ఒక్క పద్యానికి యిద్దరు భిన్న వ్యక్తులు ఒకేవిధమైన అర్థము చెప్పేరూ అంటే, ఒక

వి:న యిన భావం కనబరచేరూ అంటే అది కవిత్వమే కాదు. అది ఒట్టి ప్రబంధమనే మనం విడిచిపెట్టేయాలి. పూర్వమైనా, మాటలకు అర్థాలు మనం నియమించుకున్న వేళ, లేక బ్రహ్మ నోట్లోంచి నిఘంటువు ఊడి పడ్డాగా?......మాటలకు అర్థాలు, భావాలు మనం నియమించుకున్నారి. మన తాతలు, ముత్తాతలు పెట్టిన అర్థాలతో మనం బంధితులం కానక్కరలేదు! అందుచేత నాగరికత మారుతూన్నట్టే, కవితావిధానమూ మారుతుంది; అన్వయక్రమమూ మారుతుంది.

"ఇంకో ప్రశ్న ఎవరో కాగితంమీద వ్రాసి యిప్పుడే అందజేశారు— ఈ అక్షరకవిత్వ మనే ఈ Short-mouth (చిన్నముఖం) కవిత్వం ఏమిటీ అని.

"ఆహా! నిజంగా ఇతను కూడా గొప్ప కవి అయి ఉంటాడు. ఇలాంటి మాటలను మనం సామ్యం చేసుకుంటేనేగాని కవిత్వాలోను, భావంలోను సృష్టి అనేది ఉండేదు. భావను మనమే సృష్టించుకోవాలి. ఈలాగ వాలుగోడిమాటలు క్రొత్తవి తయారు చేస్తూ ఉంటే సృష్టి గాదూ!...మనం సదా వాడుకుంటున్నప్పుడే భావం నిలుస్తుంది. మనం వాడుకోడం మానేయగానే భావ నశించిపోతుంది. భావాలకు మనమే సృష్టి, స్థితి, లయకారకులము. భావను నిలిపినా మనమే; ఖూనీచేసినా మనమే.

"ఇప్పటిప్పుడే మాటకీ, అర్థానికీ సంబంధం లేదనిన్నీ, ఏమాటకైనా మన మానసికపరిపాకము ననుసరించి యిష్టమొచ్చిన అర్థ మివ్వవచ్చుననీ చెప్పేను. ఎటొచ్చీ, మాటలకు బదులు అక్షరాలను ఎందుకు వాడుతున్నారనా?—అది అర్థంచేసుకొందుకు ఆధునిక నాగరికతలోని కొన్ని విషయాల నవగాహన చేసుకోవాలి.

"గత నూటయేభై సంవత్సరాలనుండి మన దేశంలోని నాగరికతా పరిణామంయొక్క విధానాన్ని ఎరిగినవారు యిందులో చాలామంది ఉన్నారు. మణికట్టులదాకా చేతులున్న రవికలు పోయి, నెమ్మదినెమ్మదిగా చంకల్లోకి పోయే చేతులు గల బాడీలుగా తయారయిన ఈ కాలంలో, పాదాలనుకూడా కప్పే చీర కుచ్చెళ్లు కొద్దికొద్దిగా తీసిపోతూ మోకాళ్ల మీది మీదికి పోతూన్నట్లుగా మారుతూన్న ఈ కలికాలంలో, పిక్కలమీద జీరాడు వాలుజడలు రాను రాను చుట్టుకొని చుట్టుకొని మెడలమీద కారాడే ఉంగలాలుగా తయారయిన ఈ రోజుల్లో, కాళ్ల మోకాళ్లకట్టుకొబడే పంచలు గొట్టాంగా మారి, రోజురోజుకీ పాదములమీంచి పిక్కలమీదకీ, పిక్కల మీంచి మోకాళ్లమీదికీ పోయి, అక్కడ నుంచి కౌపీనం దాకా నిక్కర్లుగా వెలసి, ప్రస్తుతము ఇంకా మీది మీదికి డ్రాయర్ల పేరుతో పోతూ, ఇకముందు ఏ నామం ధరిస్తాయో తెలియని యీ సమయంలో, బుగ్గలమీద నాలుగైదు చుట్లు తిరిగి, నిమ్మకాయలనుకూడా నిలువ గలిగే కత్తిగల మీసాలు వాలి పోయి మెల్లమెల్లగా నోటిదివరల చేరుకొని, అప్పటికి స్థిరత్వాన్ని గాంచలేక ముక్కుక్రింద చేరి, పొడుంపట్టుతోటే ముక్కులోకి ఎగిరిపోయేందుకు నిర్ణయించినట్లున్న ఫ్రెంచి కట్టులయి, ప్రస్తుతము క్లీన్ కట్టు లవుతున్న ఈ రోజులలో, మస్లిన్ పాపిడీతో, ఉంగరాల జుట్టుతో, బుజాలమీద నల్లలాడే గిరజాలు నెమ్మదినెమ్మదిగా జన్మస్థానానికి దగ్గరపడి, జన్మమే లేనందుకుగాను, పట్టాల పుచ్చుకుంటున్న యీ శతాబ్దంలో, కాటికిపట్టుక పోదగుండే మనుష్యులు, ద్వారాలకు కలపకర్చుని పమూ లేకుండా ఆలోచించుకొని, బ్రహ్మదగ్గర పర్మిషన్ తీసుకొని, తెత్తెకుచొప్పునా జానెడుచొప్పునా, మూరెడు చొప్పునా బారెడుచొప్పునా క్రిందక్రిందికి తగ్గుతూ, తగ్గుతూ ప్రస్తుతం భూమిలోపలికే రాలవాలేమోనన్న పరిమాణంలో కనపడుతూఉన్న శరీరాలు గల యీ నవయుగంలో, యింకా పొడుగుమాటలూ, చేంతాడు సమాసాలూ ఎక్కువ లేవని ఆక్షేపించడంలో ఏమీ అర్థంలేదని నా మనవి.

"ఇది Zero (శూన్యము)లో కలిసిపోయే యుగం. అందుచేత వారికి ఆదర్శప్రాయంగా మా కవిత్వం శూన్యానికి చాలా దగ్గరగా చేరి, తన దగ్గరకు రావడానికి ప్రోత్సాహంలో ఉన్న సమస్తలోకంవైపు సింహావలోకనం చేస్తూఉంటే ఆ జీరోవద్దకే వస్తూ, దాన్ని తెక్కరిస్తున్నారూ అంటే నాలో మీ ఉద్దేశ్యం

ఏమిటో నా కర్థం కాలేదు. ఇది మీరు పాక్షపాతిక మైన ఉద్దేశ్యాలతో చూడడంవల్ల కలిగే దురభిప్రాయమే కాని వేరు కాదు. ఏదైనా ఆనందించే శక్తి మీలోనే ఉంది. ఏదైనా నిరసించే శక్తి మీలోనే ఉంది. పిచ్చివాడు గడ్డిపోచతోనే ఆనందం అనుభవిస్తాడు. లక్షాధికారికి వెయ్యిరూపాయిలు పైబడ్డా లాభం కనుపించడం లేదనే అంటాడు. ఆనందం పొందాలీ అంటే పై ఉదాహరణలోని గూఢార్థం గ్రహించండి.

"ఇంకా చాలామంది కవులున్నారు. మీరు మరేమీ ప్రశ్నించకుండా వారి పద్యాలు వింటూ, నా విమర్శన కానందిస్తూ, ఆఖరయిపోయినతర్వాత, 'దేముడా, రాముడా' అని ఇళ్లకుపోయి, హాయిగా పడుకుంటే, నేను చాలా సంతోషిస్తాను. ఇక 'నాక్షేపకకవి'గా రూపకల్పిస్తారు.

(శ్రీ బిందుకవిగారు లోపలికి పోతారు)

"అట్టే టైము వేస్టు చెయ్యదలుచుకోలేదు. ఈయన ఘనత వర్ణనాతీత మైనది, అపార మైనది నా చేతనైనంతమట్టుకు వర్ణిస్తాను.

"ఈ కవి-సకలశాస్త్రార్థాంతరార్థాసర్గంబుల విపులంబుగా గ్రహించిన ఈ కవి-అన్ని ఆధునిక గ్రంథాల సారమూ, ఈశ్వరుండు హాలాహలంబుకరణి కంఠంలో ఉంచుకొన్న ఈ కవి-అనన్యసామాన్య ప్రజ్ఞాసముపార్జితానంత కీర్త్యాచ్ఛాదిత సమస్తలోకానేకనంబులకల ఈ కవి-అధునిక కవిత్వాలలో నవ్యరీతులు చూపించిన ఈ కవి-అక్షరబిందుకవిత్వాలను మేళవించి యింపుగూర్చి, సొంపుదేర్చి, వంపుదీర్చి, సభాసదులందరూ కంపన మానందించు ఈ కవి- మా కవితాసమితికి మణిపూసలా వెలుగొందుచున్న యీ కవి-హిమంథు యిప్పుడు మాట్లాడబోతూ ఉన్న ఈ కవికారగుండు మీ ముందుకి నెమ్మదినెమ్మదిగా, గాలిలో తూగిరివచ్చినట్లు తేలిగ్గా వస్తున్నాడు చూడండి! కొందరు దుష్టులు యీతని ఆక్షేపకకవిత్వాన్ని నస్తికవిత్వం అని ఆక్షేపిస్తూ ఉంటారు. ఇతని కొద్దిగా ఆ లోపం ఉన్నమాట వాస్తవమే. కాని, దాన్ని కవిత్వంలో ఉపయోగించుకొని, దానివల్లనే కవిత్వానికి క్రొత్త రుచి ఆపాదింపచేస్తున్నాం. ఎంత గొప్పదనమో మీరే గ్రహింతురుగాక! అంత గొప్పదన మున్నదిగాబట్టే ఈయన కవిత్వానికి ఇంకే శాస్త్రసముక్తమయిన పేరూ పెట్టక యీతని పేరుతోనే దాన్ని పిలుస్తున్నారు.

"మనకు అట్టే టైము లేకపోవడంవల్లనూ, మీలో కొందరు సినిమా రెండవ ఆటకు టైమయిపోతోందని లేచి వెళ్లిపోదలచి, గేటు తాళాలు వేసి ఉండటంచేత విధిలేక ఆగిపోయిఉండడంచేతనూ మీరు అట్టేశ్రమ యీయకుండా ఉండేందుకు ఈయనగార్ని ఒక్క పద్యమే చదవమంటాను. అది ఆయన ఏవిధంగా అన్వయిస్తాడో, ఆవిధంగా బోర్డు మీద వ్రాసి మీకు చూపిస్తాను.

(శ్రీ ఆక్షేపకకవిగారు ప్రవేశించి చదువుతారు)

క......క......క......క.—కం..........
కం......కం......కంపు!......కంపు!!

(సభాసదులందరూ ఒక్కమారు గొల్లుమంటారు)

"అయ్యో! మళ్లా మీరు అల్లరి పెట్టడం మొదలు పెట్టేరు. మీ కిదో తమాషాగా ఉంది. ఇందులో అర్థమును గ్రహించడానికి ప్రయత్నించాలిగాని, అనవసరంగా గోలచేసుకుంటూ ఉంటే లాభం ఏమిటి! ఇంతకీ యీ కవిగారు ఉపోద్ఘాతపద్యమే చదివేరు. ఇలాంటి కవిత్వం ఆధునిక కవిత్వంలో చాలాచోట్ల ఉన్నదే! అది కొంతమైనా గ్రంథపరిచయమున్నవారికి అర్థమవుతుంది. ఈలాంటి లైన్లలోనే నిడిచిన కవిత్వం ఎక్కడున్నదో!...

"యింతకూ మీరు యిందులో భావార్థం గ్రహించలేకపోయేరు. తత్త్వార్థం గ్రహించలేకపోయేరు. అది నాలాంటివాళ్లు విడమర్చి అరటిపండులాగ ఒలిచి విశదీకరిస్తే అప్పుడు మీరు ఆకళించడానికి ప్రయత్నిస్తారన్నమాట!

"సరే! ఇందులో భావార్థం ఏమిటంటే— 'క' అంటే 'ఖ' అన్నమాట. 'క, ఖయో రభేదః' అని యిప్పటి వ్యాకరణసూత్రము. తెలుగులో ఒత్తు అక్షరములు లేవుకాబట్టి, నోరుతిరుగనివాళ్లు 'క'కార

మును 'ఖ'కారంగాను, 'ఖ'కారమును 'క'కారం గాను ఉచ్చరిస్తారు. అది ఉచ్చారణదోషమే. 'క'కారం ఉండవలసినచోట్ల 'ఖ'కారం చాలాచోట్ల ఆధునికకవిత్వంలో 'శిఖు' 'వాఖు' అని ఉపయోగంలో ఉన్నాయి. 'ఖ' అంటే 'ఆకాశం'. అవునా! అటువంటి ఆకాశంలోంచి Gradual గా—అదే గొప్పతనం. అందులో ఆయన బిందుకవిత్వం ఉపయోగించడంవల్ల ఏమక్కరలేద్దు ఆహాలో తెలియని సందిగ్ధతలో ఒక్కొక్క చుక్కనిండి ముందుముందుకు వాయి, అక్కడా ఆకాశాన్ని చూసి, యింకా అగలేక, అక్కడా యింకే అవస్థ పొంది—ఈ విధంగా చుక్కలన్నీ క్రమేపీ జరిగిన క్రియ, సంకేతాత్మకమైన జన్మ నిరూపింపబడుతుంది. అటువంటి ఆకాశం నుంచి జన్మించిన దేమిటంటే కం......కం అంటే నీరు అనికదా! చూశారా!...ఆ ఆకాశంనుంచి క్రిందకు కర్షింపబడిన నీరు...పారి...పారి—ఇంతలో బిందుకవిత్వం ఏవిధంగా సాధించేస్తుందో చూడండి—అంతేగాదు, 'ఆకాశంలోంచి నీరు ఉద్భవించింది' అంటే 'అవును గావోలు'ని చల్లగా ఊరుకుంటాం... అంతేగాక, ఆ పుట్టకంలో ఆకాశం అనుభవించిన ప్రసవవేదనగాని, ఆరాటంగాని విశేషమవుతుందా!... అర్థం!...అది యిలాంటి కవిత్వాలలోనే గోచరిస్తుంది. ఆ 'కం' అంటే నీరు ఒకచోట చేరి సరస్సుగా తయారయి...అందులోంచి 'కంపు' అనేది ఉద్భవించిందన్నమాట! 'కంపు'అంటే 'దుర్వాసన'అని మీరు అనుకుంటున్నారు కామోసు. ఆ అర్థం కాదిక్కడ. ఈ పద్యంలో శ్లేషకూడ ఉంది. ప్రస్తుతార్థం ఏమిటంటే, 'కంపు'-'పు'అనేది పువ్వును అనే అర్థమిస్తుంది. యిందాకా అతుకుకవిత్వంలో అది ఏవిధంగా సాధ్యపడుతుందో చెప్పుకొన్నాం. అంటే, 'కంపు'—కం పువ్వు, నీటిపువ్వు, అంటే 'కమల'మన్నమాట! ఈ విధంగా వ్యుత్పత్తి చెప్పుకోవాలి. ఈ ఆకాశోద్భవ జలోద్భవ కమలమువలె నాకవిత్వంకూడ మానసాకాశంలో విహరిస్తున్న భావమేఘాలు వర్షించ, వాహ్యదశలమున గభీరజలాశయముగా మారి, అందులో ఈ విధంగా 'కంపు'అంటే 'కవితాపువ్వును' ఉద్భవించి, తన సౌరభమును నలుదిక్కులా వెదజల్లుకొంద అనే భావం...ఇది స్వీయ వ్యాఖ్య. ఇందులోనే కుకవి దూషణంకూడ పేరు పేరున కరుపనా నిర్దేశ్యమయి ఉంది. అది మీకే అర్థం చేసుకుంటారని వదిలిపెట్టేసేను.

"అంతేకాక, యిది ప్రథమపద్యం గాబట్టి భగవత్ స్తుతికూడ యిందులోనే ఉంది. "ఆకాశాత్ పతితం తోయం యథా గచ్ఛతి సాగరం, సర్వదేవ నమస్కారః కేశవం ప్రతి గచ్ఛతి" అనే దానికి స్వేచ్ఛానువాదం. 'కేశవం ప్రతిగచ్ఛతి' అన్న దానికి యిందులో ఏభావమూ లేదని అడుగుతారా! లేకేం! ఏ దేవునికైనా నమస్కారం ఎందుకు చేస్తాము!...మన మనోరథాలు ఫలించాలనేకదా! ఎప్పుడైతే పుష్పించడం మొదలెట్టిందో అప్పుడే ఫలవంత మవుతుందని ఊహాగం—ఇదే పద్ధతి అన్వయించుకోడానికి. ఎవరిని పొగడదలుచుకొన్నా, ఎవరిని తిట్టదలుచుకొన్నా దానికి తగినట్టు అన్వయించుకోవచ్చు. అది మన శక్తిమీదనే ఆధారపడివుంటుంది. కృషిమీదే ఫలాన్నిస్తుంది. దానిని మనం ఆ విధంగానే భక్షిస్తామో, ఊరవేసుకొంటామో, ముగ్గవేసుకుంటామో, మాగవేసుకుంటామో, కుళ్ళబెట్టుకుంటామో- అది మన యిష్టం మీదనే ఆధారపడివుంటుంది.

"మీలో ఈ ఉవకవిత్వాన్ని ఇంకా వినాలని కుతూహలపడుతున్నవారు చాలామంది ఉన్నట్టున్నారు. కాని, కాలం దగ్గరపడింది కాబట్టి, కొంత కొంత తొందరగా జరిపిస్తున్నందుకు క్షమించండి.

(శ్రీ అతుకకవిగారు నిష్క్రమిస్తారు)

"ఇంక శ్రీ మూకకవిగారు ప్రసంగిస్తారు. ఎంతటి మూకనైనా యిట్టే రంజింపచేయగల ఈయన కవిత్వం సంగతి నేను ముందుగా చెప్పను......ఈ విశిష్టమైన కవిత్వం ఏ భాషలో కూడా లేదని చెప్పడానికి నేను ఎంతో గర్విస్తున్నాను. ఈ కవితామృతాన్ని మీరు ప్రత్యక్షంగా ఆస్వాదించవలసినవాళ్ళు కనుక దాని మంచిచెడ్డలు మీతో నేను ఆలోచిస్తాను.

(శ్రీ మూకకవిగారు వచ్చి కుర్చీలో కూర్చుంటారు. 'ఏమిటి చెప్తాడో' అని అందరూ ఆశ్చర్యంగా చూస్తూఉంటారు. ఒక్కొక్క నిమిషమే గడుస్తోంది. సభలో విజిల్సు, చప్పట్లు, కేకలు బయలుదేరుతున్నాయి. కొంతమంది రామభజన చెయ్యడం మొదలుపెట్టేరు. మరికొందరు 'యిక్కడికి రాధరోయ్' అని కొట్టుకోవడం మొదలుపెట్టేరు. యింకా చెప్తాడు కామోసని కొంతమంది ఆలాగే ఆఖరుదాకా నోళ్లు వెళ్లబెట్టుకొని, చూస్తూ కూర్చున్నారు. పది నిముషాలు గడిచేయి...శ్రీ మూకకవిగారు లోనికి వెళ్లిపోతారు)

('Excellent' అని కొందరు, 'భళామోరా' అని కొందరు, 'జోహార్' అని కొందరు, 'అద్భుతం'

అని కొందరూ, 'పేకశాధరోయీ' అని కొందరు, 'కీడ వదలిందని' కొందరూ రకరకాల అభిప్రాయాలు జారీ చేశారు. మొత్తానికి సభ అంతటా సంచలనం కలిగింది)

"ఈ కవిత్వాన్ని మీరంతా విన్నారుగనక— (మళ్లా సభ అంతా ఘొల్లున నవ్వుతుంది)— Silence Please! దీన్ని నేను కవిత్వం అనడం మీకు ఆశ్చర్యంగానే ఉండవచ్చు. యీ సంగతి మీకు ముందుగానే చెప్పేదుగాని మీరు తిన్నగా అర్థంచేసుకోలేరు. కవిత్వంలో ముఖ్యమైనవి భావం, రసం. ఆ రెండూ కలగలిసి ఉన్నప్పుడు మాటలం పెవలసిన అవసరమేమిటి! మాటలున్న కవిత్వంలోనే ఒకని అర్థం ఒకనికి పొసగనప్పుడు, మాటలయొక్క ఆధిక్యతేమి ఉంది! చూశారండి—ఈయన కూర్చున్న పది నిముషాలలోనూ సభలో ఎంత సంచలనం కలిగిందో! ఎంతటి హాస్యరసభూయిష్ఠమైన కావ్యమైనా యింతటి ఆనందాన్ని యివ్వగలదా! యింతటి రసాన్ని స్రవించగలదా! యింతటి అర్థబాహుళ్యాన్ని ప్రకటించగలదా! పూర్వపు కవులు అయినా, శ్లేషను ఉపయోగించినప్పుడు, రెండో, మూడో, మహా అయితే నాలుగో అర్థాలు చెప్పగలిగేరు. అధునికకవుల్లో కూడ నానార్థాలకూ ఒక పరిమితి ఉంది. కాని యీయన కవిత్వంలోని వివిధార్థాలకు లెక్కలేదు. ఈ సభలో ఎంతమంది ఉన్నారో అందరూ వారికి తగినట్టు ఒక విధంగానో, రెండు విధాలుగానో, అనేక విధాలుగానో అన్వయించుకొన్నారూ అంటే, ఈయన కావ్యంలోని అర్థబాహుళ్యంయొక్క విశాలత్వం మీకే బోధపడుతుంది.

"మీలో కొందరికని రూపు చూసి, ఆనందించి హర్షిస్తూవుండగా, యీతని కవిత్వంలోని ఏభావమో గాని, కొంతమందిలో భక్తిని రేకెత్తించి, వారిచేత రామభజన చేయించింది. యీతని ఏ అనాచ్ఛాదిత వాక్కో కొందరిలో ఉత్సాహాన్ని కలుగజేసింది. కొందరికి ఈయన్ని చూడగానే ఏ మూగబంధువులో జ్ఞాపకానికి వచ్చి మనోనేత్రంముందు తాండవమాడ్డం మొదలుపెట్టేరంటారు. కొందరు 'ఏమిటీ తమాషా' అని ఆశ్చర్యంగా చూసి, ఆఖరికి నోళ్లు వెళ్లబెట్టేరు. అంటే అలాంటివారికి భగవంతునియొక్క నిజస్వరూపం కనిపించిందన్నమాట. నేను చెప్పలేదూ! ప్రతివాడికీ ఏదో ఒకొక్క ఉద్దేశ్యం కలిగివుంటుంది. అది ఇంకొకని ఉద్దేశ్యంతో ఎప్పటికీ సరిపోయివుండదు. తన కవిత్వంవల్ల ఏమనిషిలో ఏభావం గోచరించిందో, కవిగూడా చెప్పలేడు. విమర్శకుడు కూడా విన్నవించలేడు. విన్నవారుకూడ వివరించలేరు......ఇటువంటి చిత్రకవిత్వం ఎప్పుడైనా విన్నారా!

"అనవసరంగా దస్తాలకి దస్తాలు దండుగచేసి, ఎవ్వరికీ అర్థంకాకుండా వ్రాసి, దానికి ప్రింటింగుకు ఊరంత డబ్బుపోసి, ఎడ్వర్టయిజ్మెంటుకి మరోయింత ఖర్చుపెట్టి, అప్పటికీ చెలామణీ కాకపోతే, యిలాంటి చెత్తకవులు కొంతమంది కూడబలుక్కొని, ఒకళ్ల గ్రంథాల నొకరు పొగడుకొంటూ, పత్రికలవాళ్లకు డబ్బిచ్చి పబ్లిసిటీ చేయించుకుంటూ, అప్పటికీ పబ్లిక్కులో ఆదరం పొందలేక, బాధపడే అధునిక కవులయొక్క కుకావ్యకర పూర్ణానర్థ కవిత్వాలకంటే నిరక్షరమై, అశబ్దమై, అవ్యాక్యమైన ఈతని ఆశుకవిత్వం ఎంతటి అర్థసమన్వితత్వాన్ని కనబరిచిందో మీ అందరకూ విదితమే—ఇతనియొక్క కవిత్వంలోని గొప్పతనం యిప్పుడు మీ కర్థంకాదు. యింటిదగ్గిర సావకాశంగా ఒక అరగంట ఆలోచించి దీన్ని అధునికకవిత్వంతో పోల్చిచూచినప్పుడే యిందులోని ఘనత కొద్దిగానైనా మీకు తేటపడుతుంది.

"నా జీవితమంతా కవితావిమర్శనలోనే గడిపిన నేను నాసమాజంలోని కవులకేగాక, మిగిలిన యువకకవులకు, బాలకవులకూ, స్త్రీకవులకు, వృద్ధకవులకు, నవ్యకవులకు, పద్యకవులకు, వ్యావహారిక కవులకు, పిల్లకవులకు—అందరకూ యిస్తే సలహా ఏమిటంటే, అతినూతనమైన యీకవితావిధానాన్ని వారూ అవలంబిస్తే, లోకం ఎంతో ముందుకు వచ్చి, సక్రమ మార్గంలో నడిచి, గొప్ప ఆశయాలను గ్రహించి, ఎంతో సుఖించగలదని.

"క్షమించండి—యిప్పటికే చాలా టైము అయిపోయింది. ఇంకా కవిత్వంనుండి గణితశాస్త్రము, చిత్రలేఖనము, గానకళ, మిగిలిన అఖిల శాస్త్రములు, అనంతకళలు ఏవిధంగా ఉద్భవించేదో చెప్పదామనుకొన్నాను. కాని, నాకు ఈ రాత్రే, మరో అరగంటపోయింతర్వాత ఇంకొక చిన్నపనుండడంవల్ల, మీ కొకప్పుడెప్పుడైనా, యింతటి సదవకాశం కలిగినప్పుడు మనవిచేసుకుంటాను. యీతనితో నా ఉపన్యాసం ఆఖరు. అందరూ చప్పట్లు కొట్టండి"

(అని తను చప్పట్లుకొడుతూ కూర్చుంటాడు)

# గుణగ విజయాదిత్యుని నాటి వర్తమానములు



— శ్రీ నేలటూరి వెంకటరమణయ్య —

ఇదివరలో ౧ పేర్కొనిన పూర్వ చాళుక్య శాసనము లందు చెప్పబడిన విషయములను క్రోడీకరించి చూడగా నీ క్రిందివిషయము లతని రాజ్యకాలమున నడచినవని వ్యక్తమగుచున్నది.

౧. గుణగవిజయాదిత్యుడు వేంగిదేశమును పాలించిన విజయాదిత్య నామధారులగు పూర్వచాళుక్యరాజులలో తృతీయుడు. ఇతడు కలివిష్ణువర్ధనమహారాజనబడు రాష్ట్రకూటవంశసంభూతుడగు నిరుపమభట్టారకుని కుమారికయగు శీలమహాదేవి, లేక శీలక్క యను భార్యయందు జనించిన పుత్రుడు. ఇతనికి విక్రమాదిత్య యుద్ధమల్ల నృపకాము లను తమ్ములు మగ్గురుండిరి. మరియు నితడు శూరుడు; పెక్కుబిరుదులు గలవాడు; ఇందు పరచక్రరామ, గుణగవల్లభ, త్రిపురమర్త్యమహేశ్వర యనునవి ముఖ్యమైనవి.

౨. పట్టాభిషిక్తుడైన ప్రథమవర్షంబున గుణగవిజయాదిత్యుడు పండరంగనికి సేనాధిపత్యపట్టము నొసగి సామంతబలములతోగూడ నతని బోయకొట్టములపై దండంపెను; పండరంగు బోయకొట్టములు పండ్రెంటిని గొని, కట్టెపు దుర్గమును బొడిచి, కందుకూరును బెజవాడ గావించెను. త్రిపురమర్త్యమహేశ్వరుడే గాల్పబడిన త్రిపురములలో నొక్కటియగు నెల్లూరుపురమును, నతడీ దండయాత్రాసందర్భముననే తగులబెట్టియుండును.

౩. రట్టేశునిచే సంచోదితుడై యాతడు దండువెడలి పోయి యుత్తరగంగమండలము నాక్రమము గావించుకొనియుండిన గంగులను జయించెను. నొలంబ రాష్ట్రాధిపతియైన మంగి శిరమును ఖండించెను. ఇతని భుజములను రాష్ట్రకూట చక్రవర్తి కృష్ణుడును ప్రతిదినము నభ్యర్చించెను.

౪. మరియు నితనిచే బంపబడినవాడై పండరంగడు దండువెడలి కన్నర (కృష్ణ) భూపతి నోడించి యుద్ధరంగమున నాతని వెన్నాడెను; అతనితో గూడియుండిన శంకిలునికి గర్వభంగము గావించెను; బద్దెగని కథయు ముగిసెను. కిరణపురము, డహాలనిరుకము, దలెనాడు, అచలపురము మున్నగు స్థలములలో నొప్పు; కిరణపురాచలపురములను పండరంగడు కాల్చిన దీయుద్ధయాత్రయందే. గంగాయమునా చన్ద్రాదిత్య పాలికేతనాది రాజచిహ్నములను గొనితెచ్చి నిజద్వారమున బ్రతిష్ఠాపించుకొనెను. అంతకుపూర్వము లేని సమధిగత పంచమహాశబ్దబిరుదము నీ సందర్భముననే వహించియుండును.

౫. శత్రులంపై నెత్తిరా నిర్వహించుకొనలేక తన మఱుగుసొచ్చిన చోళుని రక్షించెను.

౬. కాళింగగంగులయొద్ద ద్రవ్యమును, కోసలుల కడ ఏనుగులను, పాండ్యపల్లవుల యొద్దనుండి హేమమును గ్రహించెను. పాండ్యపల్లవుల కడ గుణగుడు హేమము గొన్నది బోయకొట్టములపై పండరంగ డెత్తిపోయి నప్పుడేయని తోచుచున్నది.

---

౧. చూడుడు, భారతి. ౨౩ వ సంపుటము ౧౦ వ సంచిక, పుటలు ౩౬౮-౩౮౨.

ఇవి గుణగవిజయాదిత్యుని రాజ్యకాలమున నడచిన విశేషచరిత్రాంశములు. వీని యందొక్కొక విషయమును గూర్చి కొంత చెప్పవలసియున్నది.

(౧) ముందట విచారింపదగినది యాతని తల్లిదండ్రుల పూర్వోత్తరము. తండ్రినిగూర్చి పేర్కొనదగిన విశేషచరిత్రాంశములు లేవు; అతని పేరు కలివిష్ణువర్ధనుడు; కుబ్జవిష్ణువర్ధనుని సంతతిలో ప్రఖ్యాతుడైన నరేంద్రమృగరాజాపరనామధేయుడగు నిమ్మడి విజయాదిత్యుని పుత్రుడు. నరేంద్రమృగరాజు అస్తంగతుడైనతరువాత నొక సంవత్సరకాల మతడు వేంగి నేలెను.

అతనితల్లి రాష్ట్రకూటులయింటి యాడుబడుచు;౨ ఆమెపేరన్ని శాసనములలోను శీలమహాదేవి యని యున్నను, నొక్కచోటమాత్రము శీలక్క యని యున్నది. ఈమె రాష్ట్రకూటాధిపతియగు నింద్రభట్టారకుని కుమార్తె యట. ౩ ఇది చక్కగ పాటింపదగిన యంశము. శీలమహాదేవి పుట్టిన రాష్ట్రకూటవంశము క్రీ. శ. ౮-౧౦ లయందు సకలదక్షిణాపథముమీదను సార్వభౌమత్వమును వహించి కీర్తినందిన ప్రఖ్యాతరాష్ట్రకూటవంశముగాని యన్యముగాదు. అయితేని, శీలమహాదేవి జనకుడగు ఇంద్రభట్టారకు డెవ్వరో కనుగొనవలసియున్నది. అతడు గుణగవిజయాదిత్యుని తండ్రియగు కలివిష్ణువర్ధనునితో, లేక అతని తండ్రియగు నరేంద్రమృగరాజ విజయాదిత్యునితో, సమకాలికుడని నిశ్చయముగ జెప్పవచ్చును. ఏలన, వీరిలో మొదటివానికి ఇంద్రభట్టారకుడు పిల్లనిచ్చిన మామ; రెండవవానికి వియ్యంకుడు. గుణగవిజయాదిత్యునకు శకాబ్దము ౮౧౪ అనగా క్రీ. శ. ౮౯౨ న గద్దెయెక్కిన మొదటిచాళుక్యభీమునికి పూర్వము నలువదినాలుగేండ్లు రాజ్యపరిపాలన మొనర్చినట్లు చాళుక్యశాసనములయందు చెప్పియున్నది. ౪ ఇందువల్ల గుణగవిజయాదిత్యుడు క్రీ. శ. ౮౪౮ మొదలు ౮౯౨ వఱకు రాజ్యమొనర్చెనని తెల్లమగుచున్నది. ఇతనికి పూర్వమితని తండ్రి కలివిష్ణువర్ధనుడొకయేడు, అనగా క్రీ. శ. ౮౪౬ మొదలు ౮౪౮ వఱకు ప్రజాపాలన మొనర్చెను; కలివిష్ణువర్ధనునికి పూర్వమతని తండ్రి నరేంద్రమృగరాజొక నలువదినాలుగేండ్లు, అనగా క్రీ. శ. ౮౦౩ మొదలు ౮౪౬ వఱకు రాజ్యము సల్పెను. శీలమహాదేవి జనకుడగు రాష్ట్రకూటాధిపతి ఇంద్రభట్టారకుడు క్రీ. శ. ౯ శతాబ్దముయొక్క పూర్వార్ధమున వెలసెననియు, క్రీ. శ. ౮౦౩ మొదలు ౮౪౬ వఱకును వేంగి నేలిన నరేంద్రమృగరాజుతో, కలివిష్ణువర్ధనునితో సమకాలికుడనియు దృఢముగ జెప్పవచ్చును.

ఇక్కాలమున రాష్ట్రకూట సామ్రాజ్యమును పాలించుచుండినవారు జగత్తుంగ ప్రభూతవర్ష శ్రీవల్లభాది బిరుదాంకితుడగు ముమ్మడి గోవిందచక్రవర్తియు, నతని కుమారుడగు నృపతుంగాపరనామధేయుడగు మొదటి యమోఘవర్షుడును. కావున శీలమహాదేవి తండ్రియగు రాష్ట్రకూటాధిపతి ఇంద్రరాజు రాష్ట్రకూట చక్రవర్తి కాడనుట నిశ్చయము. మఱి యాతడెవ్వరో కనుగొనుటకు సాధ్యమగునేమో చూతము. రాష్ట్రకూట వంశశాఖ యొకటి క్రీ. శ. ౮౦౦ ప్రాంతమునుండి ౮౮౬ వ సంవత్సరము వఱకును లాటదేశముపై రాజ్యము సల్పెను. దీనికి చరిత్రకారులు గుజరాతుశాఖయని నామకరణము చేసియున్నారు. ఈ శాఖకు జెందిన రాజుల శాసనములు పెక్కు ప్రకటితములై యున్నవి; వీనివల్ల గుజరాతు రాష్ట్రకూటవంశమునకు ముమ్మడిగోవింద చక్రవర్తి కనుజన్ముడగు ఇంద్రరాజు మూలపురుషుడని తెలియవచ్చుచున్నది. ఇతడన్నగారియెడ భక్తిపరుడై యతని కార్యములకును యుద్ధములకును గర్తయై యనేకసమరముల యందుపాల్గొని యతని ఆదరమునకు పాత్రుడాయెను. ఇంద్రరాజొనర్చిన సామ్రాజ్యసేవకు దృప్తిచెంది యతని లాటరాజ్యమునకు క్రీ. శ. ౮౦౦ ల ప్రాంతమున బట్టాభిషిక్తుని గావించెను. ఇట్లన్నగారి ప్రసాదమువల్ల లబ్ధమైనరాజ్యమును క్రీ. శ. ౮౧౦ వఱకును పాలించి యతడు దేహమును చాలించెనని తోచుచున్నది. ఈ యింద్రరాజే

---

౨ Cf. No. 5 of 1911-12

౩. ఆ. సా. ప. ప. సం. ౧ పుటలు ౧౪౦-౫౦

౪. అన్యువల్ రిపోర్ట్ ఆఫ్ ఎపిగ్రఫీ, ౧౯౧౪, పారా.

౫ ఇండియన్ ఆంటిక్వెరీ. సం. ౧౨, పుటలు ౧౫౬ తిరువాయి-ఇంద్రరాజుకుమారుడగు కర్కరాజసువర్ణవర్షుడు క్రీ. శ ౮౧౨ లో రాజ్యము సల్పుచుండినట్లతని బరోడాపట్టికలవల్ల విదితమగుచున్నది. కావున నింద్రరాజు తత్పూర్వము మృతినందెననుట నిశ్చయము.

శీలమహాదేవితండ్రి. ఇట్లని తలచుటకు సామసావ్య మును, కాలానుగుణ్యతయును మాత్రమే సాధనము లనుకొనరాదు. పూర్వచాళుక్యరాష్ట్రకూట రాజకుటుంబములకు ప్రాతచుట్టరికము గలదు. జత్తైవపట్టికలయం దీచుట్టరిక మిట్లు వర్ణింపబడియున్నది:

"తస్య పరమభట్టారక మహారాజాధిరాజ పరమేశ్వర శ్రీమదకాలవర్ష పాదానుధ్యాత పరమ భట్టారక మహారాజాధిరాజ పరమేశ్వర శ్రీధారావర్ష శ్రీ ధ్రువరాజదేవస్య మహాదేవీ సర్వలోకాశ్రయ శ్రీవిష్ణువర్ధన శ్రీవిట్టరసరాజదుహితా పరమేశ్వరీ పరమభట్టారికా శ్రీ శీలమహాదేవీ." ౬

ఇంగువల్ల రాష్ట్రకూటచక్రవర్తియగు అకాలవర్ష (కృష్ణు)ని పుత్రుడగు ధారావర్ష ధ్రువుడు పూర్వచాళుక్య వంశజుడగు విష్ణువర్ధనుని సంతతికి జెందిన విట్టరసరాజు పుత్రికయగు శీలమహాదేవిని పెండ్లియాడెనని తెలియవచ్చుచున్నది. ధ్రువుడు ముమ్మడిగోవింద ఇంద్రరాజుల తండ్రి. ఇతడు క్రీ. శ. ౭౮౦ మొదలు ౭౯౩ వఱకును రాజ్యమునన గ్పుడు. ఇతనికి గూతునిచ్చి యుద్వాహము జేసిన విట్టరసరాజును నప్పటివాడనుటకు సందియము లేదుకదా. కావుననే జత్తైవపట్టికలను బరిష్కరించి ప్రకటించిన భండార్కరు పండితు డితడు పూర్వచాళుక్యరాజగు చతుర్థ విష్ణువర్ధనుడని గుర్తించెను. ఈ నిర్ధారణ సమంజసముగనే యున్నది. జత్తైవపట్టికలలో నుక్తమైన పూర్వచాళుక్యరాష్ట్రకూట రాజకుటుంబముల యన్యోన్యసంబంధ మీక్రింది రీతిని వివరింపవచ్చును.



అకాలవర్ష(కృష్ణ)డు — విష్ణువర్ధనుడు

విట్టరసరాజు (చతుర్థవిష్ణువర్ధనుడు)

ధారావర్ష ధ్రువుడు = భార్య శీలమహాదేవి.

ధారావర్ష ధ్రువునికి ముమ్మడిగోవిందరాజు ఇంద్రరాజు అను పుత్రు లిరువురు పుట్టిరి. వీరు శీలమహాదేవి గర్భమున బుట్టిరో, లేక యన్యపత్నియందు జనించిరో నిశ్చయించి చెప్పుటకు వీలులేదు; కాని వీరిలో నింద్రరాజు శీలమహాదేవిపుత్రుడే యని యూహించుట కవకాశము కలదు. కలివిష్ణువర్ధనుని ధర్మపత్నియు, గుణగ విజయాదిత్యుని తల్లియు నగు శీలమహాదేవి రాష్ట్రకూటాధిపతియగు ఇంద్రభట్టారకుని కూతురని పైజెప్పియున్నదికదా. ఈ యిరువురు శీలమహాదేవులకును నెద్దియేనియు సంబంధము కలదా? ఒక శీలమహాదేవికి రాష్ట్రకూటుల గృహము పెట్టినిల్లు; మఱియొక శీలమహాదేవి కది పుట్టినిల్లు; ఒక శీలమహాదేవికి ఇంద్రరాజను పుత్రుడు (కాదేని సవతిపుత్రుడు) గలడు; మఱియొక శీలమహాదేవితండ్రిపేరు ఇంద్రభట్టారకుడు. ఒక శీలమహాదేవి క్రీ. శ. ౮వ శతాబ్దాంతమున వెలసెను; మఱియొక శీలమహాదేవి తరువాత క్రీ. శ. ౯వ శతాబ్ద ద్వితీయ పాదాంతమున రాజ్యము నేలిన కలివిష్ణువర్ధనుని భార్య. హిందువులలో తాత పేరు మనుమనికిని, అవ్వ పేరు మనుమరాలికిని బెట్టు నాచార మనాదిసిద్ధముగ వచ్చుచుండుటచేతను, నీరెండవ శీలమహాదేవితండ్రియగు నింద్రభట్టారకుడును, ధారావర్ష ధ్రువమహారాజు కడగొట్టు కొడుకు ఇంద్రరాజును నించుమించుగ సమకాలికులగుటచేతను వారిరువురును నొక్కరే యనియు, నీ యింద్రరాజు తన తల్లి పేరో, లేక మాఱుదల్లి పేరో యగు మొదటి శీలమహాదేవి పేర తన కుమార్తెకు పెట్టెననియు నూహించుట కవకాశము గలదు. ఈ యూహ యసమంజసము గాదేని రాష్ట్రకూట పూర్వచాళుక్యవంశముల బాంధవ్యము తరతరములుగ పెరుగుచుండెనని తేలును. ఈ రెండురాజకుటుంబముల పరస్పరసంబంధము నీక్రింది పటముగ గనపఱచవచ్చును. (చూ: ప్రక్కపుటలోని వంశవృక్షము)

(౨) తరువాత పరామర్శింపదగినది బోయకొట్టములపై దండయాత్ర:—గుణగవిజయాదిత్యుని కాలమున నడచిన ప్రథమచరిత్రాంశ మిది. ఈ దండయాత్రను గూర్చిన మద్దంకిశిలాశాసనమున—

'పట్టంబుగట్టిన ప్రథమంబునేడు
బలగర్వ మొప్పంగ బైలేచి సేన
పట్టంబుగట్టించి ప్రభుపండరంగు
బంచిన......'

౬. ఎపీగ్రాఫియా ఇండికా. సం. ౨౨ పుటలు ౯౮ తరువాత.

కోట్టమనగా పాలనా సౌకర్యార్థమునకుగాను చేయబడిన దేశవిభాగమును దెల్పునని వందీశాభిప్రాయము. ఇది యరవమునుండి యెరవుతెచ్చుకొన్న మాట. అరవములో కోట్ట మనగా దేశవిభాగమని యర్థము. పల్లవుల రాజ్యాంగవిధానమున వారి యేలుబడికి లోబడిన దేశ మంతయు పాలనాసౌకర్యమునకై కోట్టములు, నాడులు, రాష్ట్రములుగ విభజింపబడియుండెను. పెక్కు కోట్టములు చేరిన ఒక నాడు అగును. ఇట్లే పెక్కు నాడుల సమ్మేళన మొక రాష్ట్రముగ పరిగణింపబడు చుండెను. నెల్లూరు మండలము పల్లవుల యధికారము సంపూర్ణముగ నశించిపోవువఱకును వారి యేలుబడిక్రింద నుండెను. క్రీ. శ. ౯వ శతాబ్దమున తొండమండలమున రాజ్యముచేసిన పల్లవ విజయకంపవర్మ శాసనమొకదానిని గూడూరు తాలూకాలోని మల్లం గ్రామమున నిటీవల శాసనశాఖవారు కనుగొనిరి. కావున పండరంగని శాసనములలోని కోట్టములు పల్లవరాజ్యమునకు జెందిన రాష్ట్రవిభాగములనుట యొప్పును౧౧(క). బోయల కునికిపట్టు లగుటచేత నీకోట్టములు బోయకోట్టము లనబడెను.

గుణగవిజయాదిత్యుడు వేంగిసింహాసనము నధిష్ఠించినప్పుడు పల్లవరాజ్యమును తెల్లాఱెరిన్దనంది యను నామాంతరము గల మూమ్మడినందివర్మ యేలు చుండెను. ఇతని కాలమున, సంతతపూర్వము పల్లవులకు గప్పము కట్టుచుండిన పాండ్యరాజులు ప్రబలులై తిరుగబాటుచేసి తొండమండలపర్యంతము గల పల్లవ రాష్ట్రము నాక్రమించుకొని తొండిమండలమును బ్రవేశించి దేశసంక్షోభము గావించిరి. అదియే తరి యని వేంగిపూర్వచాళుక్యులు దక్షిణాంధ్రమును పల్లవుల నుండి స్వాధీనపఱచుకొనుటకు బ్రయత్నములు సలుపగా, పల్లవులయెడ విశ్వాసము గల బోయలు వీరికి మాఱొడ్డినట్లు దోచుచున్నది. తత్కారణమున గుణగ విజయుడు వీరిపై దండువెట్టవలసివచ్చెను.

దండయాత్రయందు నడచిన యంశములు కొన్ని శాసనములవల్ల దెలియవచ్చుచున్నవి. సామంతసైన్యముతో బయలువెడలిపోయి పండరంగడు బోయకోట్టములను పండ్రెండింటిని స్వాధీనపఱచుకొని వేంగిరాజ్యమును విస్తరింపజేసెననియు, కట్టెపుదుర్గమును బయలు సేసి యనగా నేలమట్టము గావించి కందుకూరును బెజవాడగ జేసెననియు నద్దంకిశాసనము దెల్పుచున్నది. కట్టెపుదుర్గ మెచ్చటిదో నిశ్చయించి చెప్పుటకు వీలు లేకపోయినను శ్రీ సోమశేఖరశర్మగారు చెప్పినట్లది బోయకోట్టములకు జెందినదే౧౨. కావున నదియు నెల్లూరుమండలాంతర్గతమని తలచుట సమంజసము. మఱియు, ప్రథమచాళుక్యభీముని యత్తిలితామ్రశాసనమున పండరంగడు నెల్లూరుపురమును దగులబెట్టె నని చెప్పియున్నది౧౩. నెల్లూరుపురదహనము సైతము బోయకోట్టములపై నడపిన దాడియందే నడచియుండ వలయును. ఈ దండయాత్రయందు పూర్వచాళుక్య సైన్యము నెల్లూరు దక్షిణ పరిహద్దువఱకు గల రాష్ట్రమును జయించి స్వాధీనపఱచుకొనెనని తోచు చున్నది౧౪. స్వాధీనపఱచుకొన్న దేశమున దన యధి

---

౧౧. క. కోట్టమును గూర్చి శేష శర్మగారితో నిటీవల చర్చించితిని. వారు చెప్పు సమాధానము సమంజసముగనే యున్నది. పూర్వము దేశ సంరక్షణార్థమై యాయచోట్ల నుండు కోటలను నిర్మించెడివారు. ఒక్కొక్క కోటకు చుట్టుపట్టు ప్రదేశముల పరిపాలనయు నా కోటనుండియే నడచెడిది. కావున కోటయే పరిపాలనాధికారులు కార్యమును నిర్వహించు ప్రధాన స్థలమాయెను. ఈ కారణముననే యరవమున 'కోట్ట' మన పాలనాసౌకర్యార్థమేర్పరించిన దేశ విభాగము నర్థము గలిగినది. కావున కోట్ట మనిన కోటయని యర్థము చేసికొనుట యుక్తమే.

౧౨. భారతి. సం. ౫. పుట ౪౮౩.

౧౩. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక సం. ౧౧. పుట ౨౪౧.

౧౪. ఈ సందర్భమున గమనింపదగిన విషయ మొకటి గలదు. నెల్లూరుజిల్లా గూడూరుతాలూకా దక్షిణపు కొనయందు శ్రీహరికోటకు గొంచె ముత్తరమున సముద్రతీరమున పండ్రంగ మను నొక గ్రామము గలదు. ఇచ్చట పండరంగేశ్వరుని దేవాలయము గలదు. ఇది కడుప్రాచీనగ్రామమనుటకు దేవాలయములోని చోళశాసనములే సాక్షి. ఈ దేవాలయము పండరంగ ప్రతిష్ఠ కావచ్చును. ఇది యసంభావ్యము గాదేని, పండరంగని విజయయాత్ర శ్రీహరికోటవఱకును సాగిన దని యెంచవచ్చును.

కారమును సుస్థిరముగ నెలకొల్పుటకై గుణగవిజయాదిత్యుడు పండరంగని దాని కధిపతిగ జేసి యచటనే నిల్పెను. పండరంగడు కందుకూరిని తనకు రాజధానిగ జేసికొని యీప్రాంతీయమండలి రాజ్యము నేల నారంభించెను. కావుననే యద్దంకిశాసనమున 'కన్దుకూర్బెజవాడ గావిత్పు మెచ్చి' అని చెప్పినది. పండరంగని సంతతివారు నెల్లూరుమండలమునందే యుండినట్లు మల్లియంపూండి మొదలగు శాసనములచే దెలియవచ్చుచుండుటచేత పైయూహ సరియైనది యని తలచుచున్నాను౧౫.

(౨) క. ధర్మవర శిలాశాసనమునందు, గుణగవిజయాదిత్యుని పంపున పండరంగడు బోయలను జయించిన పిమ్మట రాహణుని జయించినట్లు చెప్పబడియున్నది. శాసనోక్తరీతిని బట్టిచూడగా నీరాహణు డెవ్వడో కొంత ప్రఖ్యాతిని బొందిన ప్రభువైనట్లు తోచుచున్నది; కాని యతనిని గాని యతనిచే యేలబడి క్రింది దేశమునుగాని గుర్తించుటకు సాధ్యము గాక యున్నది. కొన్ని శాసనములయందు గుణగవిజయాదిత్యుడు పల్లవుల నుండియు పాండ్యులనుండియు హేమమును గొనినట్లు చెప్పబడియున్నది. కంచి పల్లవరాజులకు బోయకొట్టములతో సంబంధముండుటచేత పండరంగడు బోయకొట్టములపై దాడివెడలినపుడే పల్లవులను వారికి దక్షిణమునందుండు పాండ్యుల నోడించి హేమము గొనియుండునని తోచుచున్నది.

(౩) పాశ్చాత్యగంగరాజులపైదాడి:-గంగరాజులపై గుణగవిజయాదిత్యుని దాడి పెక్కు పూర్వచాళుక్య శాసనములందు ప్రశంసింపబడియున్నది. వీనియందు అమ్మరాజవిజయాదిత్యుని ఈడేరుశాసనము ముఖ్యమైనది. ఇతర పూర్వచాళుక్యశాసనములం దితడు గంగకూటనివాసులను, గంగులను జయించి మంగిరాజు శిరఃఖండనము గావించె ననిమాత్రము గలదు; ఇందు వానితో గూడ మఱికొన్ని విశేషాంశములు చేర్పబడియున్నవి.

"గంగానంగజకైరవకీర్తిరసతూరా
రట్టేశసంతోషతో
జిత్వా మంగిశిరోహరత్ యుధి మహో
బాహ్యస్తతిర్యాన్యరక్షితః.
కృష్ణం సంకిలి మంకితాఖిలబల
ప్రాప్తోరుసద్విగ్రహో
భీతార్తాచ విధాయ తత్పుర మసం
రోషా నిర్దదాహ ప్రభుః."౧౬

రట్టేశునిచే సాక్షాత్పింపబడి (పురికొల్పబడినవాడై) గుణగవిజయాదిత్యుడు గంగులను జయించెననియు, యుద్ధమున మంగిశిరమును హరించెననియు, భీతార్తులైన కృష్ణసంకిలుని పట్టణమును దహించెననియు నిందలి భావము.

మఱి, గుణగవిజయాదిత్యుని గంగులపై కంపిన రట్టేశు డెవ్వడో కనుగొనవలసియున్నది. గుణగవిజయాదిత్యుడు క్రీ. శ. ౮౪౪ మొదలు ౮౮౮ వఱకు రాజ్యపరిపాలనము గావించెనని పైజెప్పియున్నది కదా. ఈకాలమున రట్టరాజ్యముపై నిరువురు రాజులు ప్రభుత్వము సల్పిరి. వీరియం దొకడు నృపతుంగాపరనామధేయుడగు ప్రథమామోఘవర్ష చక్రవర్తి. క్రీ. శ. ౮౧౫ మొదలు ౮౭౭ వఱకు నితడు అఱువదిరెండేండ్లు ప్రజాపాలనము గావించెను. తరువాత నితని పుత్రుడగు నిమ్మడికృష్ణవరవతి క్రీ. శ. ౮౭౭వ సంవత్సరమున సామ్రాజ్యాభిషిక్తుడై క్రీ. శ. ౯౧౪ వఱకును ప్రభుత్వము సల్పెను. దీనినిబట్టి ప్రథమామోఘవర్షుడును నిమ్మడి కృష్ణుడును గుణగవిజయాదిత్యుని సమకాలికులగు రాష్ట్రకూటచక్రవర్తులని తేలుచున్నది. ఇక వీరిద్దఱిలో గుణగవిజయాదిత్యుని గంగులపై కంపినాత డెవ్వడు? రట్టేశుడు పంపగా నితడేల గంగులపై దాడి వెడలెను? అను ప్రశ్నలకు సమాధానము చెప్పవలసియున్నది. ఈడేరుశాసనమును బరిష్కరించు సందర్భమున డాక్టర్ హుల్ట్షుగారు పైనుదహరింపబడిన శ్లోకములో జేర్పబడిన కృష్ణుడు రాష్ట్రకూటచక్రవర్తియగు నిమ్మడి కృష్ణుడని గుర్తించి యతడే గుణగవిజయాదిత్యుని కయ్యమునకు బిలిచి గంగరాజ్యమునకు రప్పించెనని చెప్పియున్నారు౧౭. కాని వీరి యభిప్రాయ మంగీకార్యము

---

౧౫. ఎపిగ్రాఫియా ఇండికా. సం. ౯. పుట ౪౭.

౧౬. సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్. సం. ౧. పుట ౩౯.

౧౭. సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్. సం. ౧. పుట ౩౯.

గాదు. ఏలనగా, మొదట 'రట్టేశసంచోదితః' అను మాటలలోని 'సంచోదితః' అను మాటకు 'ఛాలెంజ్‌డ్' అని వీరు చేసిన యాంగ్లానువాదము సరియైనది కాదు. 'ఛాలెంజ్‌డ్' అనుమాట కీపట్టున 'యుద్ధమునకుజీరి' అని యర్థము చెప్పుకొనవలసియున్నది. 'సంచోదితః' అనుమాటకీ యర్థమెప్పుటను లేదు. దీనికి 'ఆజ్ఞాపింపబడి, లేక పురికొల్పబడి' యనియే యర్థము చెప్పవలసియున్నది; కావున రట్టేశునిచే నాజ్ఞాపింపబడియుండెనో పురికొల్పబడియుండెనో గుణగవిజయాదిత్యుడు గాంగుల మీదికి దాడివెడలినచో నతడు రట్టేశునికి లోబడి యతని యాజ్ఞచొప్పున ప్రవర్తించిన ప్రభువని చెప్పవచ్చునే కాని స్వతంత్రుడును, వైరియు నని చెప్పుటకు వీలు కాదు. ఈ యభిప్రాయము సరియైనచో గుణగవిజయాదిత్యుని కోపాటించి యతడు నిజపురము చేర్చుచుండ జేయునది లేక, మిన్నకయుండిన దాయ యగు కృష్ణుడతని దవదిత్తాంసారము నడిపించిన రట్టేశు డెట్లగును ? గుణగవిజయాదిత్యుడు మొదట కృష్ణుని యధికారమునకు లొంగి సామంతుడైయుండి తదనంతర మతనితో ప్రతిఘటించి, యోడించి, యతని పట్టణమును గాల్చియుండరాదా ? యను ప్రశ్న మొకటి రావచ్చును. ఇది సంగతము కావచ్చును. కాని, కృష్ణునికి గుణగవిజయాదిత్యుడు లొంగి యతని యాజ్ఞానువర్తియైయుండెననుట కాధార మేమియు గానరాదు. మఱియు నొక్కశ్లోకము నందే రట్టేశుని, కృష్ణుని ప్రత్యేకముగ చేర్కొని యుండుటచే వారిరువురు నొక్కరని చెప్పుటకంటె భిన్నులని యెంచుట యుక్తమని తోచుచున్నది.

గంగుల మీదికి గుణగవిజయాదిత్యుడు నంపిన రట్టేశుడిమ్మడికృష్ణుడు కాని పక్షమున నీక నతడు ప్రథమామోఘవర్షుడైయుండవలయును. అట్లని చెప్పుటకమోఘవర్షుని శాసనములు గూడ కొంతవరకు తోడ్పడుచున్నవి. క్రీ. శ. ౮౬౬ సంవత్సరము నాటి సిర్గుండశిలాశాసనమున నమోఘవర్షుని అర్చించిన రాజులలో వేంగీశ్వరు డొక్కడని చెప్పియున్నది.౧౮ మఱియు, క్రీ. శ. ౮౭౧ నాటి సంజాన్ తామ్రపట్టికలలో వేంగినాథు డమోఘవర్షుని వాహ్యాళిభూమిని పెంటపోతమ్ము కాలిగూడ లేని వెట్టి యొనర్చెనని యున్నది౧౯. తరువాతి రాష్ట్రకూటరాజుల శాసనములందు పూర్వచాళుక్యుల నమోఘవర్షుడు వింగవల్లిరణక్షేత్రమున నిర్జించెనని యున్నది౨౦. కావున నరేంద్రమృగరాజు కాలమున పూర్వచాళుక్యులచే నాక్రమింపబడిన నిజరాజ్యమును మరల స్వాధీనపఱచుకొని వారి నమోఘవర్షుడు వింగవల్లి యుద్ధరంగమున నోడించెనని నిశ్చయముగు చున్నది.

అమోఘవర్షునిచే బరాజితుడై యతని గొల్చిన పూర్వ చాళుక్యరా జెవ్వరో స్పష్టముగా దెలియదు. ఈ విషయమున నభిప్రాయభేదము కొంత కానవచ్చుచున్నది. డాక్టరు డి. ఆర్. భండార్కరిగారు నరేంద్రమృగరాజవిజయాదిత్యు డగు ననిరి౨౧. కాని వీరి యభిప్రాయము సరియైనదని నమ్ముటకు వీలులేదు. ఏలనగా, వీరమోఘవర్షునికి సమకాలికుడైన పూర్వచాళుక్యరాజు నరేంద్రమృగరా జొక్కడే యని తలచి యట్లు వ్రాసిరి. కాని యమోఘవర్షునికి సమకాలికులగు పూర్వచాళుక్యరాజులు నరేంద్రమృగరాజు గాక మఱి యిరువురు గలరు. కలివిష్ణువర్ధనుడును, గుణగవిజయాదిత్యుడును గూడ నతనికి సమకాలికులే. కావున భండార్కరుగారి యభిప్రాయము సరియైనదని దృఢముగ జెప్పుటకు వలనుపడదు. రాష్ట్రకూటచరిత్రకారులగు డాక్టర్ ఎ. ఎస్. ఆల్టెకారు అమోఘవర్షునిచే బరాజయము నందినవాడు గుణగవిజయాదిత్యుడని నిశ్చయించిరి. పూర్వచాళుక్యుల ప్రస్తావ మమోఘవర్షుని శాసనములలో క్రీ. శ. ౮౬౬ నాటి సిరూరుశిలాశాసనముననే మొదట గానవచ్చుచున్నది. తత్పూర్వశాసనములయం దెచ్చుటను లేదు. కావున నమోఘవర్షుడు

---

౧౮. ఎపిగ్రాఫియా ఇండికా, సం ౬ పుట. ౧౦౩.

౧౯. ఎపిగ్రాఫియా ఇండికా, సం. ౧౮, పుట. ౨౪౬.

౨౦. జర్నల్ ఆఫ్ ది బాంబే బ్రాంచ్ ఆఫ్ ది రాయల్ ఏషియాటిక్ సొసైటీ. సం. ౧౮. పుటలు ౨౬౫-౬౯; ఎపిగ్రాఫియా ఇండికా. సం. ౩. పుటలు ౩౪-౫; ఇండియన్ ఆంటిక్వెరి. సం ౧౨. పుట.

౨౧. ఎపిగ్రాఫియా ఇండికా. సం. ౯. పుట.

వేంగిచాళుక్యులను జయించినది క్రీ. శ. ౭౬౯ ప్రాంతమున ననియును, నప్పుడు వేంగి నేలుచుండిన రాజు గుణగవిజయాదిత్యు డగుటచే, నతడే యమోఘవర్షునిచే నిర్జింపబడి యతని సేవించిన వేంగీశ్వరు డనియును దీర్మానమును గావించిరి౨౨. లబ్ధమైన యాధారముల నన్నిటిని సమీకరించి చూడగా డాక్టర్ అల్టెకారుగారి యభిప్రాయము యుక్తముగనే కన్పట్టుచున్నది. కావున, వీరి యభిప్రాయమును బూర్వపక్షము సేయజాలిన శక్తి లేకపాత్యము బహుళ్యమువలన నిదియే సరియైనదని మన మంగీకరించవచ్చును.

గుణగవిజయాదిత్యుని కిది రాష్ట్రకూటులతోనైన తొలిపోరాటము; దీనికి రాష్ట్రకూట పూర్వచాళుక్య వంశపు రాజులకు బరంపరగ వచ్చుచుండిన వైరమే ముఖ్యకారణము. నరేంద్రమృగరాజు కాలమునుండియు బూర్వచాళుక్యుల ప్రతాపము మధ్యందినమార్తాండుని వలె దుర్నిరీక్ష్యమై యసహ్యమై వెలుగొందజొచ్చెను. గుణగుడు రాజ్యాభిషిక్తుడైన మొదటియేడే పల్లవ రాజ్యముపై నెత్తిపోయి యంతటి యుత్తరసీమల నాక్రమించుకొనెను. పల్లవరాజగు మూడవ నందివర్మ యమోఘవర్షుని యల్లుడు. దీనికిదోడు గుణగవిజయాదిత్యుడు రాష్ట్రకూటుల యేలుబడియందుండిన పశ్చిమాంధ్ర దేశముపై నెత్తిపోయి కొన్నిస్థలములను పాడుగావించెనని మున్నికి ఇంద్రరాజు బగుమ్రా శాసనమువల్ల దెలియవచ్చుచున్నది. అందు—

'సమారోపితశ్రీ స్తంభాన్ దండేనాసీత్కణ్టకః
యోऽదహద్ ద్వేషిణః క్షుణ్ణచలుక్యాన్ చణకా నివ'

అను శ్లోకమున నమోఘవర్షుని దండోపాయముచే సమూలముగ పెకలింపబడిన కాడ (స్తంభము)గల శ్రీలను చండచాళుక్యులను, శనగచెట్లను పోలినవారు దండమునకు దగిల్చితెచ్చిన కంటకములను బోలి దహించెనని యున్నది. ఈ శ్లోకమున శ్లేష కలదు. ఉత్తరార్ధములోని 'స్తంభాన్' అను పదమును ముఖ్యముగ గమనించవలయును. దీనికి రెం డర్థములను జెప్పవచ్చును; శనగమొక్కల పరమున కాడలనియు, చాళుక్యుల పరమున 'స్తంభపుర' మనియు నర్థము జెప్పవచ్చును. ఇందు శ్లేష యున్నదని మొదట గ్రహించి రెం డర్థములను విశదము చేసినవారగు డాక్టరు భండార్కరుగారు ఈ స్తంభపురము బంగాళదేశాంతర్గత మగు మిథునపురమందలి 'తాంలూ' కనబడు ప్రాచీన తామ్రలిప్తమని గుర్తించిరి౨౩. కాని వీరి స్థలనిర్ధారణ యంగీకరించదగినది కాదు. ఏలనగా, బంగాళము నీ కాలమున పాలరాజుల యధికారముక్రింద నుండినది; పూర్వచాళుక్యులు బంగాళముపై దండెత్తిపోయినట్లు గాని, పాలరాజులతో యుద్ధము చేసినట్లుగాని తెలిపెడి యాధారము లెవ్వియు లేవు. 'స్తంభపుర' మనునది వేంగి రాష్ట్రకూట రాజ్యములలో నెచ్చటనో యుండవలయును. ప్రస్తుత కర్నూలుమండలములోని 'కంబము' కావచ్చును. ఈ స్థలనిర్ధారణ యొప్పదగినదేని గుణగవిజయాదిత్యుడు రాష్ట్రకూటరాజ్యముపై నెత్తిపోయి కంబమును నాశముగావించెనని చెప్పవచ్చును. దీనికి తరువాత వింగవల్లి యుద్ధము. ఈ యుద్ధమును గూర్చిన వివర మేమియు మనకు తెలియదు; కాని యొక్క సంగతిని నిశ్చయించి చెప్పవచ్చును. గుణగవిజయాదిత్యుడు యుద్ధమున సంపూర్ణముగ బరాజితుడై యమోఘవర్షుని కరిగాపై యాతని సార్వభౌమత్వము నంగీకరించవలసివచ్చెను. ఏతత్కారణముననే రట్టేశసంచోదితుడై గాంగులపై దండువెడలినది.

గుణగవిజయాదిత్యుని దండయాత్రకు గురియైన గాంగులెవ్వరు? ఆకాలమున దక్షిణహిందూస్థానమున రాజ్యముసేయుచుండిన గంగనామాంకిత రాజకుటుంబములు రెండు కలవు. అందొకటి కర్ణాటకమున గంగవాడి నేలుచుండెను. దీనికి పాశ్చాత్యగంగవంశమని పేరు. తూర్పుసముద్రతీరమున మఱియొక గంగవంశము ప్రభుత్వమునెరపుచుండెను. దీనికి పూర్వగంగవంశమని పేరు. గుణగవిజయాదిత్యు డెత్తిపోయినది పశ్చిమగాంగులమీద.

'హత్వా భూరి నొళంబరాష్ట్ర నృపతిం
మంగిం మహాసంగరే

---

౨౨. రాష్ట్రకూటులు, వారికాలము. పుట ౬౫.

౨౩. ఎపిగ్రాఫియా ఇండికా. సం. ౯. పుట. ౨౬.

గంగా పాత్రీకృతగంగ కూట శిఖరా
న్నిర్జిత్య.........'

అను ఈ స్తేలు మఱియం పూడి శాసనముల శ్లోక పాదిద్వయమును విశదపఱచుచున్నది. నొడంబ రాష్ట్రము ముప్పదిరెండు వేల దేశము. అసలు పేరు 'నొలంబ' దేశమని. 'నొళంబ' 'నొసంబ' 'నొణంబ' యనునవి దీని రూపాంతరములు. ప్రస్తుత బళ్లారి యనంత పురమండలములలోని కొంతభాగమునకును, మైసూరు సంస్థానములోని కోలారు తుంకూరుమండలములందు కొంతభాగమునకును ప్రాచీనకాలమున నొళంబరాష్ట్ర మను పేరు చెల్లుచుండెను. కాంచీపురపల్లవవంశశాఖ యొక్కటి యిచట రాజ్యమునేలుచుండెను. వీరిని నొలంబులని, నొలంబపల్లవులని యాధునిక చరిత్రకారులు పేర్కొనుదురు. నొలంబులు పాశ్చాత్యగాంగులకు పొరుగువారగుటచే చిరకాలమునుండి వారికి గాఢమైన సంబంధమేర్పడినది. గుణగవిజయాదిత్యుని కాలమునందా రెండిండ్ల రాచవారు కొండొరులతో మైత్రి పాటించుచుండిరి. మఱియు నొలంబులు పాశ్చాత్యగాంగుల కాశ్రితులై కప్పము గట్టుచుండిరనుటకు గొంత యాధారము గలదు. కావున నొడంబరాష్ట్రాధిపతియగు

౨౮. ధ్రువరాజ నిరుపమకలివల్లభుని రాణియగు శీలమహాదేవియొక్క జైథంతామ్రపట్టికల (ఎపిగ్రాఫియా ఇండికా. సం. ౨౧. పుటలు ౯౮-౧౦౯)లోని ఇరువదినాల్గవ శ్లోకమునం దీయంశము సూచింపబడి యున్నది:

యోఽసౌ ప్రసాధితజగత్త్రితపారగర్వో
గంగౌఘసంతతినిరోధవివృద్ధకీర్తిః
ఆత్మీకృతోన్నతనృపాంకవిభూతి రుచ్చై
స్త్యక్తుం తతాన పరమేశ్వరతా మిహైకః.

ఈ శాసనము బరిశోధించిన డాక్టరు డి. ఆర్. భండార్కరుగారుగాని, శాసనాంతరమున గానవచ్చు నీశ్లోకముపై దీర్ఘవ్యాఖ్యానము గావించిన (ఎపిగ్రాఫియా ఇండికా. సం. ౨౧. పుటలు ౧౩౩-౪౩) డాక్టర్ ఎ. ఎస్. ఆల్టెకారుగారుగాని 'గంగౌ' యనునది యొక శక్తియొక్క నామమని గ్రహించక 'దుర్గ'యని యన్వయము చేసికొనిరి.

మంగి రణమరణమును, గాంగుల యోటమియు బూర్వ చాళుక్యశాసనములం దెల్లెడలను జెప్పబడియుండుట చేత గుణగవిజయాదిత్యుడు రట్టేశుని యాజ్ఞానుసార మెత్తిపోయినది పాశ్చాత్యగాంగులమీద నని నిశ్చయముగ జెప్పవచ్చును.

గాంగులకును రాష్ట్రకూటులతోడి వైరము బహుకాలమునుండి యభివృద్ధినందుచుండినది. రాష్ట్రకూటుల రాజ్యకాంక్షయే దీనికి ముఖ్యమైన కారణము. మొదటి యకాలవర్ష కృష్ణరాజు గంగవాడిని జయింప సమకట్టి సైన్యముతోడ దాడివెడలెను. పాశ్చాత్యగాంగ రాజగు శ్రీపురుష ముత్తరసుడు రట్టసైన్యముల నెదిర్చెను; కాని దైవదుర్విపాకముచే బరాజితుడాయెను. ఈ యుద్ధానంతరమున నొక వేళ నీతడు మరణించినను మరణించియుండ వచ్చును. కాని గంగవాడి రాష్ట్రకూటులకు స్వాధీనపడ లేదు; శ్రీపురుషుని పుత్రులు వారికి మాఱొడ్డిరి. ధ్రువ రాజనిరుపమకలివల్లభుడు రాజ్యాభిషిక్తుడైన పిమ్మట గంగవాడిపై మరల దండెత్తిపోయి శ్రీపురుషుని ప్రథమ పుత్రుడగు శివమారభూపతిని బరాజితునిజేసి బందీకృతుని గావించెను; కాని యతని యనుజుడగు దుగ్గరాజు రాష్ట్రకూటుల విజయము నోర్వజాలక శత్రువులతో బ్రతిఘటించి పోర నారంభించెను. దైవప్రాతికూల్యముచే నపజయమును బొందవలసివచ్చెను.౨౮

ధ్రువరాజుమరణానంతర మతని కుమారుడగు ముమ్మడి గోవిందరాజు శివమారభూపతిని బంధముక్తుని గావించి మరల నతని స్వదేశమున కంపెను. శివమారు నకు పారతంత్ర్యము నచ్చదాయె. నిజరాష్ట్రమును జేరిన వెంటనే యతడు రాష్ట్రకూటుల సామ్రాజ్యాధిపత్యము నంగీకరించక స్వతంత్రుడై రాజ్యవ్యవహారములను నడుప నారంభించెను. ఇందుకు కోపించి ముమ్మడిగోవింద రాజు గంగవాడిపై దండెత్తివచ్చి శివమారుని నిర్జించి మరల కారాగారమున బంధించెను. గోవిందరాజు రాజ్యమునేయుచున్నంతకాలమును గాంగులు మరల తలయెత్తలేదు. కాని యాతని యనంతరము రాజ్యాభిషిక్తుడైన ప్రథమామోఘవర్షుని బాల్యము నవకాశము చేసుకొని గాంగులు స్వతంత్రమును బ్రకటించిరి; కాని యమోఘవర్షుని పితృవ్యపుత్రుడును, లాటాధిపతియును

గుణగవిజయాదిత్యునికి మంగిపై విజయము సులభముగ చేకూడినది కాదు. మంగి శూరుడగుటచే బూర్వచాళుక్యులు కష్టపడి యతడు ఘోరాహవము గావించెను. పండరంగని తండ్రియైన కడియరాజు నిజప్రభువగు విజయాదిత్యునికి బాసటయై నిలిచి కయ్యము సేయుచు తన ప్రాణములను రణరంగమున నర్పించెనని తొణంగి శాసనమునందున్నది౨౯. కడియరాజు నిహతుడైనది గుణగవిజయాదిత్యుకు మంగి మొదలగు వారితో నొనర్చిన యుద్ధమునందే యని శాసనపరిశోధకశాఖవారి యభిప్రాయము౩౦. కాని, కడెయరాజు మృతి నందినది గుణగవిజయాదిత్యుని ప్రథమ రాజ్యవర్షమున బోయకొట్టములతోడి యుద్ధమునకు బూర్వమని శ్రీ సోమశేఖరశర్మగారు చెప్పుచున్నారు.

"విజయాదిత్యుని పరిపాలన ప్రారంభకాలము నందలి బోయయుద్ధములలోను, ఇతర శత్రువుల తిరుగుబాటులలోను అతనికి సహాయభూతుడైనవాడు కడెయరాజు అనునతడు. విజయాదిత్యమహీపతికి విశ్వాసపాత్రుడైన మిత్రసత్యుడై, పరమవిధేయుడైన భృత్యుడై, ఆలోచనలు చెప్పు మంత్రియై పేరుకెక్కినవాడు. తుట్టతుద కీతడీయుద్ధములలో విజయాదిత్యునికి బాసటగ నిలిచి తన శౌర్యపరాక్రమములం జూపి స్వామిహితమునకై జీవితసర్వస్వమును ధారవోసి రణరంగమున వీరశయనము నలంకరించెను.........విజయాదిత్యుడు తన పరిపాలనమున ప్రథమసంవత్సరమున పాండరంగనికి బట్టముకట్టినట్లు శాసనదృష్టాంతములవలన దెలియవచ్చుచుండుటచేత కడెయరాజు మరణానంతరమే పాండరంగనికి సర్వసైన్యాధిపత్యము లభించెనని...... యూహించుట సమంజసము". ౩౧

కాని పైసిద్ధాంతమునకు వ్యతిరేకములగు సంశయములు కొన్ని కలవు. గుణగవిజయాదిత్యుని ప్రథమరాజ్యవర్షమున నడచిన బోయయుద్ధమునకు ముందే కడెయరాజు మడిసెననికదా శర్మగారనుచున్నారు. ఇంతకు పూర్వము గుణగవిజయాదిత్యు డెవ్వరితోడను యుద్ధము చేసినట్లు కానరాదు. అట్లని చెప్పుట కాధారము లేదు. ఇప్పటికి లభించిన శాసనాధారములనుబట్టి చూచిన బోయకొట్టములమీది యుద్ధమే యతని రాజ్యకాలమున నడచిన ప్రథమయుద్ధమని చెప్పవలసియున్నది. మఱియు పాండరంగని 'పడవాళు', బట్టముకట్టి బోయకొట్టములపై నంపినంత మాత్రమునసే యతని తండ్రి యంతకుముందే మరణము జెందెనని యెంచవలసినయావశ్యకతయు గానరాదు. బోయలపై బోరసమకొల్పబడిన 'పడవాళు' నాయకుడుగ పట్టబద్ధుని గావించెనని యున్నదే కాని సర్వసేనాధిపతిపదవి కని లేదు. కావున కడెయరాజు మృతిజెందినది బోయకొట్టములపై నడచిన దండయాత్రకాలమే యని తలచుట యుక్తము. శాసనపరిశోధనశాఖవారు చెప్పినట్లు మంగి మొదలగు వారితో జేసిన సంగరమున గావచ్చును; కాదేని మఱియొకసందర్భమున గావచ్చును.

కడెయరాజు మంగిపైని దండయాత్రయందు పాల్గొనినను లేకుండినను మఱియొక బ్రాహ్మణయోధు డతని ప్రక్కను నిలచి యుద్ధము చేయుచు గుణగవిజయాదిత్యునకు జయము చేకూర్చుటకు వలయునంత సాయమొనగ్చెను. ఇతని పేరు వినయాదిశర్మ. ఇతడు యుద్ధభూమియందు గుణగవిజయాదిత్యునికి మంగిని జంపుటకనువైన యుపాయమును బోధించెను. దీనికి సంతసించి విజయాదిత్యు డాతనికి బంపపట్టు గ్రామము నగ్రహారముగ నొసగెనట౩౨.

---

౨౯. భారతి. సం. ౫. పుట ౬౧౬
పరచక్రేణ యుద్ధ్వాజౌ దత్తప్రాణస్య భూభృతే
నూనుః కడెయరాజస్య పాండరంగో గుణాధికః॥

౩౦. ఆన్యువల్ రిపోర్ట్ ఆఫ్ ఎపిగ్రఫీ. ౧౯౦౯. పుట. ౧౦౬.

౩౧ వేంగీచాళుక్యులు పుట ౩౩.

౩౨. ఎపిగ్రాఫియా ఇండికా. సం. ౫. పుట ౧౨౫ వినయాదిశర్మయాదేశముచే గుణగవిజయాదిత్యుడు మోసముచే మంగిని జంపెనని కొందఱు చరిత్రకారు లభిప్రాయపడుచున్నారు. రాష్ట్రకూటచరిత్రకారుడగు డాక్టర్ ఎ. యస్. అల్టెకారు ఇట్టియభిప్రాయము వెలిబుచ్చియున్నారు: 'విజయాదిత్యుడు నోలంబ సైన్యము నోడించి, వంచనచేసి తత్సైన్యాధిపుడగు మంగిని చంపినట్లున్నది' అని చెప్పి తమ యభిప్రాయము నిట్లు సమర్థించుకొనియున్నారు. "విజయాదిత్యుడొక విద్యాం[illegible] బ్రాహ్మణునకు మున్ముందుగ యుద్ధము నడచు [illegible]భూమిని నతడు దానముచేసిన యుపదేశము

మంగిని వధించిన యనంతరము గుణగవిజయాదిత్యుడు గంగవాడిని ప్రవేశించెను. గాంగ క్షితిధాత్రీ కోర్వుకొనజాలక గంగకూటశిఖరముపై తల దాచుకొనిరి. ౩౩ కాని గుణగుడు వారిని వదలలేదు. దురారోహ మగు నాకొండ నెక్కి వారిని యుద్ధమున నోడించి జయము గొనెను. గంగుల కాశ్రయభూతమైన గంగకూట మెద్దియో కనుగొనవలసి యున్నది. నొళంబరాష్ట్రమును దాటినతరువాత గంగుల మీద గుణగవిజయాదిత్యుడు యుద్ధమొనర్చినట్లు చెప్పియుండుటచేత నీగంగకూటము గంగవాడియందలిదై యుండవలయును; కావున ప్రస్తుతమైసూరు రాజ్యమందలి కొండలలో నొకటి ప్రాచీనకాలమున నీ పేర ప్రసిద్ధి నందియుండెనని మన మూహింపవచ్చును. బెంగళూరుజిల్లా నెలమంగలతాలూకాయందలి పశ్చిమోత్తర భాగమున శివగంగ యను నొక కొండ కలదు; ఇది పుణ్యస్థానము; దక్షిణకాశియని దీని నామాంతరము. 'శివగంగే శాద్రి' యని మఱియొకపే రున్నట్లు శాసనములవల్ల దెలియవచ్చుచున్నది ౩౪. ఈ కొండకు ౪౫౫౯ అడుగుల పొడవుగల సుందరమైన శృంగమొకటి యున్నది. ఇదియే పూర్వచాళుక్యుల శాసనములలో చేర్కొనబడియుండు గంగకూట మని తలచెదను. ఈ స్థలనిర్ధారణ సరియైనచో గుణగవిజయాదిత్యుని సైన్యములు దాదాపు తుమకూరుపరిసరములవఱకు గూడ చొచ్చెనని చెప్పవలసి యున్నది. (సశేషము.)

---

చొప్పున దాను మంగిని జంపగలుగుటకు కార్తీకమున చంద్రగ్రహణకాలమున దానముచేసినట్లు చెప్పియున్నది. పేరునుబట్టియు, చంద్రగ్రహణపుణ్యకాలమున చేయబడిన దానమును ప్రతిగ్రహించుటచేతను, బోదుకాడని తెలియవచ్చెడి యొక బ్రాహ్మణుని యాదేశానుసరణమువలన విజయాదిత్యుడు మంగిని చంపగల్గుటచేత, వతని మరణము బహుధా యొక యుక్తికాలమున సంప్రాప్తమై యుండునని చెప్పబడియున్నది. (Rashtrakutas and their times, P. 94 N. 14). తలకాడుగాంగుల చరిత్రను వ్రాసిన శ్రీ యం. వి. కృష్ణరావుగారుగూడ డాక్టర్ అల్టెకారు గారి మార్గము ననుసరించి 'పరాక్రమశాలియగు నొలంబనీవానిని మంగిని ద్రోహముచేసి చంపెను' అని వ్రాసిరి. (The Gangas of Talakad P. 84) కాని ఈ యభిప్రాయములకు శాసనమం దెట్టి యాధారమును లేదు. వినయడిశర్మ యోధకాదని చెప్పినారు అల్టెకారు. ఇది యతని పేరువల్లను, దానప్రతిగ్రహీత యగుటవల్లను తెల్లమగుచున్నదట! శర్మాంతనామ ధారియు, బ్రాహ్మణుడును నగుటచే అతడు యోధ కాకపోలేదు. అక్కాలమున బ్రాహ్మణు లనేకులు శస్త్రోపజీవులై రాజులకు గాత్రమునను ఖడ్గమునను తోడ్పడుచుండిరి. వినయడిశర్మకు సమకాలికులగు కడెయరాజును, పండరంగడును బ్రాహ్మణులే. మొదటి చాళుక్యభీమునికి ఖడ్గసహాయము చేసిన రంగాధికర్కయను బ్రహ్మచారియును బ్రాహ్మణుడే. వలయునేని చాళుక్యశాసనములనుండి యిన్ని యేనియు నుదాహరణముల జూపవచ్చును. యోధుడైయుండిన ప్రతిగ్రహీత కాగూడదను నియమ మెచ్చటను లేదు. ఎందరో యోధులు దమ ప్రభువులకడనుండి దానములను గొనియున్నారు. వాణసవంశజుడును గల్యాణపుర చాళుక్యచక్రవర్తియగు నాహవమల్ల సోమేశ్వరుని దండనాయకుడును నగు కాళిదాసనీవాని పేర బరమేశ్వరదత్తిగా బ్రాహ్మణులకొక యగ్రహారమును బడసెనని నాగవావి శాసనములం దొకదానియందు చెప్పియున్నది. (నాగాయి శాసనములు, హైదరాబాదు ఆర్కియాలాజికల్ సీరీస్. నెం ౮ రు, పుట ౨౨.) కావున శస్త్రోపజీవులై రాజసేవానిరతులైన బ్రాహ్మణులు దానములను గ్రహించుటయం దసంగత మేమియు లేదు. శాసనశ్లోకమునందు వినయడిశర్మయాదేశముచొప్పున రాజు ప్రవర్తించి జయమును బొందెనని యున్నది కాని యాయాదేశమూలమున వంచనగాని, ద్రోహముగాని చేసినట్లు లేదు. యుద్ధముచేయుచుండిన వినయడిశర్మ శత్రుమర్మము నెట్లో యెఱిగి రాజున కది తెలియజెప్పియుండవచ్చును; ఇందు వంచనకుగాని, ద్రోహమునకుగాని యెడము లేదు. కావున గుణగవిజయాదిత్యుడు వంచనచేసి మంగిని చంపె ననుట యొప్పదగని విమయము.

౩౩. 'గంగా నారోపయ ద్గంగకూటం' అను ప్రథమచాళుక్యభీముని యత్తిలి తామ్రశాసనము. (ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక. సం. ౧౧. పుట ౨౪౧.) ఒకానొకచోట 'గంగకూటం' అనుదానికి బదులు 'తుంగకూటం' అని యున్నది. (జర్నల్ ఆఫ్ ది ఆంధ్రహిస్టారికల్ రిసర్చి సొసైటి. సం. ౧౧ పుట ౮౦ ము.)

౩౪. ఎపిగ్రాఫియా కర్ణాటకా, సం. ౯. నెలమంగలం. ౮౪.

# పరాధీన

[కథానిక]

•

= శ్రీ వేలూరి సహజానందం =

"ప్రభూ...ఈశీనికి మరణిస్తేనా?" పార్వతి చూపులు, ఈ సూటిప్రశ్నకు ప్రభుమనో దుర్గపు కోటగోడలు కూలిపోయినయ్. నిండువెన్నెల్లో పార్వతి చెక్కిళ్ళపై కన్నీళ్ళు మెరుస్తున్నయ్. ఆమె ముఖంలో రోగి మరణయాతనచ్ఛాయలు కమ్ముకున్నయ్. ప్రభుగుండె జలదరించింది. నిశ్శబ్దమైన నిశీథంలో పార్వతి అంతర్యం అతని ముందు ఉజ్వలంగా నిలబడి విజృంభిస్తోంది. అతనేదో మాట్లాడబోయాడు. కాని పార్వతి అతని పెదవులను చేతితో నొక్కింది. ఆ హస్తస్పర్శలో స్త్రీహృదయోష్మ, ప్రభురక్తనాళాల్లో ప్రతిధ్వనించింది.

"పార్వతీ! నాలుగురోజుల్లో నేను పెళ్ళిచేసుకుంటున్నాను. నువ్వు సంతోషంగా నన్ను..." ప్రభు ఇక మాట్లాడలేకపోయాడు.

ప్రభుసమాధానం పార్వతిహృదయాన్ని కలచివేసింది. ఆకాశంలో చంద్రుడు, ఇక్కడ ఈ జీవద్వయం జాగరణతో రాత్రిని గడుపుతున్నారు.

"రెండేళ్ళక్రితం నా సంతోషం, సుఖం ఏమైనయ్ ప్రభూ?" అని పార్వతి తన ముఖాన్ని అతని పాదాలపై ఆన్చింది.

ప్రభుపాదాలపై పార్వతిజుట్టు నల్లనిమబ్బులా కమ్ముకుంది. పరాయిఇంట్లో. ఇల్లాలితో...ఏకాంత అర్ధరాత్రి...ఇలా వాంఛాఝంఝాటంలో చిక్కుకుపోయిన ప్రభు తన పాదాక్రాంతయైయున్న పార్వతిని చూచి దుఃఖంతో వివశుడయాడు.

కష్టాల్లో ఉన్న సోదరి తన కాళ్ళపై బడి, సాయంకోసం యాచిస్తున్నట్టుగా ఉంది అతనికి. అంతే కాదు, పార్వతిహృదయం ఆక్రోశంతో, పరాభవంతో భగ్గుమంటోందనీ, దానిప్రజ్వలనంలో తమిద్దరి భవిష్యత్తూ భస్మీపటలం కాగలదనీ ప్రభు ఊహించాడు.

"పార్వతీ...ఇన్నాళ్ళనుంచీ నే కోరుతోందేమిటి? నీ సుఖం కాదూ? నీ పెళ్లినాడు చెప్పాను. 'నీ ఆరాధ్యదైవం నీకు లభించింది. ఇక అతనికే నీ పూజ చెందుతుంది' అని." ప్రభు పార్వతిముఖాన్ని తన చేతులలోకి తీసుకుని వెన్నెలలోకి పైకెత్తాడు.

పార్వతి ఈ శుష్కసమాధానానికి చలించలేదు.

"ఈ పరామర్శతో పొద్దుపుచ్చకు...సుఖం? రెండేళ్ళక్రితం నీ పార్వతి మరణించింది. దాని జీర్ణ, శుష్క కళేబరాన్ని చితిదాకా మోసుకొని వెళ్ళటమే నా సుఖం!" పార్వతి పత్తున తెచ్చుకుని కూర్చొంది.

ఈ రెండేళ్ళూ ఆమె భర్తృగృహంలో ప్రశాంతంగా ఉంటోంది. లోని గాయం ఎంత పోటుపెట్టుతున్నా, ఆ బాధ నణచుకొని దాంపత్యధర్మం నెరవేరుస్తోంది. ఉపచారంలో, సహకారంలో, మంచితనంలో రవ్వంత లోటులేని భార్యలో తన గ్రహణ కందకుండా ఏదో తీవ్రవేదన చెయిపడగలెత్తి బుస కొట్టుతోందని శివరావుకు తెలుసు. చిన్ననాటి చెలికాడైన ప్రభుకు కాకుండా ఇతరునికి తాను భార్యకావటంతో పార్వతి జీవచ్ఛవంలా రాత్రింబగళ్లు గడుపుతోంది. ఈ రెండేళ్ళూ ప్రభు తనకు కన్పించలేదు.

అతను తాగుబోతై ఉంటాడనీ, శుష్కించి ఉంటాడనీ ఊహాకల్పించి పార్వతి భయపడుతోంది. శివరాత్రిమధ్య ప్రభువు ఒకసారి ఇక్కడికి పిలుద్దామా అని అంటే కూడా, 'అతను దుర్మార్గుడు, తాగుబోతు' అని ప్రభుగురించి వ్యాఖ్యానించి మళ్ళీ ఇన్నాళ్లకు తాగుబోతూ, దుర్మార్గుడూ కాని ప్రభు అనుకోకుండా ఇలా వచ్చినప్పుడు, పార్వతి ఆనందవిచారాలతో క్షోభపడుతోంది.

పార్వతి కేశంగా జరిగి ప్రభు అన్నాడు:

"రెండేళ్ల కిందటి గాథతో నీకు నువ్వు ఉరిపోసుకుంటున్నావు!"

చకితురాలైన పార్వతిముఖం ఒక్కసారిగా ఉత్తేజితమై, ఇలా అంది:

"ప్రభూ! రెండేళ్ళక్రితం నువ్విలా మాట్లాడేవాడివా? పరాధీన అయిన పార్వతి నీ కిప్పుడు అపరిచయురాలు. ఈ రెండేళ్లూ నా కజ్ఞాతంగా ఉన్న నీ హృదయం విచారంతో మగ్గిపోవుల్లేదూ...ప్రభూ! నీ శక్తిసాహసాలేవీ? మనకు ప్రపంచంలో చోటు లేదా? చివరికి రుద్రభూమిలోనో ఏదో వృక్షంకింద మనం తలదాచుకోలేమా!"

"పార్వతీ!"

"అప్పటికి వెలుగు మనకు వెన్నంటి, నిశీధ నేపథ్యంలోంచి వెలికితీస్తే, అగ్నిదేవుని సాక్షిగ చెప్పదూ మనకు ఉన్నదేగదా? ప్రభూ...మరణం లేని యాజ్ఞికమైదీని నేను..."

"పార్వతీ...నీకు మతిపోతోంది. నీ ఇంటికి నువ్వు నిప్పంటించుకుంటున్నావు! నాలుగురోజుల్లో నా పెళ్ళి..."

"పెళ్ళి...ప్రభూ...నిజం చెప్పు...నీ పెళ్లి ఇష్టమేనా? నువ్వు తాగుబోతు, దుర్మార్గుడివి కాకపోయినా, స్త్రీలోలుడివై పోతున్నావు...ప్రభూ!"

ప్రభు ఆపాదమస్తకం కంపించాడు. ఇద్దరిమధ్య మౌనసింధువు నిలబడిఉంది.

"పార్వతీ! నేను కోరి చేసుకుంటున్న పెళ్లి... ఎవరి నిర్బంధమూ లేదు. నువ్వొక దేవతఅని చెప్పాను."

"ప్రభూ! ఇంక చాలు...పాత్రను విషంతో నింపటమిక చాలు...ప్రభూ! నువ్వు నా ప్రభువి కావు...నీ కళ్ళు ఎవ్వరో పొడిచారు. వాటి రక్తాశ్రువుల ఘోష నీకు వినబడుట్లేదా—ప్రభూ! రెండుసార్లు పెళ్ళి చేసుకోగలవా?"

"పార్వతీ..." ప్రభు నిశ్చేష్టుడై మాట్లాడలేకపోయాడు.

"నా ఈ వివాహం ఇంకోనెల ఉందనగా, నీ మెళ్లో నే వేసిన పూలమాల నీ మగపుబుద్ధికి వాడిపోయి ఉండవచ్చు. కాని నువ్వు...నీ చేత్తో...ప్రభూ...ఈ అభాగ్యురాలిముఖం...ఇక్కడ నువ్వు పెట్టిన ముద్దు ఈనాటికీ ఈచర్మాంకింద భగ్గన దేదీప్యమానంగా ప్రజ్వలిస్తోంది. నా కానాడే వివాహం. నా కానాడే దాంపత్యం...ఇవ్వాళ మళ్లీ నువ్వు ఇంకోసారి పెళ్లి..." ఆవేశంతో పార్వతి ఇక మాట్లాడలేకపోయింది.

ప్రభు అశ్రువులు చూసి పార్వతి తలవంచుకుంది. తర్వాత గాద్గదికస్వరంతో పార్వతి అడిగింది.

"ప్రభూ! ఈ ఇంట్లోంచి వెళ్లిపోదామా? ఈ నాల్గురోజులూ నీతో ప్రపంచంలో తిరిగి, నీ కల్యాణ సమయానికి భస్మమైపోతాను."

తన్నుతా సంబాళించుకొని ప్రభు గంభీరంగా అన్నాడు:

"పార్వతీ...నీ పెళ్లివాడు చెప్పాను. శివరావు నీ భర్త అవటం నీ అదృష్టం. ఈ అదృష్టం లోకంలో అందరికీ లభించదు. ఇందుకతనికి నువ్వు వేయినమస్కారాలు పెట్టాలని"

"ప్రభూ! నా అదృష్టం..." అని పార్వతి మళ్లీ మౌనం వహించింది.

తెల్లవారుజాము అవుతోంది. ఈ కఠోరమైన రాత్రి ఎప్పటికైనా తెల్లవారుతుందా అని అనుకుంటున్నాడు ప్రభు. పార్వతీ...తాను...ప్రచ్ఛన్నంగా ఎక్కడో యాత్ర చేయలేరా? తన చిన్ననాటి స్నేహం తనకు తెలియకుండానే ఇలా అగాధాలు నిర్మించుకొని, ఇవ్వాళ ఈ భూకంపంలో ఇలా బదాబదలై ఆక్రందిస్తుందని ప్రభు ఇదివరలో ఊహించలేదు.

దాంపత్యం పార్వతిని నిర్జీవురాల్ని చేసిందికాని, ఆమె హృదయాన్ని హతం చెయ్యలేకపోయింది.

తలెత్తి పార్వతి మెల్లగా అంది:

"ప్రభూ! పార్వతి పాపాత్మురాలు...దీన్ని క్షమించు. కాని నాదొక్కటే ప్రార్థన... నీ భార్యను నువ్వు ఇష్టపడి పెళ్లి చేసుకోవచ్చును. కాని ఆ చీకటి ప్రమిదలో ఏ జ్యోతి వెలుగుతోందో, అదిమాటుకు నువ్వు తెలుసుకోలేవు. అయితే ప్రపంచంలో పార్వతి ఒంటరి......" అని ఇంకా పార్వతి ఏదో అనబోతుండగా, వీధితలుపు తక్కువ కొట్టినట్లు చప్పుడయింది. ప్రభు మెల్లగా అన్నాడు. "శివ...రావు".

ప్రభుగుండె దడదడ కొట్టుకుంది. పార్వతి నెత్తిపై ఏదో ప్రళయం ముంచుకొచ్చిపడుతోందని, ఆ తలుపుచప్పుడు రాబోయేతుపానుపిడుగని అతను కంపించిపోయాడు. పార్వతి చలించలేదు. లేవనున్న ప్రభు చేతులు పట్టుకొని కూర్చోపెట్టింది.

కింద నౌకరు తలుపులు తీశాడు. మెట్లపై అడుగుల అలికిడి అయినట్టు ప్రభు ఉలిక్కిపడ్డాడు. కింద గదిలో దీపం ఒకసారి వెలిగి, మళ్ళీ కాసేపటికి ఆరింది. ఇంట్లో నిశ్శబ్దంగా ఉంది.

పార్వతి లేచి నిలబడింది. ఆమెను కిందకు దిగబెట్టబోయాడు ప్రభు. కాని పార్వతి మెల్లగా అంది: "పార్వతిది ఈ ఇల్లు. ఈ ఇంట్లో నాకేమీ భయం లేదు."అని. తప్తహృదయంతో ప్రభు వచ్చి పడుకొని నక్షత్రాలకేసి చూస్తున్నాడు.

గదితలుపు ఘడియపడ్డది. తెల్లవారేముందు మెలకువ వచ్చి, శివరావు లేచి చూచాడు. కింద చాపపై కట్టెలా పడివుంది పార్వతి. ప్రభు, పార్వతులిద్దరూ స్వేచ్ఛగా మాట్లాడుకునేందుకై పని నెపంమీద వెళ్ళిన శివరావు పార్వతివిచారముఖం చూసి లోలోన బాధపడ్డాడు. భర్తఅడుగుల అలికిడికి ఉలిక్కిపడి పార్వతి లేచింది. ప్రభు మెట్లమీదనుంచి దిగివస్తున్నాడు. శివరావు తలుపులు తెరిచి, ప్రభును లోపలికి పిలిచాడు. పార్వతి విషణ్ణముఖంతో ఇంట్లోకి వెళ్ళిపోయింది.

రాత్రిరైలుకు ప్రయాణం. ప్రభు ఎంత బతిమాలినా పార్వతి బయలుదేరలేదు. అసలిప్పుడు పార్వతి జ్వరంతో మసిలిపోతోందని ఎవరికీ తెలియదు. వీధి ద్వారంవద్ద కారుహారన్ చప్పుడయింది. ప్రభు, శివరావులిద్దరూ కారులో కూర్చున్నారు. జ్వరతీవ్రతతో తూలుతూ పార్వతి డాబాపైకి పోయి పిట్టగోడ కానుకొని వీధిలోకి చూస్తోంది. కారు బయల్దేరింది. బయల్దేరిన కారులోంచి ప్రభు నమస్కరించాడు. పెద్ద చప్పుడుతో కారు వీధిమలుపు తిరిగింది.

పార్వతిగుండె బరువెక్కింది. చిన్ననాటి చెలికాడు ప్రభు, భర్త శివరావు ఇద్దరూ కులాసాగా వెళ్లిపోయారు. తాను తన నీడలో నిలబడి శూన్యంలోకి చూసింది.

తానొక ఏకాకియై, ఓ అరణ్యంలో దారితప్పి ఉంటే, ఏ సింహపు ఆకలో తన క్షుభితజీవితాన్ని కబళాన్ని చేసివైచేది. ఈ ఇంట్లో...తన ఇంట్లో... తా నీ ఏకాంతంలో ఇలా దహించిపోవట మెంత కాలం! గడచిన రెండు రోజులనుంచి కోలాహలంగా ఉన్న సముద్రతీరం ఇప్పుడు గంభీరనిశ్శబ్దంతో భయంకరంగా ఉంది. పడవలన్నీ తెరచాప లెత్తుకొని, నీటి బాటల్లో దూసుకుపోతున్నయ్. నిర్జనంగా ఉన్న ఈ ఇసుకతిప్పల్లో కూలబడివున్న అభాగిని చెవుల్లో తరంగఘోష భీకరంగా వినబడుతోంది. ఎవ్వరో సరంగు తీరంపై కాలుపెట్టి ఈ భగ్న శాంతికన్య ఓ దోనెలో కూర్చోపెట్టి జలగహ్వరంలోకి పంపుతాడు.

దూరాన కాసేపటికి రైలుకూత వినబడ్డది. ధూమఫూత్కారంలో ఇనపచక్రాలు చుట్టలుచుట్టుకొన్న కొండచిలువల్లా రొప్పుకూ పరవళ్లు తొక్కుతున్నయ్. పార్వతి కళ్లలో నీళ్లు లేవు. ఆమె హృదయంలో స్పందం లేదు.

ఎందరో శ్మశానంలో దగ్ధమైపోతున్నారు. కాని ఇంటింటా సజీవంగా దహనమైపోతూ, భస్మంకాని ప్రాణు లెవరైనా ఉన్నారా? తానొక్కర్తేనా? ఈ హృదయతాపం ఒక్కసారి భగ్గుమని తన నెందుకు మసి చేయకూడదు! కన్నీళ్లతో ఈ అంతరజ్వాలాశిఖలు మరింత మంటలెగసి తన్ను దహించివేస్తున్నయ్. ఈ మరణయాతన ఎంతకాలం! ఈ జీవితంకంటె మృత్యువు సుఖంకాదా! పార్వతి కంపించింది. పార్వతి తనకు తానే ఓ మహాపర్వతమై తన్ను పాతాళంలోకి తొక్కివేస్తున్నట్టు తోచింది.

రైలుస్టేషన్‌నుంచి తిరిగివచ్చిన శివరావు డాబాపైకి వెళ్లి 'పార్వతీ'అని అరిచాడు. తూలిపడ్డ పార్వతి నుదుటిపై గాయంఅయి, అక్కడ నెత్తురు మరక అయింది. శివరావు హృదయం హోరెత్తుతోంది. ఆందోళనతో కళవళపడుతున్న భర్తను చూచి, "నే జీవించే ఉన్నాను" అన్నది పార్వతి నిస్పృహలోంచి కళ్లు తెరచి.

# ప్రసవవేదన



— శ్రీ భాగవతుల పూర్ణయ్య —

తల్లిగర్భమ్ములో దాగి దోబూచాడి
ముక్కు మొగ మగుపడక మురిపించి విసిగించి
ఆడు మగ యను మాట కవగతము కానీక
కులికి పలుకని శిశువు
గుణ మెట్టిదో ?
ఉదయించి మా కేమి ఒరిగించునో ?

బలువుపడి పదినెలలు నిలువునా క్రుంగినది
ఒడలంత ఉడు కెక్కి బడలికలు గుడిచినది
తుదకు వేదన మీర తుడిచినది కన్నీరు
ఈ మాత భూజాతయో !
అద్వయిత
హిందువుల భూమాతయో !

కనలేని వినలేని కత్తికోతల పొంది
కారుచిచ్చుల రేగు కాలువుల కసుగంది
సరియింక యీ నిండుసరి జీవ మనగ తుది
గర్భవేదన గడచి, కవల ప్రసవించినది
ఆ జనని భరతావని !
అంతతో
ఆపదల కడముట్టునా !

గర్భగోళమునందు కలసి మెలగేవారు
కలిమిలేముల కొక్క గతి నోరు తెరిచారు
చిన్నపెద్దన రాక చిదికి వెలువడినారు
కలసి విడివడు శిశువులు
ఏకమయి
కవలవలె చరియింతురా ?

---




# శాస్త్రవిజ్ఞానం నాశనానికా? నిర్మాణానికా?

నువ్వున్న గదిచుట్టూ చూడు. చూసి, నీచూపు కందిన వస్తువుల జాబితా వ్రాయి. ఆ వస్తువుల నిర్మాణంలో, మనిషిస్పర్శ తగలకుండా వున్నప్పటి పూర్వస్థితిని మాత్రమే నువ్వు వ్రాయాలి. అయితే యిప్పుడేం తేలింది? — మంచాలూ, కుర్చీలూ వీట్లలో చెట్లు కోస్తే వచ్చిన కర్ర వుంది. పరుపుల్లో ప్రత్తివుంది. మేకుల్లో ఇనుముంది. ఇంకా పుస్తకాలూ, ఎలెక్ట్రిక్ దీపాలూ, బట్టలు, బొమ్మలు—యివన్నీ ప్రకృతిలో వున్న రూపంలో లేనేలేవు. అంటే వీట్లో 'ముడివస్తువు' అనబడేది కనుక్కోవడమే కష్టం. దీనినిబట్టి, నేటి నాగరిక జీవితం తన అవసరాలకోసం ప్రకృతిని ఎలా సాధించిందో నీ కర్థమవుతుంది.

ఇదుగో యిటు చూడు. ఇక్కడ రెండురకాల కాగితం వుంది. ఒకటి ముదుగురకం; కాని గట్టిది. దీన్ని చింపడం కష్టం. ఇది సరిసమానంగా వుండదు. వెల్తురుకు ఎదురుగా పెడ్తే, యీ ముదుగుకాగితంలో అక్కడక్కడ దట్టంగా మచ్చలు కనిపిస్తాయి. రెండో కాగితం నాజూగ్గా, పల్చగా వుంది. దీన్నికూడా వెల్తురుకు ఎదురుగా పెడ్తే, ముదుగుకాగితంలో కనిపించినట్టు మచ్చలేవీ కనిపించవు. ముదుగుకాగితంలాగ కాకుండా, బల్లమీద పెడ్తే యిది సరిసమానంగా వుంటుంది. ఈ కాగితం రాతకు బాగుంటుంది. మొదటిది వస్తువులు పేకింగు చెయ్యడానికి పనికొస్తుందిగాని, రాతకు పనికిరాదు. వేరువేరు ప్రయోజనాలకు పనికొచ్చేటట్టు యీ రెండురకాల కాగితం తయారుచెయ్యడానికి ఎంత శ్రమ, ఎంత నైపుణ్యం, ఎంత పరిశోధన ఖర్చుచెయ్యవలసివచ్చిందో ఆలోచించు.

## ఒక్కతరంలో

ఆ ఫౌంటెన్ పెన్నూ, ఆ రిస్టువాచీ నిర్మించడానికి ఎంత సూక్ష్మమైన శాస్త్రవిజ్ఞానం (సైన్సు) వినియోగించాలో ఆలోచించు. ఇవన్నీ మన జీవితంలో అవసరమయ్యే సామాన్యవస్తువుకే. మన ఇళ్లల్లోకి, పనిలోకి, విలాసాలలోకి శాస్త్రం ఎంత లోతుగా చొచ్చుకపోయిందంటే—వీట్లలో శాస్త్రం వున్నదన్న చైతన్యమే మన కుండదు! ఇది పాతుకపోయిన సాంప్రదాయ మేమీ కాదు. ఇప్పుడు మామూలుగా వాడుకలో వున్న విద్యుచ్ఛక్తి నిర్మించిన వస్తువుల్లో అత్యధికభాగం ముప్పై నలభై సంవత్సరాలకు పూర్వం లేనేలేవు.

శాస్త్రం కల్పించిన యీ సదుపాయాలన్నీ మాయమైపోతేనో? మన నాగరికజీవితమంతా చప్పగా కూలి పూరుకుంటుంది. మోటారుకార్లూ, ట్రాం బళ్లూ, టెలిఫోన్లూ మొదలైనవన్నీ లేకపోతే, లక్షలసంఖ్యలో జనాభా గల మద్రాసువంటి మన నగరాల్లో జీవితం దుర్భరమైపోతుంది. ఇవన్నీ ఆగిపోకుండా సాగిపోతాయనీ, కొత్తగా కలిగే మన అవసరాలను తీర్చుకోవడానికీ, రానున్న ప్రమాదాలను దాటడానికీ శాస్త్రం పనికివస్తుందన్న నమ్మకంతోనూ, వీటన్నిట్నీ మనం సమిష్టిగా నిర్మించుకున్నాం. రేపు తెల్లారేటప్పు

టికి శాస్త్రం మనకు ప్రసాదించిన వస్తువులన్నీ అమాంతంగా మాయమైపోతాయనుకో. అప్పు డేం చేస్తావు? ఊసుపోని ఉద్యోగంగా నే నీ ఊహ చెప్పడం లేదు. మన భవిష్యత్తునూ, మన నాగరికజీవితాన్నీ శాస్త్ర విజ్ఞానంమీదనే ఆధారం చేసుకున్నామన్న విషయం నిన్ను గుర్తించమనడానికే నీ కీవిషయం సూచించాను.

ఈ విషయంలోని చిక్కులు యింకా వివరంగా చూద్దాం. ఒక నూటయాభై సంవత్సరాలక్రితం ఇంగ్లండులో జనాభా చాలా తక్కువగా వుండేది. వ్యవసాయవృత్తి అధికంగా వుండేది. పరిశ్రమలు ప్రారంభదశలో వుండేవి. తరవాత శాస్త్రం కొత్తశక్తిని ప్రసాదించింది. రాతిబొగ్గూ, స్టీమూ (ఆవిరి) వచ్చాయి. దాంతో దేశమే మారిపోయింది. పంటపొలాలు బీడుభూములూ, బొగ్గుగనులుగానూ ఇనపఫాక్టరీలుగానూ మారిపోయాయి. నిశ్శబ్దంగా వుండే గ్రామాలు అకస్మాత్తుగా పట్టణాలయిపోయాయి. పల్లెటూరిజనం నానాటికీ పెరిగిపోతున్న పట్టణాల్లోనికి ప్రవహించారు. ఒక్కతరంలో బ్రిటను పూర్తిగా యంత్రయుగంలో ప్రవేశించింది. ఈ క్రింది మూడు వాస్తవిక విషయాలూ ముఖ్యమైనవి: ౧. ఎక్కువభాగం ప్రజల జీవితవిధానం ఒక్కతరంలో పూర్తిగా మారిపోయింది. ౨. సాంఘికవ్యవస్థలో యెక్కువభాగం పూర్వం వ్యవసాయంద్వారా నిర్ణయింపబడినట్టే, యిప్పుడు స్టీము, బొగ్గు, ఇనుమువల్ల ఉపయోగాలు బ్రిటన్‌లోని సాంఘికవ్యవస్థను ముఖ్యంగా నిర్ణయిస్తున్నవి. 3. పట్టణాల్లో నిర్మింపబడిన ప్రజలజీవితం, యీ సదుపాయాలన్నీ స్థిరంగా వుంటాయన్న గట్టినమ్మకంతో చేసినవి.

## మెదడుచేసేపనులకు యంత్రాలు

ఈ ఆఖరు అంశం యెలా గురితప్పిందో మనం కళ్లారా చూస్తున్నాం. ప్రజల అవసరాలు మారుతుంటాయేకాని, ఒకేలాగ వుండిపోవు. మారుతున్న యీ అవసరాల ప్రోద్బలంతో, శాస్త్రపరిశోధన అభివృద్ధి చెందుతూ వుంటుంది. ఇంకొకటేమంటే, శాస్త్రాభివృద్ధి ఒక్క సరిహద్దుల్లో వుండిపోదు; సరిహద్దులు దాటి ప్రపంచం అంతా వ్యాపిస్తుంది. ఈ యంత్రవ్యాప్తి త్వరత్వరగా జరుగుతుంది. కాని ఒకచోట యెక్కువగాను, యింకోచోట తక్కువగాను జరుగుతుంది. ప్రపంచంఅవసరాలు తీర్చడానికి యే మోతాదులో యంత్రనిర్మాణం జరగాలని కాని, యేయే దేశాల్లో యేయేవిధంగా జరగాలన్నదిగాని మనం ఆలోచించడం లేదు. అంతర్జాతీయంగా యేమీ చర్య తీసుకోకపోవడంవల్ల దేశాలకు మధ్య వర్తకపుపోటీ శృతిమించి రాగాన్న పడింది.

## అవసరాలనుబట్టి మార్పులు

ఆవిరి (స్టీమ్) యంత్రాలు కనిపెట్టడంతో ఒక కొత్తశకం ప్రారంభమైంది. దీనివల్ల వరసగా యెన్నో మార్పులు వచ్చాయి. వీటికి ముఖ్యాధారం ప్రజల అవసరాలు. శాస్త్రవిజ్ఞానం అవసరాలకు అనుగుణ్యంగా వస్తువులు సృష్టిస్తూవుంటే, సంఘంలో విశేషమైన మార్పులు వచ్చాయి. ఒక్కతరంలో ఎన్ని కొత్తపరిశ్రమలు పుట్టాయో, యెన్ని చచ్చాయో జాబితా వేస్తే, వచ్చిన మార్పు లెటువంటివో నీకు బాగా అర్థమవుతుంది. యాభైఏళ్లక్రితం మన వృత్తులకీ, ఇప్పటి మన వృత్తులకీ మధ్య తేడా గమనించు. రవాణావంటి పరిశ్రమలో గుర్రంబండీ, రైలు, మోటారు, ఏరోప్లేను ఒకదాని తరవాత ఒకటి యెలా వచ్చాయో ఆలోచించు.

మెదడు చేసే పనులుకూడా యంత్రాలే చేస్తున్నాయి. ఇన్స్యూరెన్సు కంపెనీల్లోనూ, బేంకుల్లోనూ యంత్రాలే లెక్కలు చేస్తుంటాయి. లేబొరేటరీలలో ఎలెక్ట్రిక్ మెషీన్లతో అతిసున్నితమైన పను లెన్నో చేయిస్తుంటారు. అతిచిక్కుసమస్యలనెన్నిటినో యివి విడదీస్తుంటాయి. పరిశోధనల్లో వచ్చే తప్పుల్నికూడా యివి చూపుతుంటాయి. ఈ యంత్రాలు మనిషి చెయ్యవలసిన పనిని అవి చెయ్యడమేకాకుండా, ఆ పనిలో వెంట్రుకవాసి తప్పుకూడా రాకుండా చక్కగా చేస్తున్నాయి. కొత్తయంత్రాలు పరిశ్రమలను యెలా అభివృద్ధి చేస్తున్నాయో చూద్దాం.

## అంతులేనన్ని ఉపయోగాలు

రాతిబొగ్గును ఒక ప్రత్యేకపద్ధతిలో వేడిచేస్తే దానినుండి కోల్‌గాస్, కోల్‌తారు, అమోనికల్

తీక్కురూ వస్తాయి. ౧౮౧౯ సం.లో కోల్ గాసు తయారుచెయ్యడం ప్రారంభమైంది. పదిహేనేళ్ళతరవాత గాస్ ఫాక్టరీ నిర్మింపబడింది. దీనివల్ల గాస్ లైట్లు వచ్చి మన కెంతో ఉపయోగపడ్డాయి. కాని యీ గాస్ తయారుచెయ్యడంలో కొన్ని దుష్ఫలితాలు కూడా వున్నాయి. ఈ గాస్ దీపాలు ఎంత అవసరమో దాని దుర్గంధంనుండి వచ్చే ఫలితాల్ని పోగొట్టుకోవడమూ అంత అవసరమే. గాస్ నుండి కొన్ని పదార్థాలు దుర్వ్యయం కావడంవల్ల యీ పరిస్థితి వచ్చింది. దీని అంతేమిటో కనుక్కోవడానికి శాస్త్రజ్ఞుడు (సైంటిస్టు) పూనుకున్నాడు—లాభాలు మింగే వర్తకుడికి ఆలోచనే లేదు. బెథాల్ అనే శాస్త్రజ్ఞుడు, వృథాఅవుతూన్న కోల్ తారునుండి వచ్చే ఒక నూనె కర్రను పాడుకాకుండా కాపాడుతుందని కనుక్కొన్నాడు. అంతకుపూర్వం రైల్వేలైన్లకు మధ్య వేసే కర్రలు (స్లీపర్స్) పాడుకాకుండా వుంచడం ఎలాగ అన్నది పెద్దసమస్యగా వుండేది. ఈ పరిశోధనతో ఆ సమస్య తీరిపోయింది. ౧౮౨౫ వ సంవత్సరంలో ఫారడే లేబొరేటరీలో బెంజైన్ తయారుచేశాడు. ఇరవై ఏళ్ల తరవాత, కోల్ తారునుండి బెంజైన్ తయారుచెయ్యొచ్చునని కనిపెట్టబడింది. ఇంతకుపూర్వం వర్తకులు యీ కోల్ తారును పారవేసేవారు. పైగా దీన్ని పారవెయ్యడానికి బాగా డబ్బుకూడా ఖర్చుచేసేవారు! కాని నాలుగురాళ్లు ఖర్చుచేసి పరిశోధన చేయించడమనేది యీ వర్తకులకు తోచేదికాదు. పద్దెనిమిది సంవత్సరాల వయస్సు గల పెర్కిన్ అన్న పరిశోధకుడు ౧౮౫౬ లో కోల్ తారులో వున్న బెంజైన్ నుండి ఎనిలైన్ అన్న రంగు కనుక్కున్నాడు. ఇది రంగుల పరిశ్రమను ఎంతో అభివృద్ధిచేసింది.

బొగ్గుపరిశ్రమలో వృథాఅవుతున్న వాటిని పరిశోధించడంవల్ల అంతులేనన్ని వస్తువులు బయటపడ్డాయి. అనేకరకాల రంగులు, నెప్తలైన్, అమోనియా, క్రియోసోట్, బెన్‌జోల్, పిచ్, తార్, పెర్ఫ్యూమ్సు, పేరాఫైన్స్, డ్రగ్స్, ఫ్లావరింగ్స్, డిస్ ఇన్ ఫెక్టెంట్స్, యింతేకాకుండా అనేక పేలుడు వస్తువులుకూడా కనుక్కున్నారు. ఎందుకూ పనికిరాదని పారవేసే వస్తువులను పరిశోధించి, పెయింట్లు, ఇండియా రబ్బరు, వార్నిషులు, స్టైన్, కంపోజిట్ ఫ్యూయల్, వుడ్ ప్రిజర్వేటివ్స్, పిట్టుమాన్యుఫాక్చర్ మొదలైన వెన్నింటినో శాస్త్రజ్ఞులు కనిపెట్టారు.

## క్రమపద్ధతిలేనందువల్ల దుర్వినియోగం

దీని నీతి స్పష్టం. పరిశ్రమల అభివృద్ధికి శాస్త్ర సిద్ధాంతాలను ఉపయోగించడానికి సరైన ప్రయత్నం జరక్కపోతే, యిప్పుడుగాని ముందుగాని మన అవసరాలు సమృద్ధిగాగాని, తెలివైన పద్ధతిలోగాని నెరవేరవు. శాస్త్రసిద్ధాంతం స్ఫురించినప్పట్నుంచి, ఒక వస్తువు ఉత్పత్తి అమ్మకాలవరకూ ఒక సమన్వయమన్నది తప్పకుండా వుండాలి.

పరిశ్రమలు ఒక క్రమపద్ధతిలో నడవాలంటే, ప్రజల యిప్పటి అవసరాలనూ ముందుఅవసరాలనూ దృష్టిలో పెట్టుకోవాలి. దేశంలోని ప్రకృతిసంపదను వినియోగించుకోవాలి.

శాస్త్రవిజ్ఞానాన్ని పరిశ్రమలలో ఉపయోగించడానికి మూడుమెట్లున్నాయి.

మొదటిది శాస్త్రపరిశోధన. పదార్థవిజ్ఞాన శాస్త్రజ్ఞులు, రసాయనిక శాస్త్రజ్ఞులు, జీవశాస్త్రజ్ఞులు మొదలైనవారు, ముఖ్యంగా సిద్ధాంతానికి సంబంధించినంతవరకూ లేబొరేటరీల్లో పరిశోధనలు చేస్తుంటారు. ఈ పరిశోధనలు ముఖ్యంగా విశ్వవిద్యాలయాల్లోనూ, ప్రభుత్వంచేత నడపబడే శాస్త్రసంస్థలోనూ, గ్రంథాలయాల్లోనూ చేస్తుంటారు. వాటి ఫలితాలు శాస్త్రపత్రికల్లో ప్రచురింపబడి (దీని ప్రచురణకయ్యే ఖర్చులు తరుచుగా పరిశోధకుడే భరించాలి) ప్రపంచానికి ఉచితంగా అందుబాటులో కొస్తాయి. పరిశోధన కుపయోగపడే పరికరాలకోసమూ, ప్రచురణకోసమూ, యీ శాస్త్రజ్ఞుడు నానాతంటాలు పడాలి. గ్రాంటుల కోసం ప్రాధేయపడాలి. సామాజిక జీవితాభివృద్ధికి శాస్త్రపరిశోధన చాలా అవసరమని నిర్ధారణ అయినప్పటికీ, దూబరా ఖర్చు అయినట్టు గొణిగి గొణిగి, ప్రభుత్వం దయాధర్మంగా యేదో యిచ్చేది.

తరవాత మెట్టు—ఫాక్టరీ లేబొరేటరీలలో పరిశోధించిన విషయాన్ని పరిశ్రమలో ప్రవేశపెట్టడం. రసాయనిక శాస్త్రజ్ఞుడు కోల్‌తారునుండి ఒక కొత్త రంగు విడదీశాడనుకో. అది బాగా మన్నికుందా? మోటూగా వుండే ఆ రంగు వస్త్రానికి పనికిరావాలంటే యేమేమి చెయ్యాలి? ఒకకొలత కోల్‌తారు నుండి పనికివచ్చే రంగు యేమాత్రం తియ్యొచ్చు? దాన్ని తియ్యడానికి ఎంత ఖర్చవుతుంది? అమ్మకం యెలా జరుగుతుంది? ఈ రంగు తయారీకి యింతకంటే సులువైన పద్ధతు లేమైనా ఉన్నాయా? ఈ తయారీలో పనికివచ్చే కొత్తవస్తువు లేమన్నా వస్తాయా? ఉంటే వాటేమి చెయ్యాలి? ఇటువంటి యితప్రశ్న లెన్నో వున్నాయి. వీటన్నిట్నీ జాగ్రత్తగా పరిశీలించి, పరిశ్రమకు అన్వయించాలి.

## పారిశ్రామిక పరిశోధన అవసరం

ఇటువంటిసమస్యలను పరిశీలించడానికే ఇండస్ట్రియల్ లేబొరేటరీ అవసరం. ఇందుకు కావలసిన వసతులు కలిగించని పారిశ్రామిక విధానం సాక్షీగావుండ మంటే యెందుకుంటుంది! మిడిమిడిగా శాస్త్రజ్ఞానం వున్న ఒకళ్లిద్దర్ని పెట్టుకుని (వాళ్లచేత గాడిద పని చెయ్యించి, నాలుగు ముష్టిరాళ్లు యిచ్చి) వాళ్లను పనిచెయ్యండర్రా అంటే లాభంలేదు. సంఘం అవసరాలు తీర్చాలన్నా, పరిశ్రమ బాగుపడాలన్నా యిది తిరపతి మంగలిక్షౌరంలాగా జరపకూడదు.

పారిశ్రామికాధిపతులంగాని, వ్యాపారస్థులంగాని ప్రజలకు వస్తుసమృద్ధి కలిగించడాని కేమైనా పాటుబడ్డారా? శాస్త్రవిజ్ఞానాన్నీ, ప్రకృతిసంపదనూ వినియోగించి దేశాన్ని సుభిక్షం చెయ్యడానికి ప్రయత్నించారా? ఈ ప్రశ్నలకు తప్పనిసరిగా వచ్చే సమాధానం లా కేర్వం, దాకు కొమ్మా!

## రాజకీయవేత్తల బాధ్యత

ప్రజల జీవితాన్ని బాగుచెయ్యడానికీ, పాడుచెయ్యడానికీ సమర్థులైన రాజకీయవేత్తలూ, పారిశ్రామికాధిపతులూ ఉత్పత్తినీ వినియోగాన్నీ వేరువేరుగా కాకుండా ఒకేమొత్తంగా చూస్తే, శాస్త్రసిద్ధాంతాలకూ పారిశ్రామికాభివృద్ధికీ యింత ఎడబాటు కలిగివుండేదికాదు. శాస్త్రపరిశోధనలవల్ల వచ్చే ఫలితాలు వున్న పరిశ్రమలను అభివృద్ధిపరచడమే కాకుండా, యింకా కొత్తపరిశ్రమలను సృష్టిస్తాయి. ఇది చాలా ముఖ్యం.

ఇప్పుడు శాస్త్రజ్ఞుల విజ్ఞానం యెందుకు వృథా అవుతున్నదంటే—అతనికీ, ప్రజల అవసరాలకు పనికి వచ్చే ఉత్పత్తికీ మధ్యవున్న అగాధంవల్లనే.

యంత్రనాగరికత ముందుకు పోతున్నకొద్దీ, శాస్త్రవిజ్ఞానంమీద సామాజికజీవితానికి నమ్మకం హెచ్చుతున్నకొద్దీ, విద్యావిధానంలో తీవ్రమైన మార్పులు రావాలి. అది శాస్త్రీయపద్ధతులపై జరగాలి. శాస్త్రవిజ్ఞానం యెన్నోవిధాలుగా విద్యాభివృద్ధికి తోడ్పడింది. పుస్తకాలు, బొమ్మలు, ఫిల్ములు, గ్రామఫోన్లు, రేడియోలు, వైర్లెస్ మొదలైన వన్నీ విద్యాభివృద్ధికి యెంతో దోహదం చేశాయి. ఇవన్నీ శాస్త్రవిజ్ఞానం కలిగించిన సౌకర్యాలు.

## ప్రజాయత్తం కావాలి

ఇప్పుడు శాస్త్రవిజ్ఞానం ప్రజలను కొల్లగొట్టడానికీ, సామ్రాజ్యాలు పెంచుకోడానికీ వినియోగపడుతున్నది. శాస్త్రవిజ్ఞానం కలిగించిన అవకాశాలను వ్యక్తులు దుర్వినియోగం చెయ్యడంవల్ల కలుగుతున్న దుష్ఫలితా లివి. పరిశ్రమలనూ, ప్రకృతి సంపదనూ వ్యక్తుల చేతులనుండి ప్రభుత్వమే వశపరుచుకుంటే (నిజమైన ప్రజాస్వామిక ప్రభుత్వం వున్నప్పుడే యిది సాధ్యమవుతుంది) ప్రజలూ సుఖపడతారు; శాస్త్రవిజ్ఞానమూ సఫలమవుతుంది.

[ప్రొఫెసర్ హెచ్. లెవీ వ్యాసాన్ని అనుసరించి.]

—సెట్టి ఈశ్వరరావు.

# 'నువ్వు మా అమ్మవికాదు'

[కథానిక]



— శ్రీ చోడవరపు బాబూరావు —

'ఇంతకూ మీ రనే దేమిటి?' అ నడిగింది విశాలాక్షి, భర్త శ్రీధరరావుని. ఆ అడగటంలో కొంచెం దురుసుతనం, ఎప్పుడూ తన కోర్కెకు తిరుగులేనటువంటిది ఈనాడు వుండటంవల్ల కలిగే కోపం వ్యక్త మవుతున్నై.

'నన్ను చూసి కాకపోయినా ఆ పసిగుడ్డుని చూసైనా నీమతం మార్చుకోమంటున్నాను' అన్నాడు శ్రీధర్. అట్లా అనగటంలో కేవలం నిరాశమాత్రమే తొంగిచూస్తున్నది.

'అయితే భర్తకీ పిల్లలకూ సేవచేస్తూ కూర్చోటమే ఆడదాని జన్మకి పరమావధి అనుకుంటున్నారా?'

'నే నట్లా అనుకుంటున్నా, ఇన్నాళ్ల నుంచీ ఇద్దరమూ ఎట్లాగో అట్లా సర్దుకుపోతున్నాం. ఇప్పుడు—'

'ఊ—ఇప్పుడుమాత్ర మేమొచ్చింది?'

'ఆ పిల్లవాడి సంరక్షణసంగతే!'

'దాని కెవరైనా పెట్టుకుందా మని ఇందాకే చెప్పానుగదా!'

'అయితే తల్లీ, తండ్రీ బతికుండికూడా పిల్లవాణ్ణి పరాయివాళ్ల చేతుల్లో—'

'మీ రనేది నాకేమీ అర్థ మవటల్లేదు'

'అవును, నీ కర్థం కాదు, నాకు తెలుసు. నిన్నిట్లా అడగటంవల్ల ఫలితంకూడా శూన్యమని తెలుసు. అయినా, కళ్లైనా తెరవని ఆ పసిగుడ్డుని చూసి అడక్కుండా వుండలేక పోతున్నాను. వాణ్ణి నువ్వెట్లా వదిలిపెట్టి వుండగలవో గాని—' శ్రీధర్ కళ్లు కొంచెం చెమ్మగిలినట్లు అనుమానం.

'మరి నాకంటె ఎక్కువ ప్రేమ వాడియందు మీ కుండటం మరీ విచిత్రం'

'నిజంగా నా కున్నంత ప్రేమకూడా నీకు లేక పోవటం విచిత్రమైన విషయమే.'

'నాపొట్ట నేను పోసుకుంటుంటేకూడా అడ్డుపడే మీ తెలివితక్కువకి నవ్వాలో ఏడవాలోకూడా నా కర్థం గాకుండావుంది'

'నీ కంత అవసరం ఎందుకొచ్చిందో నాకూ అర్థం గావటల్లేదు'

'స్త్రీ భర్తసంపాదనమీద ఆధారపట్టంవల్లనే గదా ఇంత లోకువైంది! భర్త ఎన్ని కొట్టినా తిట్టినా స్త్రీ తన కాళ్లమీద తను నిలబడలేక పోవటంవల్లనే సహించ వలసివస్తోంది'

'అయితే నన్నుకూడా అటువంటి తుచ్ఛుల్లోనే లెఖ్ఖ వేస్తున్నావన్న మాట!'

'నే నలా గనలేదు. స్త్రీకి ఆర్థికంగా స్వతంత్రం వుండా లంటున్నాను'

'మరి పిల్లలగతి యేమవ్వా లని నే నడుగుతున్నాను!'

'ఏం? తల్లి మాత్రమే బాధ్యురాలా?'

'కాదు, ఇద్దరూ బాధ్యులే! ఇద్దరిలో ఏ ఒక్కరు తప్పిపోయినా పిల్లలగతి చెప్పరానిస్థితి కొస్తుంది'

'మీతో ఇక వాదించటానికి నాకు టైంకూడా లేదు. చెపుతున్నా వినండి. మీ కంతగా కావ శ్రయంగావుంటే మీరే సంరక్షించుకుంటారో, దాదినే పెట్టుకుంటారో, ఇంకేం చేసుకుంటారో నా కవసరం లేదు. నేనుమాత్రం స్కూల్ మిస్ట్రెస్ ఉద్యోగాన్ని ఒదులుకోలేను' అని విశాలాక్షి గబగబా స్లిప్పర్సు తొడుక్కుని వీధిలోకి వెళ్లిపోయింది.

ఆమె పోయిన దిక్కు చూస్తూ నుంచుండి పోయాడు శ్రీధర్.

౨

రాఘవరావు రోజూ ఆఫీసునుంచి రాగానే భార్య సుభద్రమ్మ వచ్చి కోటందుకుని ఒంకెన తగిలించటం, కాళ్లుకడుక్కోటానికి నీళ్లూ, మంచినీళ్లూ ఇవ్వటం అలవాటు. ఆ నాడుమాత్రం రాఘవరావు వచ్చేసరికి కొంచెం ఆశ్చర్యం వేసింది. సరాసరి లోపలికి వచ్చి చూస్తే, భార్య ఎవరో చిన్నపిల్లవాడికి అన్నం కలిపి నోట్లో పెట్టటం చూసేసరికి మరింత ఆశ్చర్యం వేసింది. ఆమె ఇటువైపే చూడకుండా ఆపిల్లవాణ్ని లాలిస్తూ, బుజ్జగిస్తూ అన్నంకలిపి నోట్లో పెట్టటం చూస్తే అతనికి నవ్వుకూడా ఒచ్చింది.

ఇట్లా ఎంతసేపో కాకముందే ఆ పిల్లవాడు రాఘవరావుని చూసి, దృష్టి మార్చకుండా ఏకదీక్షగా చూట్టం మొదలుపెట్టేసరికి సుభద్రకూడా వెనక్కు చూసి, చిన్న నవ్వుతో—

'అబ్బాయి మిమ్మల్ని చూసేవరకూ నేనుకూడా చూడలేదు సుమండీ!' అంది.

'ఎవ రా అబ్బాయి?'

'మనింటిపక్క శ్రీధరరావుగారు లేరూ!'

'ఓ—హో! వా ళ్లబ్బాయా! నీదగ్గి రెట్లా మచ్చికైనాడూ? అయినా ఎవరైనా చిన్నపిల్లలు కనిపిస్తే ఒదిలిపెట్టవులే. రోజూ కో టందుకునేదానివి ఇవాళ కనపడకపోయేసరికి నీకూడా "సమాన హక్కుల" వాన సోకైనా తగిలిందేమో అనుకున్నా' అని రాఘవరావు నవ్వితే, సుభద్రకూడా నవ్వింది.

'ఆ, ఏం లేదండి! నేను లేసు కుట్టుకుంటుంటే ఈ అబ్బాయి ఎందుకో గుక్కపట్టి ఏడుస్తున్నట్లు వినపడింది. వాకిట్లోకెళ్లి చూద్దునుగదా, అప్పి-దాదిగావును-దానిచేతుల్లో నిలవకుండా మెలికలు తిరుగుతూ ఏడుస్తున్నాడు. దాన్ని పిలిచి అబ్బాయిని రమ్మని చేతులు చాపేసరికి ఒక్కక్షణం చూసి చేతుల్లోకి దూకాడు. చూడండి, ఎట్లా ముద్దులు మూటకడుతున్నాడో!' అని ఒక్కసారి బుగ్గలు నిమిరింది.

'మరే, ఆయనభార్య ఈ అబ్బాయిసంగతేమీ పట్టించుకోదనుకుంటాను'

'ఆ దేమిటండీ? ఎక్కడో మేస్టరీ చేస్తున్నదటగా! పిల్లాణ్ని పరాయిచేతుల్లో పెట్టి తను ఉద్యోగం చేస్తూ వూరూరూ తిరుగుతుందా యేమిటి?'

'సరే, మన మిట్లా అనుకుంటూంటామా! ఆయన భార్యయేమో స్త్రీలుకూడా పురుషులవల్లే రొండు కుండకూడదు, ఇద్దరికీ సమానమైన స్వేచ్ఛ వుండాలి — అని ఈ విధంగా చెబుతుందిట'

'సరే. ఏం చెబితే మనకేం గాని, కాస్సేపట్లో చూడండి, ఎంతచనువైనాడో! ఇందాకా 'ఆ విశాలాక్షమ్మగారు వచ్చారు, పిల్లవాణ్ణివ్వ'మని దాది ఒస్తే, అబ్బాయి దాదిదగ్గరకు వెళ్లలేదుసరికదా, నన్ను గట్టిగా కావిలించుకుని ఏడవటం మొదలెట్టాడు!'

'ఇంకేం, నీకూడా పిల్లల్లేని విచారం తీరిపోయిందిలే. సరే, అబ్బాయిధోరణిలో పడి, మొగుడనేవా డొకడున్నా డన్నసంగతే మరిచిపోయినా వల్లే వుందే. ఇందాకనంగా ఒస్తే మంచినీళ్లు కావాలనైనా అడగలేదు!' అనేసరికి నవ్వుతూ సుభద్ర పిల్లవాణ్నెత్తుకునే వంటింట్లోకి పోయింది.

౩

కలెక్టరాఫీసునించి శ్రీధరరావూ, గరల్సు స్కూలునించి విశాలాక్షీ ఒక్కసారే ఒచ్చారు. ఒచ్చి

గుమ్మంలో తారసిల్లారు. ఇల్లు తాళం వేసి వుంది. అయితే తాళంచెవి ఒకటి శ్రీధర్ దగ్గిరా, ఒకటి విశాలాక్షిదగ్గిరా వుండటంవల్ల ఇబ్బం దేమీ కలగటంలేదు. శ్రీధర్ తాళం తీసి లోపలికి వెళ్లాడు. విశాలాక్షికూడా సరాసరి లోపలికి వెళ్లిపోయింది.

స్లిప్పర్లు విడిచి, దారి కాఫీహోటలునుంచి తెచ్చిన కాఫీ ఫ్లాస్కులోంచి కప్పులోకి ఒంచి తాగుతూండగా, భర్త వాకిట్లోంచి ఎవర్నో పిలుస్తున్నట్లు వినపడింది విశాలాక్షికి. ఎవర్నా అన్నట్టు అటు తిరిగేసరికి, శ్రీధర్ అప్పిని కేకేస్తున్నాడు. కాసేపట్లో అప్పి వచ్చి పిల్లవాణ్ని శ్రీధర్‌కి అందించింది. శ్రీధర్ పిల్లవాణ్ని కాసేపు ఎత్తుకొని, ముద్దులాడి, మళ్లా అప్పికి ఇచ్చేశాడు. అది పిల్లవాణ్ని తీసుకుని వెళ్లిపోగానే శ్రీధర్ లోపలికి వచ్చేశాడు.

ఇదంతా చూసిన విశాలాక్షికి మనస్సులో ఎలాగో అనిపించింది. మొట్టమొదటిరోజుల్లో పిల్లవాడు కనపడకపోయినా విశాలాక్షి అంత పట్టించుకోలేదు. తరవాత కొన్నాళ్లకి పిల్లవాడసలు కనపడకపోయేసరికి అప్పి నడిగింది. అది, పక్కయింటి సుభద్రమ్మతో ఆడుకుంటున్నాడని చెప్పింది. మెదలకుండా వూరుకుంది విశాలాక్షి. కాని ఇవాళ భర్త చేసిన పనేమిటి? ఇవాళేనా, రోజూ ఇంతేనా? శ్రీధర్ మీద అమితమైన కోపం వచ్చింది విశాలాక్షికి.

'అక్కడికి పిల్లవాడు నా కేమీ కానట్టూ, తనకే కొడుకైనట్టూ! ఓయబ్బో, ఇంతమాత్రంచేత నాకన్నా యెక్కువని అనుకుంటున్నారు కాబోలు' అని రుసరుసలాడుకుంటూ కాఫీకప్పు అక్కడే వదేసి, వాకిట్లోకి వెళ్లి 'అప్పీ! అప్పీ' అని పిలిచింది.

వినపడకపోవటంవల్ల అప్పి మొదట పలకలేదు. తరవాత వినపడేసరికి 'ఆ!' అని ఒక్కగంతులో వచ్చింది.

'ఎక్కడున్నావ్?'

'సుభద్రమ్మగారింట్లో'

'ఎప్పుడూ అక్కడే వుండమని ఎవరు చెప్పారు నీకు? పిల్లవాడేడీ?'

'ఆ అమ్మగారిదగ్గర్నే వున్నాడండి'

'అట్లాగా! ఆ అమ్మగారి కున్నంత ప్రేమ కూడా నాకు లేకపోయిందేం! అంత వూళ్లోవాళ్లు చేరదీసి పెంచవలసిన స్థితి ఇంకా అబ్బాయికి రాలేదని చెప్పు, పో, ముందు అబ్బాయి నిట్లా తీసుకురా'

అప్పి వెళ్లింది.

తనకు భర్తమీద వచ్చిన కోపం, అప్పిమీద వచ్చిన కోపం, చివరికి సుభద్రమ్మమీద వచ్చిన కోపం-వీటన్నిటికీకూడా కారణం కొడుకుమీది ప్రేమేనని ఆమెకు తెలీదు. బయటికి కనపడకపోయినా, తాను ఎంత చంపుకోటానికి ప్రయత్నించినా ఇంకా ఏమూలో దాగివున్న పుత్రప్రేమే ఈ భర్తమీదా, తక్కినవాళ్లమీదా కోపంగా పరిణమించిందని ఆమె గ్రహించలేకపోయింది.

అప్పిని చివాట్లు పెడుతున్నప్పుడు విన్న సుభద్రమ్మ, అది మళ్లా అబ్బాయికోసం రాగానే, 'ఇదుగోనే' అని ఒక్కసారి గట్టిగా పిల్లవాణ్ని ముద్దుపెట్టుకుని ఎందుకో కంట తడితో పిల్లవాణ్ని అప్పికిచ్చేసింది. మొదట్లో సుభద్రమ్మ చంకలోంచి ఎంత గుంజినా పిల్లవాడు రాలేదుగాని, తరవాత తప్పనిసరిగా ఏడుస్తూ అప్పిదగ్గరకు వెళ్లాడు.

## ౪

'ఇవాళ అబ్బాయెక్కడా కనపళ్లేదేమే!' అ నడిగాడు రాఘవరావు ఆఫీసునించి రాగానే.

'వాళ్లసలు వూళ్లో లేరు. ట్రాన్స్ఫరయిందిట'

'ఎవరికి?'

'శ్రీధరరావుగారికి. ఆ దేదోవూరు ట్రాన్స్ఫరయిందనీ, విశాలాక్షికూడా ఆ వూరే ట్రాన్స్ఫరయిందనీ, వాళ్లంతా ఆవూరే వెడతారనీ నిన్న అప్పి చెప్పింది.'

'అట్లాగా—' అని వూరుకున్నాడు రాఘవరావు.

'ఇవాళేమీ తోచటల్లేదు, చూశారో లేదో!'

'నిజమే'

'మధ్యాహ్నం అన్నంకూడా సయించలేదు. అబ్బాయిని దగ్గిర కూచోపెట్టుకుని అన్నం తినేదాన్ని రోజూ. ఇవాళకూడా మామూలుగానే అన్నం కలిపి ముద్దచేసి అబ్బాయి పక్కనున్నాడనుకుని పెట్టబోయాను. మళ్లా జ్ఞాపక మొచ్చింది.'

'నేను మొదట్లోనే చెప్పలేదూ, అంతగా అలవాటు చేసుకుంటే తరవాత మనకే కష్ట మని?'

'సరే, ఇప్పు డిట్లా అంటున్నారుగాని మీరు మాత్రం ఇంట్లో వున్న కాసేపూ అబ్బాయిని ఒదిలి పెట్టేవారా యేమిటి? ఎప్పుడూ దగ్గిర కూచోపెట్టుకుని కబుర్లు చెప్పేవారుకదూ?'

'ఏమోగాని, అయినా, నీఅంత అలవాటు లేదు నాదగ్గిర'

'లేకేం! అబ్బాయి లేకపోతే మీకుమాత్రం దిగులుగా లేదూ? ఎప్పుడూ ఏదో పరధ్యానంగా వుండటం—!'అదోమాదిరిగా చూసింది సుభద్ర భర్తవైపు. ఆమె అన్నమాట నిజమైనా, ఓ ఆడదానికిమల్లే తనుకూడా దిగులుపడ్డానని ఒప్పుకోవటం చిన్నతనంగా తోచిం దతనికి.

'అబ్బే—పరధ్యానం లేదూ ఏమీలేదు' అని తప్పించుకున్నాడు.

'సరేగాని, ముందు స్నానం చెయ్యండి, తరువాత మాట్లాడుకోవచ్చు' అని సుభద్రమ్మకూడా ఆచర్చ అంతటితో ఒదిలేసి నీళ్లు తోడటానికి దొడ్లోకి వెళ్లింది.

కాని సుభద్రకు మనస్సంతా ఆ పిల్లవాడిమీదే వుంది. రాఘవరావుకు భోజనం వడ్డిస్తూ—

'నే నోమాట చెపుతాను వింటారూ?' అన్నది.

'ఏమిటి?' అన్నట్లు తల పైకెత్తి చూశాడు రాఘవరావు.

'పోనీ—మీరుకూడా ఆవూరు ట్రాన్స్ఫరు చేయించుకోరాదూ?'

'నీ చాదస్తంగాని, ఎవరిపిల్లాడికోసమో ఇంత అలమటించిపోవట మేమిటి? వాళ్లున్నచోటల్లా మనం వుండటం సాధ్యపడుతుందా? ఇహ మన జన్మ కింతే ననుకుని వూరుకోవటంతప్ప మరేదారీ లేదు'అని చెబుతుంటే రాఘవరావుస్వరం గద్గదికమైంది. సుభద్రమ్మ కళ్లల్లోంచి నీటిబొట్లు జారినై.

'ఏమైనాగానీ ఆ అబ్బాయిని చూడందే వుండలేనండీ! 'అమ్మా, అమ్మా'అంటూ చేతులు జాపుతూ పరిగెత్తుకొచ్చేవాడు!'

'నువ్వు విన్నావో లేదోగాని, నన్ను 'నాన్నా' అనికూడా పిలవటం మొదలెట్టాడు. నేనే ఓసారి,'తప్పు నాయినా, నేనుకాదు మీ నాన్నని' అంటే, 'కాదు, నువ్వే మానాన్నవి' అని, అవు నవేవరకూ ఒదిలి పెట్టాడుగాదు.'

'నాకు తెలీదుటండీ! అసలా అబ్బాయిని మొదట్నుంచీ తల్లి చేరదియ్యకపోవటంవల్ల ఇంతవర కొచ్చింది.'

'పోనీ, తల్లి గాకపోతే తండ్రిమాత్రం చేరదియ్యగూడదూ?'

'అయ్యో, మీకు తెలీదుగావును! ఆయనకి మహాఅపేక్ష అబ్బాయంటే. రోజూ ఆఫీసునుంచి రాగానే ఇక్కణ్నుంచి అప్పిని, అబ్బాయిని తీసుకు రమ్మని పిలిచి, కాసేపు ఎత్తుకు తిరిగేవాడు.'

'ఆ విశాలాక్షమ్మ అస లెప్పుడూ పిలవనన్నా పిలవదల్లే వుందే?'

'పిలవనూ పిలవదు, పిలిచినా దగ్గిరికి వెళ్లనూ వెళ్లడు పిల్లవాడు. భగవంతుడు, కావాలో కావాలో అనుకునేవాళ్ల కివ్వకుండా—'ఇహ మాట్లాడలేకపోయింది సుభద్రమ్మ. రాఘవరావుకూడా చేతులో ముద్ద నోట్లో పెట్టుకోలేక విస్తట్లోనే వదిలేసి కూర్చున్నాడు.

అట్లా ఇద్దరూ రెండు నిముషాలపాటు మాటామంతీ లేకుండా కూచున్నతర్వాత—

'సరే, ఇప్పు డూరికే విచారిస్తే యేంలాభం? కాసిని మజ్జిగ—' అనగానే సుభద్రమ్మ పమిటచెంగుతో కళ్లు తుడుచుకుంటూ మజ్జిగ కాసిని పోసి—

'అయ్యో—నా మందమతి కాల! మాటల సందట్లో పడి మీకు పులుసొయ్యటం మరిచేపోయా' నంటే—

'నా కసలు సరిగా ఆకలి లేదులే. మజ్జిగే పొయ్యి' అని కాస్తఅన్నం తిని చెయ్యి కడుక్కున్నాడు.

రాఘవరావు లేచింతర్వాత సుభద్రమ్మకూడా ఏదో భోజన మయిందంటే అయిం దనిపించుకోటానికి మాత్రం కాస్త ఎంగిలిపడి మూతి తుడుచుకుంది.

౫

'అబ్బాయిగారికి ఒళ్లు కొంచెం వెచ్చగా వుందండీ' అని చెప్పింది అప్పి, విశాలాక్షి ఇంటికి రాగానే.

విశాలాక్షి పిల్లవాణ్ని దగ్గరికి తీసుకోబోతే వాడు కవ్వుమని గావుకేక పెట్టి అప్పికంఠం గట్టిగా బిగించి ఏడవటం మొదలెట్టాడు ఇటు చూడకుండా. విశాలాక్షి పిల్లవాడి ఒంటిమీద చెయ్యేసి చూస్తే ఒళ్లు మండిపోతున్నట్లు కనిపించింది.

'కాస్త వెచ్చగా వుండటమేమిటే? మసిలి పోతుంటేనూ! అయ్యగా రింకా రాలేదూ—' అ మాట అంటూ కొంచెం నాలుక కొరుక్కుంది.

'ఒచ్చి అబ్బాయిగారిని చూసి డాక్టరుగారి కోసం వెళ్లారు' అన్నది అప్పి.

విశాలాక్షిమనస్సు పరిపరివిధాల పోయింది. పిల్లవాడి ఒంటిమీద చెయ్యి వేస్తే తన చేతికి తగిలిన వేడి తన నరనరానికీ వేడి కలిగించింది. ఆమె ఒళ్లంతా ఒక్కసారి జలదరించింది. మళ్ళా ఓసారి పిల్లవాణ్ని దగ్గరకు తీసుకోబోతే, రాక్షసిని చూసినట్లు కేక వేసి ఏడవటం మొదలుపెట్టాడు.

ఇంతలో శ్రీధర్ డాక్టరుతో సహా ప్రత్యక్ష మైనాడు. డాక్టరు పిల్లవాడి చెయ్యి చూసి, 'జ్వరం ఎప్పట్నుంచీ?' అనడిగాడు.

'ఎప్పట్నుంచీ ఎక్కడండీ? నిన్ననే ఈ వూళ్ళో దిగాం. రాత్రి కొంచెం నలతగా వుంటే ఏదో ప్రయాణంవల్ల ననుకున్నాం. ఇవాళ జ్వరం పేలిపోతూ ఒచ్చేసింది.'

'అట్లాగా! అయితే అక్కడ అబ్బాయి ఎవరి దగ్గిరైనా బాగా చనువుగా వుండేవాడా?'

శ్రీధరరావు విశాలాక్షివైపు చూశాడు. విశాలాక్షిమాత్రం ఇటువైపు చూట్టంలేదు. ఏదో దీర్ఘంగా ఆలోచిస్తోంది.

'అవునండి'

'అయితే వాళ్ని పిలిపించటంకన్న మంచి వుపాయం మరొకటి లేదు. శరీరంలోమాత్రం జబ్బు రాదగిన లోటేమీ కనపట్టంలేదు' అని వెళ్లిపోయినాడు డాక్టరు. ఆయన ఇదివర కిటువంటి కేసులు చాలా పట్టినవాడే.

'డాక్టరు చెప్పిందంతా విన్నావా?' అన్నాడు శ్రీధర్.

'ఆ—'

'ఇప్పు డేం చెయ్యాలి?'

'చేసే దేముంది? అయినా అస లా సుభద్రమ్మ దగ్గిర వా ణ్నెందు కలవాటుచెయ్యాలి?'

'ఎటొచ్చీ నామీదికే ఒస్తావే! అయినా ఒహ రలవాటుచేసే దేమిటి?'

'అప్పి వాణ్ని ఆవిడదగ్గరికి తీసికెడుతుంటే మీ రెందు కూరుకోవాలి?'

'అయితే వూరుకోకూడనివాణ్ని నేనే నన్న మాట.'

'మీ చేతులారా మీరే ఇచ్చి పంపుతుంటే నేను లక్షమార్లు చూశాను.'

'చూసినప్పుడు నాదగ్గర్నుంచి నువ్వే లాక్కు లేకపోయినావూ? ఇదుగో! చెపుతున్నా విను. అనవసరంగా కంఠశోష పడినంతమాత్రాన లాభం శూన్యం. మాతృహృదయం పసిపిల్లలు బాగా గుర్తిస్తారు. ఆ సుభద్రమ్మకు పిల్లల్లేకపోయినా ఆవిడలో వున్న మాతృత్వమే, దానికి వాచిపోయిన మన పిల్లవాణ్ని ఆకర్షించింది తెలుసా?'

పూచలాగ తెగిలింది విశాలాక్షి కేమాట. కీచుమని పోయింది ఒక్కసారిగా. మనస్సంతా కలిచేసిన ట్లయింది. సమాధానమేమీ చెప్పక తిరిగి వెళ్లిపోయింది.

మర్నాడు పిల్లాడికి జ్వరం మరింత హెచ్చి, కలవరింతలతో సహా వచ్చింది. విశాలాక్షి పిల్లాడిదగ్గరికి వచ్చేసరికి, 'అమ్మా' అని కలవరిస్తున్నాడు.

'ఏం కావాలి నాయినా?' అంది విశాలాక్షి.

'అమ్మ కావాలి'

'ఇదుగో! నేనే అమ్మని, ఇటు చూడు.'

పిల్లవాడు ఇటు చూసి, కళ్లు మూసుకుని ఏడుస్తూ, 'నువ్వు కాదు మా అమ్మని.' అమ్మే కావాలి' అని మూలగటం మొదలెట్టాడు.

భార్యాభర్తలు ఒకరి మొహం ఒకరు చూసుకున్నారు. ఇంతలో డాక్టరొచ్చి మందిచ్చి—

'వారికి రమ్మని వుత్తరం రాశారా?' అన్నాడు.

'ఎవరికి?'

'పిల్లవాడి కెవరిదగ్గిరో చను వెక్కువన్నా లే?'

'లే—దు' అన్నాడు శ్రీధర్ తల వంచుకుని.

'మీకు అబ్బాయి బతకటం ఇష్టం లేనట్లుంది!'

శ్రీధర్ బాధ భరియించ లేకచేత్తో హృదయం గట్టిగా నొక్కుకున్నాడు.

'చూడండి! నే నిట్లా అంటున్నానని మీ రేమీ అనుకోవద్దు. ఇప్పటికైనా మించిపోయిందేమీ లేదు. తక్షణం టెలిగ్రా మివ్వండి. నామందులుమాత్రం ఏమీ పని చెయ్యవని ఇప్పుడే చెబుతున్నా. మీ యిష్టం' అని వెళ్ళిపోయినాడు.

మళ్ళా ఒకరి మొహం ఒకరు చూసుకున్నారు భార్యాభర్తలు!

'బాబుగారూ! నామాట విని టెలిగ్రా మివ్వండి. పిల్లవాణ్ని చేతులారా ఎందుకు చంపుకుంటారు!' అన్నది అక్కడే వున్న అప్పి.

౬

'రాత్రి ఏమిటో చాలా చెడ్డ కలొచ్చిందండీ' అన్నది సుభద్ర భర్తతో.

'నీ కెప్పుడూ ఏదో ఒకటి వస్తూనే వుంటుంది.'

'అట్లా కాదండీ. ఇవాళ మన సెట్లాగో వుంది. అబ్బాయిని చూసి ఎన్నాళ్లో అయింది.'

'అయితే ఇప్పు డక్కడకు తీసుకుపొమ్మంటావా యేమిటి?'

'వెళ్లి ఒక్కసారి చూసొద్దాం.'

'నీ కేమైనా పిచ్చా? ఇందుకోసం తీరా పని కట్టుకు వెడితే వాళ్లేమైనా అనుకుంటారేమో నసైనా ఆలోచించవేం?'

'ఏమీ అనుకోరు' అని మునినాలుకమీదినించి అన్న దేకాని ఆమెక్కూడా మనస్సులో అనిపించక పోలేదు. కాని పిల్లవాణ్ని చూడాలన్న కాంక్ష ఆమెలో వున్న ఆ అనుమానాన్ని కప్పేసింది.

'ఏదో చెడ్డ కలొచ్చినంతమాత్రాన ఇట్లా రాద్ధాంతం చేస్తా కొర్చుంటే యెట్లా? ఇప్పుడు మనం వెళ్లాలంటే మాటలా? నాకు సెలవు దొరకటం ఓ దుర్లభం. ఇంతకీ ఏమి టాకల?'

'అబ్బాయి నెవరో రాక్షసు లెత్తుకుపోతున్నారుట. అమ్మా అమ్మా అని యేడుస్తూ అబ్బాయి రానంటున్నాడుట. విశాలాక్షమ్మ అందుకోబో తే రాక్షసులు వదల్లేదుట. ఇంతలో నేనే వెళ్లాను. అబ్బాయి వస్తానని యేడుస్తున్నాడు. వెంటనే మెలకువ వచ్చేసింది.'

'స—డేలే. ఇటువంటి కల లెప్పుడూ వస్తూనే వుంటాయి. నాకుమాత్రం రావూ అప్పుడెప్పుడూ! రాత్రి నాకూ ఇటువంటిదే ఓ కలొచ్చింది. ఇహ కలొచ్చినప్పుడల్లా ఏదో వూరికి పనిగట్టుకుపోవాల్నం!' అని ఏదో అంటున్నాడేగాని రాఘవరావు మనస్సుకూడా ఇక్కడ లేదు. రాఘవరావు సుభద్రమ్మని చూస్తే ఆమెకళ్లంట నీళ్లు కారినట్టు కనిపించింది. సుభద్రమ్మ రాఘవరావుని చూసి అతని మనస్సుకూడా పూర్తిగా చదివేసింది.

అక్కణ్ణుంచి వెంటనే లేచి, భుజం తట్టుకు వూపుతూ—

'తప్పకుండా వెడదామండీ! ఇట్లా వస్తున్నామని ఓ వుత్తరం రాసిపడేసి ఇవ్వాళే బయల్దేరదాం'

అంటుండగా ఎవరో ఎర్రసైకిలుమీద వచ్చి వాకిట్లోంచి కేక వేశారు. రాఘవరావు గబగబా వెళ్ళి చూస్తే పోస్టుజవాను!

'టెలిగ్రాం, సంతకం' అంటూ ఓకవరు అందించాడు. రాఘవరావు వణికే చేతుల్తో గబగబా సంతకం పెట్టి కవరు విప్పి చదివాడు:

'అబ్బాయి మరణశయ్యపై వున్నాడు. ఉన్నపాటుగా బయల్దేరిరావలసింది'

౭

'అమ్మా—అమ్మా'

'ఇదుగో నాయినా—ఇక్కడే వున్నా'

కళ్ళు మెల్లిగా తెరిచి ఆమెవంక చూసి వులిక్కిపడి యేడవటం మొదలెట్టాడబ్బాయి.

'నువ్వు కాదు మాఅమ్మవి. నువ్వు దెయ్యానివి, అమ్మ కావాలి' అని యేడవటం మొదలెట్టాడు.

'ఇదుగో—నిన్ను చూస్తేనే పిల్లవాడు భయపడిపోతున్నాడు. ముందు నువ్వవతల కెళ్ళు'అని శ్రీధరరావు వచ్చి పిల్లవాడిమీద చెయ్యివేసి దగ్గరగా కూర్చున్నాడు.

తనను చూస్తేనే పిల్లవాడు భయపడిపోతున్నాడు! విశాలాక్షమ్మకు తనను నుంచోబెట్టి నిలువునా దహించివేస్తున్నంత ఆవేదనగా వుంది. తన కొడుకు తనను చూసి పెద్దపులిని చూసినట్లుగా భయపడుతున్నాడు! తనేనా దీని కంతటికీ కారణం? 'నువ్వు మాఅమ్మవు కాదు'అని పిల్లవాడు కలవరించటంలో ఎంతఅర్థం ఇమిడివుంది? ఆ అర్థం ఆ అబ్బాయికే తెలిసినంతగా తనింకా తెలుసుకోలేకపోతోంది.

'అమ్మా—అమ్మా'

'అమ్మ ఇప్పుడే ఒస్తుంది యేడవకమ్మా'

'నువ్వు మాఅమ్మవు కాదు. దెయ్యానివి. నాకు అమ్మ కావాలి'

'దెయ్యం అవతల కెళ్ళిపోయిందిలే నాయనా. చూడు, నేను నాన్నని'

ఏడవకుండా కళ్ళుమూసుకుని పడుకున్నాడు పిల్లవాడు.

త నెంతదూరంగా వుంటే పిల్లవాడి కంత నిర్భయం, నిర్విచారం! తను తల్లికాదు, దెయ్యం! పిల్లవాడి కీ సంగతులన్నీ ఎవరు చెప్పారు? తనే చేతులారా ఇంతవరకూ తెచ్చింది! పిల్లాడి కింతవరకూ రావటానికి కారణం తనే! తనుండగా అబ్బాయి బతికి బయటపడతాడా? యేమో!

ఇహ సహించలేకపోయింది విశాలాక్షి. ఇంతవరకూ అణిచిపెట్టుకున్న దుఃఖం పొర్లి పోయి వెల్లువలై ప్రవహించసాగింది. కళ్ళు రెండుచేతుల్తోనూ మూసుకుని బిగ్గరగా ఏడవటం మొదలెట్టింది.

'ఏమి టా యేడుపు? అంతా క్షీఅయిపోయింతర్వాత ఇప్పు డేడిస్తే యేం లాభం? పైగా పిల్లవాడు భయపడి పోతాడు. వూరుకో'

చప్పున కళ్ళు తుడుచుకొని వూరుకుంది.

'వా ళ్లీ పాటికి ఒస్తారంటారా?' అనడిగింది భర్తని మెల్లాగో.

'వున్నపాటుగా బయల్దేరి రమ్మని టెలిగ్రాం యిచ్చాను. వెంటనే బయల్దేరితే ఈపాటికో ఇంకాసేపటికో రావలసుంటుందిమరి'

'నేను రాను—నేను రాను—అమ్మని చూసొస్తా—అమ్మోయ్' అని కేకపెట్టి మంచంమీదినించి కింద పడబోయాడు పిల్లవాడు. గట్టిగా పట్టుకున్నాడు శ్రీధరరావు.

విశాలాక్షికూడా పిల్లవాడిదగ్గిరికి పోబోయింది కాని, తను దగ్గిరికి వెడితే, ఎప్పుడో పోవలసిన ప్రాణం వెంటనే పోతుందేమో నని వెళ్ళలేదు. ఇంతలో వాకిట్లో బండి ఆగిన చప్పుడు. రాఘవరావూ, సుభద్రమ్మా బండిలోంచి దిగారు. సుభద్రమ్మ కళ్ళన్నీ వాచివున్నై.

సుభద్రమ్మ రాగానే ఏమీ మాట్లాడకుండా సరాసరి అబ్బాయిపడుకున్న మంచందగ్గిరికి వెళ్ళి పిల్లవాడిమీద చెయ్యేసింది. అబ్బాయి వులిక్కిపడి, 'అమ్మకావాలి—అమ్మకావాలి' అని కలవరించాడు.

'అమ్మ ఒచ్చింది నాయినా! చూడు, అమ్మ, నాన్న ఒచ్చారు అరుగో'అని శ్రీధరరావు సుభద్రమ్మనీ, రాఘవరావునీ చూపించాడు.

పిల్లవాడు ఒక్క క్షణం సుభద్రమ్మవైపు చూసి, 'అమ్మ'అంటూ కంఠానికి రెండుచేతులూ పెనవేశాడు, చెట్టుకొమ్మకి అంటిపెట్టుకున్న గాలికి అల్లలాడే తీగకి మల్లే.

అబ్బాయిని అట్లాగే పట్టుకుని సుభద్రమ్మ కన్నీళ్లు కారుస్తోంది. ఆదృశ్యాన్ని చూస్తున్న విశాలాక్షికి మరో లోకంలోకి తేలిపోతున్నట్లనిపించింది. ఆ దృశ్యం పూర్తిగా హృదయంలో హత్తుకుపోయింది.

౮

అబ్బాయికి సుభద్రమ్మ కనపట్టం రేమిటి, జ్వరం జారిపోవటమేమిటి—రెండూ ఒక్కసారే జరిగిపోయినై. మర్నాడు మామూలుగా మాట్లాట్టం, మూడోనాటి కల్లా లేచితిరగటం మొదలెట్టేసరికి అందరి మనస్సులూ కుదుటపడ్డయ్.

డాక్టరు వచ్చి ఒకసారి చూసి, 'ఇహ నా అవసర మేమీ లేదు'అని వెళ్లి పోయాడు.

'అమ్మ! అమ్మ! ఇహెప్పుడూ నన్నొదిలి పెట్టి వెళ్లవుకదూ!' అని కొంగుపట్టుకుని విడిచిపెట్టకుండా సుభద్రమ్మవెంటే తిరగటం మొదలెట్టాడు పిల్లవాడు.

రాఘవరావుకు సెలవైపోయింది. ఆరోజు బయల్దేరివెళ్ళకపోతే వుద్యోగానికి నీళ్లొదులుకోవాలి. తీరా వెడితే అబ్బాయి మళ్లీ మంచంలోపడి, తిరిగీ బయటపడతాడన్న నమ్మకం లేదు. ఇదో పెద్దసమస్య అయి కూర్చుంది అందరికీ!

'అబ్బాయిని కొన్నాళ్లదాకా మాదగ్గిరే వుంచుకుంటాం. ఇప్పుడే ఒదిలిపెట్టివెడితే చాలాప్రమాదం'అని ఓనాడు సుభద్రమ్మ విశాలాక్షితో అంటే, విశాలాక్షికి మనస్సు చివుక్కుమంది. తన సొత్తు, తన రక్తమాంసాలు ఎవరో లాక్కుడుతున్నట్టనిపించిందామెకు. మరి కర్తవ్యం?

'నామాట విని మీరుకూడా మావూరే బదిలీ చేయించుకోండి. చక్కగా అంతా అబ్బాయిని చూస్తూండొచ్చు' అన్నది సుభద్రమ్మ. కొంచెం సంతోషం కలిగింది విశాలాక్షికి.

ఆ సాయంకాలమే రాఘవరావూ, సుభద్రమ్మ బయల్దేరివెళ్ళిపోయే రోజు. పిల్లవాడు ఆరోజల్లా సుభద్రమ్మచెంగుపట్టుకుని 'అమ్మ అమ్మ'అంటూ విడవనే లేదు! ఇహ తప్పనిసరిగా పిల్లవాణ్ణి పంపవలసొచ్చింది.

అంతా బండెక్కబోయే సమయానికి విశాలాక్షి దుఃఖం పట్టలేకపోయింది. పిల్లవాణ్ణి గట్టిగా కావలించుకుని—

'ఎక్కడికి కెడతావు నాన్నా! నేను మీఅమ్మని కాదూ'అని కళ్ళవెంట బొటబొటా నీళ్లు పడుతుండగా అడిగింది.

'కాదు, నువ్వు మాఅమ్మవికావు, దెయ్యానివి. నేనిక్కడుండను. మాఅమ్మదగ్గిరికే పోతా'అని యేడుపు సాగించాడు పిల్లవాడు.

పిల్లవాణ్ని ఒదిలిపెట్టేసి లోపలి కెళ్లిపోయింది విశాలాక్షి.

శ్రీధరరావు వారిని సాగనంపి ఒచ్చిచూస్తే విశాలాక్షి దిండుమీద పడుకుని వెక్కివెక్కి యేడుస్తోంది.

'చేతులారా చేసుకుని ఇప్పు డేడుస్తావేం? చేసుకున్నంతా అనుభవించొద్దూ? నీ వుద్యోగం, స్వయంపోషకత్వమే ఆలోచించావుగాని, ఒక్కసారయినా పిల్లవాణ్ని దగ్గిరికితీసిన పాపాన పోయినావా? వాడు మనకు పుట్టనేలేదని అనుకుని గుండె రాయిచేసుకో.' అంటూ వెళ్లిపోయినాడు.

మర్నాడు శ్రీధరరావు ఆఫీసునించి ఒచ్చేసరికి విశాలాక్షి అతని దగ్గిరికి వెళ్లి మెల్లగా కాలరు సద్దుతూ—

'మీరు ఆవూరే బదిలీచేయించుకోండి' అన్నది.

'మరి నీ వుద్యోగం?'

'రాజీనామా ఇవ్వాలే అందకేగాను' అన్నది విశాలాక్షి.

# వృత్తపత్రికా రచనము: వాఙ్మయము



'కు మా ర దే వ'

ఆంగ్లమున 'నవల'- రచయితలలో సుప్రసిద్ధకవి ఆర్. యల్. స్టీవెన్సన్ ఒకప్పుడు నిర్ధనుడై యుండెను. దారిద్ర్యబాధ ననుభవింపలేక అత డప్పుడు సాన్‌ఫ్రాన్సిస్కో నగరమునకు బలాయన మొనర్చి యం దొకానొక వార్తాపత్రికా కార్యాలయమున నొక చిన్న 'విలేఖరి' యుద్యోగము సంపాదింప గలిగెను. తొలినాడే అతనికి నాటి సాయంకాలము జరిగిన ఆ యూరి సాల్వేషన్ ఆర్మీవారి సమావేశ మొక దానిని గూర్చి వ్రాయు పని కలిగెను. "కృతజ్ఞతా ప్రకటన వార్షికోత్సవము" అని యా సమావేశమునకు పేరుంచి యా సందర్భమున నూరిలోని బీదసాదలకు 'సమారాధనముజరిపించిరి. విందునకు బలువిధములవారు విచ్చేసిరి. బంతులు యథేచ్ఛముగా సాగుచుండునప్పు డందు గూర్చున్నవారి నెల్ల స్టీవెన్సనుకవి తదేకదృష్టితో గమనించి యా పేద లెట్లు భుజించిరో, యప్పుడు వారి వదనము లెట్లుండెనో, వారిలో నెందరు నిజముగ దారిద్ర్య దేవతాహతులో, ఎందరు సంఘమూష్యులై భిక్షాటనశరణ్యులైయుండిరో, ఎందరు చారిత్రముగ నధఃపతితులై యీ పరిస్థితికి వచ్చిరో, ఎందరు దుర్మార్గాచరణులు ప్రస్తుతమందున దలదాచుకొని కాలలు గొల్లలుచేయ సమయము వేచియుండిరో మొదలగు విషయములను పాఠకుల గుండెలు కరగునట్లును, వారిపట్ల సంఘ మెంత సానుభూతి జూపవలసిన ధర్మము గలిగియుండెనో విశదీకరించి, దారిద్ర్యదేవతా పరిపీడనా నివారణమార్గ సూచకముగ నొక చక్కని నివేదికను రచించి పత్రికోపసంపాదకునకు సమర్పించెను. ఆ నివేదిక యొక్క మానవ తత్త్వ నిరూపణ పత్రముగ నుండెను. కాని యా పత్రికా కార్యాలయములోని నగరవృత్తాంతసంబంధోపసంపాదకుడు మాత్రము దానిని తన కమికిట నలిపి బుట్ట దాఖలుచేసి, స్టీవెన్సను కవి నెగాదిగ జూచి "ఎవ్వ రయ్యా నిన్నీ పనికి పెట్టినది? ఇందు వార్త లేమున్నవి? ఎందరు అతిథులు వచ్చిరి? అది వ్రాయలేదు. ఆ సమావేశము జయప్రదముగ జరుగుటకు గారణు లగు పౌర ప్రముఖు లెవ్వ రెవ్వరు విజయము చేసినారు? అది నీవు చెప్పలేదు. ఏయే సాల్వేషన్ ఆర్మీ యుద్యోగు లందు పాల్గొన్నారు? ఆసంగతి ప్రస్తావింపలేదు. ఇంత ముఖ్యమైన సంగతులను నీవు వ్రాయలేదు. నీవు నొక పత్రికా నివేదకుడ వగుదువా? నీవు వేఱు ఏ పనికైన బోవుట మంచిది" అని యీసడించి, సలహానిచ్చినాడు.

ఈ పై కథయందు నిజ మెంత కలదో దానితో మనకు బనిలేదు. వర్తమాన పత్రికాయుగమున నీ గాథలోని యంశములను మన మొక యుపమాన కథగా మాత్రము గమనింతము. ఇందు పత్రికారచన దృష్టికిని, వాఙ్మయ రచన దృష్టికిని గల తారతమ్యములు కన్నుల గట్టినట్లున్నవి. వాఙ్మయదృష్టితో జూచినచో స్టీవెన్సను కవి తన నివేదిక నొక చిన్న గద్య (ఖండ) కావ్యముగ రచించినాడు; మానవజీవితము నత్యంత సూక్ష్మ దృష్టితో బరిశీలించి యందున్న సుఖదుఃఖములను, విందారగించు నతిథుల ముఖభావ విలక్షణములందు బ్రతిఫలించినవానిని నిర్వర్ణించినాడు. ఆ వర్ణనమునందు జీవితబింబము ప్రతిబింబించుచున్నది. ఆ ప్రతిబింబమునందు సమస్త మానవానుభూతమైన వాస్తవిక దృశ్యములు కనబడుచున్నవి. ఆ వాస్తవిక దృశ్యములను జూచినవారికి సంస్కృతికి బ్రయోజనవంతమైన యౌగిక ప్రసక్తి ధ్వని రూపమున బ్రతిధ్వనించుట తెలియ గలదు. ఆ వ్యాసమున భావములోనేమి, ప్రకటీకరణమున నేమి వైదుష్య సౌందర్యము లుట్టిపడు చున్నవి. కాని, పత్రికా నిర్వహణదృష్టిలో స్టీవెన్సను

మహాకవి పట్టి పనికిమాలినవాడై పోయినాడు! 'వార్తల' సంగ్రహించుటకు చేతకాలేదు; విందు గుడుచుట కేతెంచినవారి సంఖ్య లెక్కింపలేదు; వచ్చినవారి యూరి పేరులు తెలుసుకోలేదు; వారేయే దుస్తులతో విచ్చేసినది వర్ణింపలేదు; వారి ప్రవేశ సమయములందప్పటి యభ్యాగతు లెట్లెట్లు ప్రవర్తించినది గమనించలేదు; పత్రికారచయితల ముఖ్య ప్రశ్నచతుష్కములకు ప్రత్యుత్తరములు వ్రాయలేని భంగపడిన పరీక్షార్థి యయినాడు. ఎవరు? ఏమి? ఎప్పుడు? ఎచ్చట?— ఈ మహాకీలకముల పరమరహస్యము లాతనికి తెలియలేదు.

పత్రికా రచనము, వాఙ్మయము— వీనికి కొన్ని పోలిక లున్నవి; ఆ సామ్యములే వానిని సమపీఠమున నిల్పి వాకొను భ్రాంతి చదువరులకు సైతము కల్గించుచున్నవి. ముద్రాయంత్ర సాహాయ్యమునను, భాషామూలమునను ఈ రెండు కళలు మానవ ప్రకృతులను మానసికస్పర్శచేత ప్రమాణీకరింప ప్రయత్నించుచున్నవి. వాస్తవాంశములను ప్రతిపాదించుటయందును, సులభమార్గావలంబనమునందును, అన్వయాంశవిశదీకరణమునందును— ఈ రెండు కళలు సామాన్యశైలియందు దలదాచుకొనుచున్నవి. వీనికి వస్తు, విశదీకర్తలు ముఖ్యాంగకములు. ఈ సామాన్య సామ్యములను వివేచనానైపుణ్యదృష్టితో పరామర్శించినచో నీ పోలికలు కేవల దైవయోగ ఘటితమని తెలియగలదు.

పత్రికా రచనకును, వాఙ్మయమునకును వస్తువునందే భేదమున్నది; విధానమునందును వేఱిడితనమున్నది; సాధనమునందునను, ప్రయోగమునందునను వైవిధ్యమున్నది; వాని పరిణామ ఫలములందును భిన్నత్వమున్నది.

పత్రికారచనాకార్యము లౌకికము; వాఙ్మయ ప్రయోజనము సాంస్కృతికము. ప్రతిదినము మనము దైనికపత్రికలను దినదిన వార్తలకై చదువుచున్నాము. మన యాప్తులో, మన మెఱిగినవారో ముఖ్యులై యుండువారు నిన్న నేడేమి చేసిరో, చేయుచుండిరో చదువ గోరుచుందుము. క్రికెట్టుపందెము లేమయినవి; బంగారు వెండి వెల లెట్లున్నవి; ఊరిలో సర్కస్సులు, సినీమాలు, నాటకములు ఏమేమి ఎచ్చటెచ్చట ఎన్నాళ్ళ కాలము జరుగుచున్నవి, జరుగనున్నవి; రాజకీయముగా, జాతీయముగా, నంతర్జాతీయముగా నేయే మార్పులు జరుగుచున్నవి; వింతలు, విశేషములు, యుద్ధములు, శాంతి సమావేశములు మొదలగు సంగతులను, దినదిన వృత్తాంతములను దెలిసికొనుట పత్రికాపఠన ముఖోద్దేశములు. కావ్యములను జదువుట అట్లు కానేరదు. 'విశ్వశ్రేయః కావ్య'మనియు, నందు శాశ్వతసౌందర్యమున్నదనియు, సత్కవినిర్మితరమణీయ ప్రకృత్యుద్యాన వనవీథులందు విహరింపవచ్చుననియు, తత్కృత రమ్యకాసార నిర్మలాంబులందు విచ్చలవిడిగా నీదులాడు కలహంసలతో గలిసి యాడుకొనవచ్చుననియు, కవిపోషిత తరులతాగుల్మములందు మహదానంద రవములతో గుహూకుహూ కారములతో బాడుచుండు పుంస్కోకిలాళితో సోపహాసవిడంబనాలాప సంతోషము లందవచ్చుననియు, సంసారసాగర పర్యటన్మక రాలినుండి తప్పించుకొని శాంతగంభీర భాగమునందలి చిఱుకెరటాలపై వయ్యాళి యొనర్పవచ్చుననియు, కావ్యామృతశీకరసమ్మిళితవీచీ పరంపరాస్వాదనసౌఖ్యమనుభవింపవచ్చుననియు సత్కవికృతకావ్యరాజములను జదువుచున్నాము.

అప్పుడే ప్రొద్దున పదిగంటలయినది; అదిగో నేటి ఉదయ దైనికపత్రికలు ట్రాములలోను, బస్సులలోను నలిగిపడియున్నవి. ఇక రెండు మూడు గంటల సేపున 'పగటి వేళ' పత్రికలు రాగలవని యెదురుచూచుచున్నాము. 'రాకెట్' వేగముకంటెను వేగగతి పత్రికలకు వచ్చినది! నిన్నటి వార్తాపత్రిక నేడు మొహెంజోదరో శిథిలములకంటెను పురాతనమయిపోయినది. ఈ మాట యెట్టి కావ్యమును గూర్చియైనను వాకొనగలమా! కావ్యమునకు చిరంజీవిత్వ మున్నది. వాఙ్మయ మనిపించుకొనుట కీ ప్రయోగమే చాలును. ఈ యొరవు రాయి దాని శాశ్వతస్వభావమును ప్రకటించుచున్నది. మిల్టను మహాకవి కావ్యములు శైల సంరక్షితములు; నిక్షేపములు; కాలమహావేగమునకు రాలిపోవు; దాని కొట్టుళ్ళకు జర్జరితములు కావు; ఎట్టి కాలప్రయోగమునకును లొంగక స్వైరవిహారము లొనర్చుచుండును;*

వయోవార్ధక్యములు, పూర్వాచార నిబంధనలు వాని ప్రగతిని బంధింపజాలవు; లోకమున వార్తాపత్రికలు పుట్టకముందే వాల్మీకి వ్యాసాదులు కావ్య పురాణేతిహాసముల రచియించియుండిరి. వారి గ్రంథములు నిన్న నేడు రేపులు చిరంజీవములై యుంటయు, నేటి ప్రొద్దున నంత ముఖ్యముగా నగపడిన పత్రికలు మధ్యాహ్నమునకు పాతబడిపోవుటయు వానికి గల పోలికల కంటె చీలికలను దెలుపుటలేదా! వార్తాపత్రికలు అప్పటప్పటి వార్తావిశేషములను మన కందిచ్చునవి; కావ్యరాజములు శాశ్వత సమాచారముల నందిచ్చుచున్నవి.

ఒకానొక ప్రసిద్ధ పత్రికారచయిత "కుక్క మనుష్యుని గఱచినచో నది మాకు విశేష 'వార్త' కానేరదు; కాని మనుష్యు డెవడైన నొక కుక్కను గఱచినచో నది మా కొక వింత 'వార్త' యగుచున్నది" అన్నాడు. పత్రికా విలేఖకుల దృష్టిలో నిది యొక చక్కని దృష్టాంతము. సామాన్య విషయములకంటె భిన్నములై యబ్బురపాటు కలిగించు సంగతులను సంగ్రహించుట పత్రికా 'నివేదకులకు' ప్రథమ కర్తవ్యము. ఒక బడిపంతులు తన యిల్లాలిని ప్రేమించుచు, తనబిడ్డలను గారాబముతో పెంచుచు, వేళకు భుజించుచు, విద్యార్థులకు పాఠములు బోధించుచు జీవయాత్ర గడుపుచుండుట వార్తా విలేఖకులకు 'వార్త'ల కెడములేదు; వానితో వారి కే పనియు నుండదు. కాని ఆ పంతులవారు తన భార్యను చావబొడిచి, బిడ్డలను బావిలో బడద్రోసి, ఇరుగుపొరుగుల దరిమికొట్టి, దారిదోపిడికాడై ప్రవర్తించినా డనుకొనుడు— అది గొప్ప వింతలలో వింతవిశేష మగుచున్నది. పోలీసులు అతనిని వెన్నాడుటకు ముందుగ మన వార్తావిలేఖకు లాతని సమీపమున నుందురు. అతని జీవితము నాటిపత్రికలలో "వి. ఇ. జై." రోజులనాటి విశేషములతో సమాన ప్రాతినిధ్యము నందుచున్నది! అరిస్టాటల్ మహాకవి యొకచోట "నాకు మానవగతులు భిన్నములు గావు" అని సూత్రప్రాయముగ నిర్వచించియున్నాడు. ఆ వాక్యమున సమస్త వాఙ్మయ సిద్ధాంతములు పేటీయున్నవి. ఉత్తమకావ్యమున మానవజాతికి సామాన్యములైన యాదర్శక జీవిత విషయములు నిబిడీకృతములై యుండును. రామాయణాది మహాకావ్యములందలి పాత్రలు మనకు గలుగు సుఖదుఃఖములవంటివాని ననుభవించుచు మనవంటి జీవితములనే ప్రతిబింబించుచున్నారు. వారి పవిత్ర జీవనములు మన కాదర్శప్రాయములై మన జీవితములను వారి ననుసరించి గడపుటకు మార్గదర్శకములై యున్నవి. కావ్యపఠనము పాఠకుల మనఃకమల కుట్మలములను వికసింపజేయు జ్ఞానకిరణములను ప్రసరింపజేయును. వార్తాపత్రికాపఠనము అసాధారణ విషయములపై మనోభావములను కేంద్రీకరింపజేసి యట్టి సంగతులయందే మనదృష్టి నాకర్షింపజేయును. నిత్యములును, సత్యములును, అగత్యములును నగు వాస్తవిక వస్తువిషయములను సంక్షేపించి నిదర్శనములతో సంగ్రహించి యిచ్చునది కావ్యము.

వస్తుతః—పత్రికా రచనము, వాఙ్మయము సంపూర్ణముగ భిన్నములు. పత్రికారచయితల శైలి వేఱు, పోకడ వేఱు. వార్తావిలేఖకుని ప్రథమపాఠము వృత్తనివేదనము కాని శైలీశయ్యలు కావు. వృత్తాంత సంగ్రహణమునకు దగిన ఘ్రాణేంద్రియ మాతని యుపకరణము. దానికి తరువాతిది కబుర్లు, గాథలు వ్రాయగల్గుట. వ్యాకృతితో నతని కే పనియు లేదు. అతనికి గావలసినది 'వార్తలు'— విశేషవార్తలు, వింత వార్తలు, వాస్తవికవార్తలు. వానిని దేగలుగునాతడు (ఇతరులకంటె ఎక్కుడుగ) సిద్ధహస్తుడైన 'నివేదకు' డగుచున్నాడు. భాషా విషయికముగ దృష్టినుంచక, వ్యాకరణదోషములతో బ్రసక్తినుంపక తన పత్రికాపాఠకులకు రుచించునట్లు మాత్రము చూచి సరిదిద్ది యొక చక్కని కతనల్లి నాటి యభిరుచిని బాటించి ప్రకటించుచున్నాడు వార్తాపత్రికాసంపాదకుడు. విలేఖరులెల్ల వారి వారి నివేదనముల నొక్కరీతిగా వ్రాయుచుందురు. వారి రచనలలో సామ్యము లగపడుచుండుట కిదే కారణము కాబోలును. పదములు, ప్రయోగములు మామూలుగ నన్ని పత్రికలలోను నొక్కతీరుగ నుండును. సభలెల్ల "...వారి యధ్యక్షత క్రింద సమావేశ" మగుచుండును; "కార్యదర్శి వందనములతో సభ దిగ్విజయముగా పరిసమాప్తి" నొందుచుండును. "పోలీసులు నేరములగూర్చి

విచారించు(!)చుందురు. ఇట్టి పోలికలు వార్తలు చెప్పు నట్టి యాయా పత్రికావిలేఖకుల నివేదికలలో నన్ని పత్రికలయందును గన్పట్టుచుండును. పత్రికారచనము నకు శైలితో నంత ప్రసక్తిలేదు. వార్తలే వానికి జీవగఱ్ఱలు.

కావ్యకర్త యుద్దేశ్యము లట్లు కాజాలవు. నిర్దోషములై గుణసహితములై భావయుక్తములై త్రివిధ శబ్దార్థములతో- వాచకలక్షక వ్యంజకములును, వాచ్య లక్ష్య వ్యంగ్య ప్రతిపాదకములతో— అభిధాదిశబ్ద వృత్తులును; కైశిక్యాది కావ్యవృత్తులును; వైదర్భ్యాది రీతులును; శయ్య,పాకము మొదలగువానితో నిండి ఉత్తమాది త్రివిధములలో నొక్కటయి మహాకావ్యముగనో, ఉపకావ్యముగనో ప్రసిద్ధి నొందవలయును. ఛందోలంకార వ్యాకరణము లట్టి కావ్యములను పుటములనుంచి యపరంజి జాళువా వన్నెల రంజిలజేయుచుండును. కవి కృషి యంతయు నిట్టి పరిస్ఫుటములందు వినియోగపడి వాఙ్మయసృష్టి కావిర్భావకారకములయి యొప్పును. అతనికి నడుపవలెనెంచిన విషయము ప్రధానము. నడిపెడు విధానము అంగము. విధానప్రయోగము కౌశలాయత్తము. కౌశలము చిరతరాభ్యాస కలనాప్రతిఫలము. వాఙ్మయ నిర్మాణదక్షతయందు గవికి శైలి ముఖ్యాంగమని యొప్పికొన్నప్పుడు ఆ శైలికి సమగ్రత కనబడదు. సమగ్రత లేదుకదా, సామ్యములైనను నీహారలేశములై యుండును. ఎవరితీరు వారిది; ఎవరి గతి వారిది. అందుచేత పత్రికారచనమునకును, వాఙ్మయ నిర్మాణమునకును శైలి ముఖ్యాంగమయినను దానిస్వరూప,పిండీకృతసారములలో సాదృశ్యములు నిష్పచ్ఛరములై యుండును. ఎవరైన నట్టిపనికి బూనుకొనుట తేలుమందు నమ్ముటకై ప్రకటించిన "నోటీసు" రచనకును, మనుచరిత్రలోని హిమాలయ ప్రాంతవర్ణనారచనకును సామ్యముల జూపనెంచుటో, కొమ్మూదుచున్నవాని సద్దుతో ద్వారం వెంకటస్వామి నాయుడుగారి ఫిడేలుగానామృతమునకు శబ్దమాత్ర సామ్యములతో సాజాత్యత సాధించుటో వంటిది.

వృత్తవిలేఖకవాఙ్మయమునకును, కావ్యవాఙ్మయమునకును మరుస్థలమునకును, శాద్వలస్థలమునకును గల యంతటి తారతమ్య మున్నది. కావ్యశాద్వలమున మానవశ్యము క్రీడావిహారము చేయుచుండును. "వార్తా" వాఙ్మయమున సౌహార్దము సున్న. అందుకొఱకే 'నివేదకుల' పేర్లు ప్రకటింపబడుటలేదు. వాఙ్మయసంబంధ రచనలయందు కర్తృత్వము మఱుగుపఱచుట లేదు. ఆయాయిప్రణేతల మనఃపరివర్తనలు వారివారి రచనా విన్యాసములం దగపడుచుండును. ప్రవర్తకుడు ఛద్మనామమున వ్రాసిన వ్రాతనిందు—పాఠకుల కాయభిధానమునందయినను వాని జాడలు, పోకడలు తెలియుచుండును. వార్తాపత్రికారచయితల తెగలోని వ్రాతకాండ్రెల్ల నించుమించు నొక్కరీతిగ వ్రాయుచుందురు. కావున పేరుల ప్రకటించుకొనవలసిన పని వారికి నుండదు. వారు తెలుపునట్టి విషయము లెట్టివైనను, వానియందు హాస్యరసమునకు జోటీయరాదు. వారి నివేదికలలో ధ్వనిభూయిష్ఠరచన లుండవచ్చునుగాని వ్యక్తిగతప్రయోగహాస్యశబ్దములు వ్రాయగూడదు. వారి వ్రాతలందు సత్య, ధర్మ, దయాదిగుణము లుద్బోధించు ప్రయోగము లుండవచ్చునుగాని యేమాత్రము ప్రభుసమ్మతములుగ వాక్యము లుంచరాదు. రవియెఱుగని చోటు కవికంటెను, గ్రామకరణమునకంటెను పత్రికానివేదకుడు హెచ్చుగ నెఱుగగలడుగాని యాతని నివేదికలో వాస్తవికసంఘటనములు, తద్వివరణములు మాత్రమే యుండవలయును. ఉదాహరణకు: ఎవరైనను ఒకరు మరణించిరా రనుకొనుము. ఆ మరణవార్త వార్తాప్రచురణమున నిట్లుండగలదు :

"ఫలానావారి యేకైకపుత్రి ఫలానాదేవి నిన్న సాయంకాలము ౮ గంటలకు జనరల్ ఆస్పత్రిలో సన్నిపాతజ్వరమువలన మరణించెను...దేవిగారి తండ్రిగారు రాత్రి ౭-౮౹౨ గంటలబండికి గ్రామాంతరమునుండి వచ్చినారు. బంధువులు, మిత్రులు పలువురు శవముతో శ్మశానమునకు వెళ్ళిరి.

కీ॥ శే॥ శ్రీ...దేవిగారు క్వీన్ మేరీ కళాశాలలో పట్టభద్రురాలై సంఘసంస్కరణవిషయములందు విశేషముగ నభిమానము చూపుచుండిరి. మరణమప్పుడామెకు వయసు ౨౬."

కావ్యనిర్మాతకీ నివేదిక చాలునా ! మహాత్మా గాంధిగారు తన యర్ధాంగి కస్తూరీబాయిమరణమప్పుడు

రాజప్రతినిధి వేవెల్ ప్రభువునకు వ్రాసిన యుత్తరములోని హృదయపరితాపప్రకర్షముకంటెను, శ్రీరామచంద్రుడు దావాడు సీతాపహరణసమయమున బడిన పరితాపమునకంటెను గుండెలుగరగునట్లు విలాపించును. ఆ దుర్భరపరితాపదగ్ధహృదయమాంసరుధిరములు ధూమరూపమున మేఘమండలమంతయు గప్పి యాతని దీర్ఘనిశ్వాస ఝంఝానిలతాడితములై లోకమెల్ల కన్నీటి కాలువలుగట్టి వెల్లువలై పాఱునట్లు శోకవర్షముల గురిపింపగలడు. అతని హృదయరుధిరముతో, దుఃఖవార్తాలికలతో శోకచిత్రములను చిత్రింపగలడు. అతనికి ఊరినుండి ఆ ఎవరో విజయముచేయుటతోగాని, బంధుమిత్రులు ఆ శ్మశానగాములై మరలుటతోగాని పనిలేదు. అతని గుండెలు కరగి వంకలు వాగులై పాఱుట కారంభించి సంతాపకావ్యములు సృష్టింపబడుచుండును. మరణవార్తను వార్తాపత్రికారచయిత విషయరూపముగ విశదీకరించుచున్నాడు; కావ్యకర్త చదువరుల హృదయవీణాతంత్రులనుమీటి గంభీరశోకనిస్వనములను సృష్టించి కరుణరస ముప్పొంగజేయు నిర్వేదగానపరంపరల నలుదిక్కుల విస్తరింపజేయుచున్నాడు.

మద్రాసు 'మెరీనా' సముద్రతీరము ప్రపంచములోని రమణీయసౌందర్యదృశ్యములలో నొక్కటని ప్రపంచపర్యటనము చేయు సౌందర్యపిపాసువుల యభిప్రాయము. మద్రాసు సముద్రతీరము ఉత్తరదక్షిణములు సుమారు రెండుమైళ్ళవఱకు వ్యాప్తిచెందియున్నది. ఉత్తరభాగమున రాయపురతీరమున నిలిచి సముద్రమును జూచినచో నచ్చటి యాతాయాతనౌకాసమూహములు, రేవున నిలచిన జలసౌధములనదగు మహాపోతములు, వాని చుట్టు దిరుగులాడుచుండు చిన్నచిన్న స్టీములాంచులు, చిన్ని పడవలు—ఇవి చిలుకగా నురుగులుగట్టి బురదలు నిండిన యాసముద్ర మెంత పెద్ద తొట్టివలె గన్పట్టును. తెస్తలం దెచ్చు చేపల కుప్పలనుండి వచ్చు గాలి ముక్కులకు విసుగుకొల్పును. చాలసేపచ్చట మనము నిలచి సేదదీర్చుకొలేము.

అటు దక్షిణమువైపున నున్న కోట కావలి తీరము బరికింతము. పచ్చపచ్చగ చెట్టుచేమలతో, వింతవింతరంగుల పువ్వులతో పూలతోటలు చల్లని పిల్లగాడ్పులు తమ్ము మందలింప తెప్పరిలి స్వాగత మిచ్చునట్లూగులాడుచున్నవి. వాని ప్రక్కన నిర్మలసైకతస్థలములు, వాని వెనుక గంభీరవారినిధి వినీలతరంగములతో సమీపించువారిని కుశల మడుగుచున్నది.

౧౯౪౧ సంవత్సరమున జపాను చక్రవర్తి యాస్థానకవి చెన్నపట్టణమునకు వచ్చియుండెను. అతని పిలుపుననుసరించి 'కానిమెరా' భోజనశాలలో నాతని గలిసికొని ముచ్చటించు ప్రసక్తి గలిగినది. మా కాలక్షేపమునకై నాతనిని నేను మద్రాసుబీచిని గురించి వారి మెప్పునుగూర్చి యడిగితిని. అతడు చిఱునవ్వుతో—

*"Why, the pale blue-sky, the deep blue-sea, the pure white-sands, the green foliage, the black tar-road and the red buildings! wonderful beach, yours!"* అన్నాడు.

ఇన్నాళ్ళు చెన్నపట్టణమున దిరుగాడుచుండు వారికి మాకెవరికి ఈ వర్ణనము దోచలేదు. జపాను కవిసార్వభౌముడు ఎంతసులువుగ, ఎంత సుందరముగా వర్ణించినాడు! ఆ సౌందర్యప్రముగ్ధులై నిలుచున్న వారి కాసముద్ర మెంత యాకర్షణీయముగ నున్నదో వచింపరాదు. అలలు మితిమీరి గట్టుపై కెగగొట్టుచు నొక్కొక్కప్పు డత్యంతగంభీరముగ భీతిని గల్గించుచుండును. ఒక్కొక్కప్పు డత్యంతప్రశాంతముగ చిన్నిచిన్ని యలలతో జిలిబిలినవ్వులవలె మిలమిలలాడుచు మనస్సున కెంతో యానందము గల్గించుచుండును.

ఆయాయిసమయములందు, రాయపురము తీరమున నున్నప్పుడు వార్తాపత్రికా వాఙ్మయము-తిరువల్లిక్కేణి తీరమున నున్నప్పుడు కావ్యవాఙ్మయము తలపునకు వచ్చుచుండును.

ఏకాంకిక :

# స్వర్గ ద్వారము

— శ్రీ జనమంచి రామకృష్ణ —

(బృందగానం)

జననమరణజంఝూటము జగమని
జనులందరు బోధింత్రూ
నాక ముందనీ నరక ముందనీ
నరులకు మతములు బోధించూ!
నాకమెం నరకమెం, పునర్జన్మమెః?
కాయమమాత్ర మశాశ్వతము!

ముసలిగొంతు—సృష్టిలోకల్లా విచిత్రంగా తోచేది మానవుడు. మేధస్సు వుంది; విశిష్టత కలవాడు. తన విజ్ఞానంతో, చివరకు ప్రకృతినికూడ, తన చానిసక్రింద చేసుకున్నాడు. తనలోని దౌర్బల్యాలతో మానవు డెంతో బలవంతుడు. కాని స్వర్గద్వారంవద్ద మానవుడు విచిత్రానుభవాలను పొందుతాడు. అక్కడే తన అంతరాంతరంలోకి తొంగిచూసుకుంటాడు...... మానవజీవితగాథ ఎంత విచిత్రమైనది! అదిగో! స్వర్గద్వారంవైపు మీ మీ దృక్కుల్ని మరల్చండి! అక్కడ జరిగే సంఘటనలు చూడండి......అదిగో జన్మించబోయే ఆత్మ ఇలాగే వస్తూంది. (ముసలి గొంతు నిష్క్రమణ.)

జన్మించబోయేది—ఇన్ని దారు లున్నాయేమిటి! నేను పోవలసిన మార్గ మేది! ఎలాగ నేను వెళ్ళడం! ఎవరూ చెప్పరూ! నేను దారితప్పాను...

గొంతు—ఎక్కడికి ప్రయాణమయావు?

జన్మించబోయేది—అబ్బా! దారంతా ఇంత చీకటిగా ఉందేః! బహుశా వెల్తురులోంచి హఠాత్తుగా ఈ అంధకారంలోకి రావడంవల్లా నేమో!...... ఆః! ఇప్పుడిప్పుడే కొంచెం, ఈ చీకటికి అలవాటు పడుతున్నా! ఇదిగో! ఎవరక్కడ! నా జన్మనివాసానికి దారేదో చెప్పరూ! అక్కడే మానాన్నా, అమ్మా, స్నేహితులూ ఉన్నారు......అబ్బా! నే నిక్క డుండలేను బాబూ!.........మా అమ్మ నాకోసం బెంగెట్టుకుంటుంది......దారి చూపరూ! మా అమ్మదగ్గిర కెళ్లిపోవాలి.

గొంతు—ఎక్కడికి వెడుతున్నావు?

జన్మించబోయేది—ఎవరో ప్రశ్నలు వేస్తారు కాని, ఎదురుగుండా రారేం! నాకు దారి తెలియడం లేదు......తిన్నగా వెడితే ఎక్కడికి వెడతాను! నేను మా అమ్మదగ్గిర కెళ్లాలి......(తనలో) నాకన్నీ జ్ఞాపకం వున్నాయి......మా తోటనిండా విరగ పూస్తాయి చామంతులు.........మా బుల్లికుక్కపిల్ల గంతులేసే మెడలోని మువ్వలు ఘల్ ఘల్ మంటాయి. అక్కడ వెన్నెల్లో దాగుడుమూతీ లాడుకొనేవాళ్ళం ...... ఎంత బావుంటుందో! (కొంచెం ఏడుపుతో) నేను వెళ్ళిపోవాలి! ఎలాగ వెళ్ళడం?

గొంతు—మనుష్యు లుండే చోటికి వెడుతున్నావా?

జన్మించబోయేది—(ఆత్రంతో) ఆః! ఔను! మా అమ్మ......

గొంతు—ఇంకొక్క దినంలో వెడతావు... ఈ లోకానికీ ఆ లోకానికీ దూరం ఒక్కరోజే!

జన్మించబోయేది—నిజంగానా! అంతేనా దూరం! నాకిక్కడే ఉండాలని ఉంది. కాని మా అమ్మ కావాలి......నాకు దారిచూపవూ! నేను మళ్ళా వచ్చేస్తాను. మేమందరం మా కారులో ఎక్కి ఇక్కడికి వచ్చి ఆడుకుంటాము. ఒక్కరోజేగా దూరం!

గొంతు—నిజంగా మళ్లా పుట్టాలని వుందా? ఏం, ఇక్కడ బాగులేదూ!

జన్మించబోయేది—ఇక్కడికొచ్చాక నాజీవితం ఒక అమృతభాండమైంది. మొన్న, నా స్నేహితులు కొంతమంది ఇక్కడికొచ్చి ఈ లోకానికీ ఆ లోకానికీ గల భేదాలను చర్చించడం ప్రారంభించారు...... ఇంకా ఆ లోకం భూతలస్వర్గమవలేదట......... వైషమ్యాలతో, వైరుధ్యాలతో, స్వాహేతుతో, స్వార్థంతో మానవులంతా జగత్తుని నరకమయం చేస్తున్నారట......ఈ లోకంసంగతి వారికి చెప్పి నా జీవితామృతాన్ని వారికి పంచిపెట్టేందుకు అక్కడికి వెడతాను.

గొంతు—(నవ్వుతుంది)

జన్మించబోయేది—ఏం! నవ్వుతున్నావు! పునర్జన్మ కోరుతున్నాననేనా! నాకోసం కాదు, నాతోటి మానవుల జీవిత సౌభాగ్యంకోసం!

గొంతు—గత జీవితస్మృతులు నీలోంచి మాట్లాడుతున్నాయి! సరే! ఆ కొండ యొక్క... అదిగో! దూరంగా ఒక గ్రహం కనిపించడంలేదూ! అదే మానవలోకం......మరి నేను వెడతా...... మీ లోకంనుండి ఈవేళ చాలామంది వస్తారని తెలిసింది. వారిని కలుసుకుని తగిన కట్టుబాట్లు చేయాలి.

జన్మించబోయేది—నవగ్రహాలలోనూ ఫలానాది భూమి అని ఎలా తెలుసుకోడం? అన్నీ జగజ్జేగీయమానంగా ప్రకాశిస్తున్నాయి!

గొంతు—అంత కాంతి వుండదు......చాలా చిన్నదిగా ఉంటుంది...అదే భూమి. అదిగో ఆ పాలపుంత వెనకాతల కనిపించడంలేదూ!

జన్మించబోయేది—అంతదూరం చూడలేకుండా ఉన్నాను. అంతా కారుచీకటిగా ఉంది!

గొంతు—ఆఁ! ఈమాటు చూడు!

జన్మించబోయేది—(కనుబొమలమీద చేయిపెట్టి చూస్తూ) నెరసులా మెరుస్తూంది-అదేనా భూమి...అంత చిన్నదా?

గొంతు—ఔను! అంత చిన్నదైనా అక్కడ అందం చిందులుతొక్కుతుంది. అక్కడ జీవించాలంటే సహనం కావాలి.

జన్మించబోయేది—ఇదిగో! అడగడం మరిచాను......అన్నీ జ్ఞాపకంఉన్నాయికాని, జన్మించడం ఎలా వుంటుందో మరిచిపోయాను. చెప్పవూ!

గొంతు—క్రమంగా కమ్ముకునే నిద్రలా వుంటుంది; ఎక్కడికో జారిపోడం; అటువంటి జీవితంలో మునుగుతూ తేలుతూ చివరకు మేల్కొనడం—ఎందుకు ‘నాభాందో’ అని ఏడ్చేందుకు—అదీ జన్మించడం అంటే.

జన్మించబోయేది—నేను మాత్రం ఈ లోకపు వాసనలను, ప్రేమలనూ పునర్జన్మక్లేశంలో పోగొట్టుకోను! పోగొట్టుకుని అక్కడికెళ్లి ఏం ప్రయోజనం! నా సంచితామృతాన్ని పంచిపెట్టి, భూతలంమీదనే వారికి అమరత్వాన్ని ప్రసాదిస్తాను.

గొంతు—నీవున్న పట్టుదలతోనే, నీ ఆశయాలతోనే అసంఖ్యాకులు అక్కడికి వెడుతున్నారు; వస్తున్నారు. ఈ జననమరణ చక్రద్వయరథపరిభ్రమణానికి అంతంలేదు......నామాట విను......ఆ ప్రపంచపు గూడులో తలదూర్చగానే ఇప్పుడు నీవున్న విశాల హృదయం సంకుచితమైపోతుంది.

జన్మించబోయేది—ఎప్పటికీ కాదు...నాకు ఆత్మబలం వుంది...ఆత్మవిశ్వాస ముంది. అవే ఆ లోకంలో అనుక్షణం నాకు దారితోడుగా నిలుస్తాయి...దయచేసి నాకు దారిచూపు......

గొంతు—ఒక్కగంటసేపు ఆగు. నీకు దారి చూపుతాను. ఎందుకంటే అక్కడ్నించి వాళ్లొచ్చే

వేశైంది...నాతో వస్తావా ? వాళ్లని చూపిస్తా......
అదిగో ఆ కొండమీదికి వెళ్లాలి.

## రెండవ రంగం

(దూరాన్నుంచి నర్తకి పాడుతూ, నృత్యం చేస్తూవస్తుంది)

ఏదారిని పడి నీదరి చేరుదు
ఏమిటి కీ ప్రణయాలూ!
ఏమిటి కీ ప్రణయాలూ!
నీ పదతీర ప్రాంతములోనే
పారుసుగద ఈ జీవనదీ!
నీ తలపే నా వలపౌనోయీ!
నీ కథలే నా పెతలౌనూ!— ఏదారి—

(వళ్లు తెలియకుండా నృత్యంచేస్తూండగా)

గొంతు—అదిగో నర్తకి వస్తూంది...నృత్యం చేస్తూన్నప్పుడు కాలుజారింది.

జన్మించబోయేది—కాలుజారితే ఇక్కడికి రావడ మెందుకు ?...నాకు బాగా జ్ఞాపకముంది: ఓ మాటు నేను కోతికొమ్మచ్చి ఆడుతూ కాలుజారి పడ్డాను......అబ్బా! ఎంత బాధపడ్డాననుకున్నావు! మరి నేను అప్పు డిక్కడికి రాలేదే ?

గొంతు—కాలుజారడమంటే ఆ లోకంనుంచి ఇక్కడికి రావడం...మానవులందరూ మరణమంటారు ......కాని మేము కాలుజారడ మంటాము...విను. నర్తకి పాడుతూంటుం డాను.

నర్తకి—నీపదతీర ప్రాంతములోనే
పారుసుగద ఈ జీవనదీ!
నీ తలపే నా వలపౌనోయీ!
నీ కథలే నా పెతలౌనూ!—ఏదారి—

గొంతు—నర్తకీ! నర్తకీ!

నర్తకి—(పాటఆపి) ఎవరు! నే నెక్కడ! అయ్యో! నర్తనశాల వదిలి ఇలా వచ్చానేమిటి!

గొంతు—నర్తకీ! ఎక్కడి కలా వెడుతున్నావు! ఇలా రా!......పైకి వెడదాము!

నర్తకి—పైకా! అక్క డేముంటుంది ?

గొంతు—అమరసంగీతం! అమరనృత్యం!

నర్తకి—(ఆత్రంతో)నాట్యాచార్యు లుంటారా! క్రొత్తనాట్యాలు నేర్పుతారా! ఇదిగో! క్రొత్తగా నేర్చుకున్నా నీనాట్యం. (నర్తిస్తుంది)

గొంతు—(నవ్వి) ఇక్కడ ఇవేమీ పనికిరావు! ......ఎవ రావచ్చేది?(కనుబొమలమీద చేయి పెట్టుకుని దూరంలోకి చూస్తుంది)

దేశసేవిక—(తనలో)తేవేలాగుంది సమావేశం! వెళ్లితీరాలి! అక్కడ కొత్తరకం చీరెలు......మంచి మంచి అద్దకా లుంటాయి......కొనాలి......తీరా ప్రయాణం......

గొంతు—అమ్మా! ఇలా రా! ఎక్కడి కెడుతున్నావు! ఇటు! ఇటు!

దేశసేవిక—నాకు వ్యవధి లేదు......నేను వెళ్లాలి......మహిళా......

గొంతు—(తనలో) మానవులకు తీరికా లేదు, పనీ లేదు......ఏవో కల్పించుకుంటారు! ఆ నీడల వెంబడి పరుగెత్తుతారు!......అమ్మా! ఇక్కడ ఆగాలి!

దేశసేవిక—ఎందుకు ?

గొంతు—మాతో రావూ ?

దేశసేవిక—ఎక్కడికి ?

గొంతు—ఎక్కడికని వెళ్లేరావో అక్కడికి... ఉండు! మొదట ఆ బురఖా తీసేయి!

దేశసేవిక—బురఖా! చేతితో వడికిన నూలుతో నేసిన చీర కట్టుకుంటే, బురఖాలా కనిపిస్తుందా నీకు ?......ఎం......త సన్నంగా వడికాననుకున్నావు...నూలుతీసే పోటీలో ప్రథమ బహుమానం కాదే!

గొంతు—స్వార్థం. మానవత్వంతో అల్లుకున్న బురఖా అది. దానితోటి మీరంతా లోవెలుగు మరుగు పరుస్తున్నారు......ఈ లోకంలో అటువంటి మానవ కల్పిత బురఖాలు పనికిరావు......దేవతా వస్త్రాలు ధరించాలి.

దేశసేవిక—ఈ లోకమా! దేవతావస్త్రాలా!

నర్తకి—గజ్జలులేందే నాట్యం నేర్చుకోడం ఎలా?

గొంతు—మొదట నేను చెప్పింది చేయండి!

జన్మించబోయేది—అదేమిటి? వాళ్లు కలలో ఉన్నట్లు తేలుతూ తూలుతున్నారు!

గొంతు—ఇంకా ఆ జన్మవాసనలు వాళ్ళని అంటిపట్టుకు ఉండడంచేత......అదిగో! వస్తున్నాడు! వస్తున్నాడు! అతణ్ణి గురించో పెద్దగాథ వుంది!

జన్మించబోయేది—కథా!

గొంతు—ఊఁ. పూర్వసృకృతులతో, పూర్వానుభవాలతో ఆ వ్యక్తికి పునర్జన్మ ఇచ్చాను. అతనికి ఏది ఎప్పుడు ఎలా సంప్రాప్తమౌతుందో తెలుసును. అటువంటివాడు తిరిగి ప్రపంచంలో ఎలా జీవించగలుగుతాడో చూద్దామని పంపాను. పాపం! తిరిగి వచ్చేస్తున్నాడు...విను...ఏదో గొణుక్కుంటున్నాడు!

మగగొంతు—మొదట బ్రతికిన బ్రతుకే బ్రతకడం ఎంత పేలవంగా ఉంటుంది! జీవితంలో ఒక్క విస్మయం లేదు, ఒక్క ఆశా లేదు! నిరాశా లేదు—ఆనందంకాని, దుఃఖంకాని ఏదీ లేదు!—ప్రతివస్తువూ నాకు పరిచితమే—ప్రతిముఖం చిరపరిచితమైనదే!... వద్దు. తిరిగి అదేజీవితం జీవించలేను. వద్దు-నాకు...వద్దు.

గొంతు—(నవ్వి) మానవుడు హఠాత్సంఘటనల, సమావేశాల, ఆశల, విస్మయాలలోనే ఆనందాన్ని పొందగలడు......

జన్మించబోయేది—అదేమిటి ఇతను కూడా తూలుతూ తేలుతూ వస్తున్నాడు!

గొంతు—ఐహిక, మానసికస్పర్శలు విడిపోతున్నాయి...అదుగో ఆ నర్తకీ, దేశసేవికా వస్తున్నారు. వెళ్ళి వాళ్ళని కలుసుకో......నేను ఆ కొండపక్కకి వెళ్ళివస్తాను.

జన్మించబోయేది—నర్తకీ! నా చెయ్యి పట్టుకో! తూలిపోతున్నావు.

నర్తకి—తూలిపోతున్నానా! నా నాట్యకౌశలాన్ని తూలనాడుతున్నావా? నానడక ఎప్పుడూ రాజహంస నడకలని ఎరగవ్వూ?

జన్మించబోయేది—పోనీ, అమ్మా! మీచేయి...

దేశసేవిక—నువ్వెవరవు? 'స్వయంపోషణ, స్వయంరక్షణ' మా దేశసేవికల ముఖ్యాదర్శాలని తెలియదూ? నేను మరొకరిమీదా ఆధారపడే వ్యక్తిని కాను...ఐనా నువ్వెవరవు?

జన్మించబోయేది—నేను, నేనా! జన్మించబోయే ఆత్మని.

దేశసేవిక—నీ సెక్కడా వినలేదే!

జన్మించబోయేది—ఔను! నాకు నమ్మకం లేదులే! ఇదిగో! ఇక్కడా నేనుంట!

దేశసేవిక—ఆకారంలేని ఆత్మ ఎక్కడా ఉండదు.

నర్తకి—ఆకారం లేకపోతే నాట్యం ఎలా చేయడం?

దేశసేవిక—ఐతే నువ్వు అక్కడికి వెడుతున్నావా? భూమిమీదికే! నిజంగా!

జన్మించబోయేది—ఔను. ఈ వేళే వెడుతున్నాను.

దేశసేవిక—నేను నమ్మను! నువ్వు చెప్పిందే నిజమైతే మరి నేనో? నేనూ వచ్చేస్తాను.

జన్మించబోయేది—నీ ఆకారం ఇప్పుడేగా మృతినొందింది?

దేశసేవిక—నేను! నేను—చచ్చిపోయానా!! హాఁ! మానవులకీ ఈ సంగతే తెలియదుగదా!

జన్మించబోయేది—నిజంగా వాళ్లకి తెలియదూ! ఎంత ఆశ్చర్యం!

దేశసేవిక—ఐతే ఈ కొండలే స్వర్గమన్నమాట!

జన్మించబోయేది—అబ్బే, ఇది కాదు స్వర్గం—స్వర్గద్వారమే!

దేశసేవిక—బాగుంది! ఐతే ఆదారి స్వర్గానికి తీసికెడుతుందన్నమాట! నే నాదారి పట్టుకు నడిచి వెళ్లిపోతాను.

జన్మించబోయేది—స్వర్గానికెళ్ళి మళ్ళా పునర్జన్మ సంపాదించుకుందామనా నీ ఉద్దేశం?

దేశసేవిక, నర్తకి—ఔను!

జన్మించబోయేది—జీవితంలో పనికొచ్చే విశిష్టతలన్నీ ఇక్కడ వాసనలేని పూలగుత్తులు.

నర్తకి—నా నాట్యకౌశల్యమంతా బూడిదలో పోసిన పన్నీరేనా?

దేశసేవిక—నే చదువుతున్న రాజ్యాంగ నీతి అంతా వృథాయేనా?

జన్మించబోయేది—ఆ 'అహం' అనే బురఖా తీసెయ్యండి. లేకపోతే స్వర్గద్వారం తెరుచుకోదు.

దేశసేవిక—నాలో 'అహం' ఎక్కడుంది? 'అహం' ఉంటే త్యాగం చేసివుండేదాన్నా? దేశం కోసం, ప్రజకోసం నా జీవితాన్నంతా త్యాగం చేశాను.

జన్మించబోయేది—త్యాగం చేశానన్న స్పృహ కల్గడంలోనే 'అహం' ఉంది......మరి ఆ బురఖాలు తీసివేయండి!

నర్తకి—నా గజ్జెలు!......

దేశసేవిక—కష్టపడి పదికి చేయించుకున్న.....

జన్మించబోయేది—ఐతే స్వర్గద్వారం తెరుచుకోదు!

దేశసేవిక—ఏం! ఇలా వస్తేరేం!

జన్మించబోయేది—లోవెలుగులు మెరుగుపడుతున్నాయి......అది ఉత్త బురఖా!

దేశసేవిక—కాదు! ఎన్నటికీ కాదు! నా వ్యక్తిత్వానికి మూలాధారం నేను ధరించేదే! నాకేమిటి, మానవులందరికీని! ఈదుస్తులు పోగొట్టుకుంటే నే నెక్కడ! అది నావ్యక్తిత్వచిహ్నం......అది వదిలితే, కోటానుకోట్ల ప్రజలలోనూ నేనూ ఒక వ్యక్తినై పోతాను......ఊహుఁ! నావ్యక్తిత్వాన్ని మాత్రం నేను పోగొట్టుకోను!

నర్తకి—ఈ నవనాగరిక ప్రపంచంలో దుస్తులూ, నాట్యం, అలంకరణాలే మానవునికి వ్యక్తిత్వాన్నీ, గౌరవాన్నీ ఇస్తున్నాయి.

దేశసేవిక—ఈ వేళే భూమిమీద జన్మించబోతున్నానంటున్నావు...ఇలాగే వెడతావా? నీ మొహం ఎవర్లూ చూడరులే! పునర్జన్మ ఈమోస్తరుదే ఐతే నాకొద్దు బాబూ!

నర్తకి—నాకూ వద్దు!

జన్మించబోయేది—ఐతే నన్నెవరూ అక్కడ మొహమెత్తి చూడరా! నా జీవితం దుర్భరమై పోతుందా? మానవుల్లో ఇరుగుపొరుగుతనం పోయిందా?

దేశసేవిక—(నవ్వి) వెర్రిఆత్మా! మానవుల సంగతి నీకేమీ తెలియదన్నమాట! వారిలో సహనం, సహకారం, సంఘీభావం వుంటే వేరే స్వర్గమెందుకు! వెళ్లు. అక్కడి కెళ్లు! ఏదో, పాపం, చాలా ఉబలాట పడుతున్నావు!

జన్మించబోయేది—(ఆశ్చర్యంగా) నేను నమ్మలేకుండా ఉన్నా మీరుచెప్పేది! అంతమాత్రం మంచితనం లేదా మానవుల్లో!...ఇక్కడ ఎంత బాగుంటుందనుకున్నారు!......పోనీ, వారిలో ప్రేమ ఉందా?

నర్తకి—నలుసంత ఉంటుందేమో!......ఇట్టే కనిపిస్తుంది...చూస్తుండగానే మాయ మౌతుంది.

జన్మించబోయేది—ఇక్కడ హృదయాలు ప్రేమపూరితాలు! మునపట్లా ఇప్పుడు యుద్ధాలు చేయడం లేదుగా! మతం పేరుచెప్పి మానవత్వాన్ని చంపుకోడం మానేశారా? ఎలాగైనా, నాగరీకు లయారు కదూ మానవులు!

దేశసేవిక—యుద్ధాలు నాగరీకమయాయి అను. కాంక్ష ఉన్నంతకాలం యుద్ధాలు ఎక్కడికి పోతాయి! ఇప్పుడు జరుగుతూన్న యుద్ధాలు అతివిచిత్రమైనవి! ఇంక మతమాత్సర్యం అంటావా! దేవుడూ నై, గురువూ నై! ఎక్కడ చూసినా రక్తపాతం!

జన్మించబోయేది—(ఆశ్చర్యంగా) ఇంకానా! యుద్ధాలై పోయాక మానవులు శాంతంగా, సఖ్యతగా ఉంటున్నా రనుకున్నాను?

దేశసేవిక—అదే లేదు! స్వాపేక్షతో ఒకరి నొకరు పొడుచుకుచస్తున్నారు.

జన్మించబోయేది—స్నేహితుడూ స్నేహితుడూ కూడానా!

దేశసేవిక—సోదరుడూ సోదరుడూ కూడా పొడుచుకుంటున్నారు.

జన్మించబోయేది—మరి ప్రేమ, వాత్సల్యం, విశ్వమానవసౌభ్రాతృత్వం అంటారు? ప్రపంచం ఎలా అభ్యుదయానికి వస్తుంది?

దేశసేవిక—స్వయంకృతాపరాధిగా ఉన్నంత కాలం మానవుడంతే!

జన్మించబోయేది—అయ్యో! నే నింకా, మానవులు చాలా దయార్ద్ర హృదయులూ, న్యాయపరులూ అనుకున్నాను!

దేశసేవిక—(నవ్వి) ఎలా గనగలరు, నీ వెర్రి గాని! వాళ్లు ఉఫ్ఫున ఊదితే ఎగిరిపోయే దుమ్ముకారు.

జన్మించబోయేది—ఐనా వారికి ఆత్మ లున్నాయిగా!

దేశసేవిక—ఉన్నా, అవి నల్లమందుమత్తులో జోగుతూంటాయి.

జన్మించబోయేది—నువ్వు చెప్పిందే నిజమైతే, తిరిగి జన్మించడానికి చాలా భయంగా ఉంది. నీవు చెప్పిందంతా వినేముందు, సదభిప్రాయంతో, మానవునికి ప్రేమ పంచిపెడదామని ఈ పునర్జన్మ కోరాను!

దేశసేవిక—వెర్రి ఆత్మా! నిరాడంబరజీవనం, ప్రేమ-ఈ రెండూ భూమిమీద ఎందుకూ పనికి రావు.

జన్మించబోయేది—ఓహో! అందుకనా ఆ బురఖా తగిలించుకున్నావు!

దేశసేవిక—ఆఁ! ఈమాటు అర్థమైందా దుస్తుల విలువ! ఔనుగాని, నేను వెళ్ల వలసిన దారి ఏది?

జన్మించబోయేది—ఆ బురఖా తీసేస్తేనేగాని, ఒక్క అడుగైనా ముందుకు వెయ్యలేవు!

దేశసేవిక—ఓహో! గడుసుతనం నేర్చుకున్నావే! దుస్తుల విలువ గ్రహించావుకాబట్టి, నా దగ్గిర్నుంచి, ఎలాగైనా నా బురఖాను తీసుకుని, నేనుకు పారిపోదా మనుకుంటున్నావుకదూ! నువ్వు దారి చెప్పకపోతే నేనే మాకుకు వెళ్లగలను! (నిష్క్రమించబోతుంది)

గొంతు—ఆగు! ఆగు! ఎక్కడికి?

దేశసేవిక—ఎవరు?

గొంతు—ఎక్కడికి కాదుస్తుంటో!

దేశసేవిక, నర్తకి—స్వర్గానికి.

గొంతు—ముందట ఆ బురఖాలు వదిలి వేయండి!

దేశసేవిక—నువ్వూ అదే అంటున్నావా! ఐతే, మరి నా వ్యక్తిత్వం?

గొంతు—స్వప్నం!

దేశసేవిక—మరి నా తెలివితేటలు?

గొంతు—ఇక్కడ పనిచెయ్యవు.

దేశసేవిక, నర్తకి—అంతా వ్యర్థమేనా!

గొంతు—ఔను! ముందు ఆ దుస్తులు విసర్జించండి.

దేశసేవిక, నర్తకి—ఊహూఁ!

గొంతు—ఐతే, త్రిశంకుస్వర్గ మనుభవిస్తూ ఇక్కడే ఉండండి!

దేశసేవిక—కాని నే నిక్కడ ఉండలేను, ఈ అంధకారంలో!

నర్తకి—ఊహూఁ! నేనూను!

గొంతు—ఐతే నేను చెప్పింది చెయ్యండి.

దేశసేవిక—ఇంత మంచిచీర!......

నర్తకి—పోనీ ఈగజ్జలు......

గొంతు—ఊహూఁ! వల్లకాదు! వంటిమీద పీచీ ఉండకూడదు.

నర్తకి, దేశసేవిక—సరే! ఏం చేస్తాము! (దుస్తులు విడుస్తారు. విడవడంతోటే ఆకారరహితం ఐపోతారు) హాయి! అమ్మయ్య! ఎంత తేలికగా ఉందిప్పుడు! ఎగిరిపోతున్నా నేమిటి? ఇదేమిటీ వింతస్వేచ్ఛ! ఆహా!

గొంతు—ఐతే నువ్వు వెదుకున్నావన్నమాట.

జన్మించబోయేది—ఆమె చెప్పింది-ప్రపంచం కంటకావృతమని! ఇలా దిగంబరిగా వడితే, మానవులు నా మొహం చూడరట! నేను ఆమె వదిలేసిన బురఖా వేసుకుంటా! (వేసుకోగానే ఆకారం వస్తుంది) ఆఁ! ఇప్పుడు మానవలోకపు మన్ననలను పొందుతా! ఎంత బాగుం దీ చీర!

గొంతు—హాఁ! మళ్లా బురఖాలో దూరింది ఆత్మ! వెళ్లనీ!......ఎవ రాపవచ్చేది! రానీ! బురఖాలే! ఎంత అహంభావం మానవులకి!

(సన్నని సంగీతం)

---

# విరాసులు



= శ్రీ జయంతి ధర్మతేజ =

సనాతనకాలంలో, ప్రకృతిమాయలు అర్థంకాక పోవడంవల్లా, దైవభీతి ఘనీభవించి ఉండడంవల్లా, అప్పటి మానవస్వభావం, నేత్రాలకు గోచరంకాని అదృశ్యభూతాలవల్ల సకలరోగాలూ ఉద్భవిస్తున్నాయి అన్న ఊహను సృష్టించింది. మరీ వేదాంతులూ, కర్మయోగులు పూర్వజన్మపాపఫలం రోగకారణం అనేవారు. అయితే అప్పటి రోగకారణాలైన అదృశ్యభూతాలు మనుష్యుల మనోవికాసంతో పరిణామం పొంది, ౧౯ వ శతాబ్దం కొసరోజుల్లో ఫ్రాన్సుదేశంలో లూయీపాశ్చరు (౧౮౨౨-౯౫), జర్మనీదేశంలో రోబర్టుకోచు (౧౮౪౩-౧౯౧౦) - ఈ ఇద్దరు విజ్ఞానుల పరిశోధనలవల్ల, అసహాయచక్షువుకు గోచరంగాని సూక్ష్మక్రిములు, లేక "బాక్టీరియా" గా మారిపోయాయి. సన్నిపాతజ్వరం, కలరా, ప్లేగు మొదలైన సకలవిషవ్యాధులకూ, అణుమాత్రం ఉండి, భూప్రపంచం అంతా నిండిఉన్న ఈ బాక్టీరియా కారణం అని తేలిపోయింది. అలాగునే, ౧౮౯౨ లో, రష్యను శాస్త్రజ్ఞుడు ఐవనావుస్కీ బాక్టీరియా భూతాలకన్నా సూక్ష్మతరమైనవీ, శక్తి చక్షువు నిశితచూపులకుగాని అందనివీ అయిన విరాసులు (Viruses) అన్న విషాలను కనుక్కున్నాడు. బాక్టీరియావల్ల సృష్టిలో జీవజాతులకు ఎన్ని రోగాలు సంక్రమిస్తాయో, అన్ని రోగాలూ వృక్షకోటికీ, జంతుసంఘానికీ కూడా ఈ విరాసులవల్ల సంభవిస్తాయి. అయితే ఈ రెండు రకాల సూక్ష్మక్రిములకూ ఒక పరమ భేదం ఉంది- బాక్టీరియాలో రోగ జనితాలు అయిన జాతులు చాలా కొద్ది మాత్రమే. మిగతావన్నీ ప్రాణికోటి సహకారంగా బ్రతికేవీ, లాభకారులుకూడా. చెట్లలో మాంసకృత్తి పదార్థాలు ఏర్పడి మనకు పళ్లు, కాయలు, ధాన్యాలుగా చేకూరుతున్నాయి అంటే, బాక్టీరియా భూతాలే కారణం. విరాసులు అలాగ కాదు. వాటిస్వభావంబట్టి, మనజ్ఞానేంద్రియాలకు అవి గోచరించే పద్ధతుల లోటువల్ల మనకు తెలిసిన సుమారు ౨౦౦ విరాసులన్నీ రోగజనితాలే, విషపూరితాలే. ఈ సందర్భంలో సూక్ష్మక్రిములు (Germs) అన్నీ జీవజాతిలో ఒక్క బాక్టీరియా కాకుండా, ప్రోటోజోవా, ఫంగై (Protozoa, Fungii) అన్న జాతులుకూడా ఉన్నాయని జ్ఞాపకం పెట్టుకోవాలి. ఈ సూక్ష్మక్రిములన్నీ కృమిజాతులే. ప్రోటోజోవా, ఫంగైకూడా మలేరియా, తామర వంటి రోగాలను కలుగజేస్తాయి. విరాసజనితరోగాలు మరీ వింతైనవి.

పండిత జవాహర్లాలునెహ్రూ తన ఆత్మకథలో "నాభాలో అంతర్నాటకం" (Interlude at Nabha) అన్న ప్రకరణంలో వ్రాస్తూ, నాభాజమీందారీ జైలులోని చీకటికొట్లో కొన్నిదినాలు మ్రగ్గి, విడుదలఅయ్యేసరికి, తనతోకూడ స్వగృహానికి టైఫసు (సన్నిజ్వరం గాని సన్నిపాతజ్వరం కాదు; అంటే టైఫాయిడ్ అన్న బాక్టీరియాజనితరోగం కాదు) రోగమూలాన్ని తీసుకొనిపోయాననీ, తరువాత కొన్నివారాలు ఆ విషజ్వరంతో బాధపడ్డాననీ వ్రాస్తాడు. జైలులో ఉండే అశుభ్రతవల్ల జనించే పేనులకూ, ఈ టైఫసు విషజ్వరానికీ ఎటువంటి సంబంధం ఉన్నదీ తెలుసుకుందాం. విఖ్యాత ఆంగ్లరచయిత, కీర్తిశేషుడు అయిన జాన్ గాల్స్వర్దీ 'చిన్న మనిషి' (The Little Man) అన్న తన ఏకాంకిలో అద్భుతసంఘటన అంతా ఈ టైఫసుజ్వరంచుట్టూ అల్లుతాడు. టైఫసు ఒక విరాసజనితరోగం.

విజయనగరసామ్రాజ్యం విశాలోన్నతి చెందిన రోజుల్లో మన దేశానికి వచ్చిన చైనాదేశపు యాత్రికుడు హూయన్‌త్సాంగు కృష్ణదేవరాయలను వర్ణిస్తూ, పొట్టివాడు, విశాలవక్షుడు, దీర్ఘనేత్రాలుకలవాడు అని చెబుతూ స్ఫోటకంమచ్చలు మొహంమీద ఉన్నవాడని వ్రాస్తాడు. స్ఫోటకం లేక మసూచికం, పెద్దమ్మవారు అన్న రోగం అనాదినుండి మన దేశంలో ఉంది. అసలు మన దేశంనుండే చైనాకు, పశ్చిమదేశాలకు ప్రాకిందని విజ్ఞానుల ఊహ. మనప్రాచీనవైద్యగ్రంథాల్లో

మంత్రాలు చదువుతూ, బ్రాహ్మణులు, మశూచికానికి మందుగా ఇప్పుడువాడుకలోఉన్న టీకాలు (Vaccination)ను ప్రజలకు వేసేవారని ఉంది. కనుక అప్పటికే మశూచికం దేశంలో వ్యాపించి ఉండాలి. చైనాలో క్రీ. పూ. ౧౧౨౨ లోనూ, ఈజిప్టులో క్రీ. పూ. ౧౨౦౦ లోనూ ఈ వ్యాధి వ్యాపించి ఉండేదని చరిత్ర చెబుతుంది. మశూచికంకూడా విరాసుల మూలంగా జనించే వ్యాధి. మొదటి ప్రపంచసంగ్రామం అనంతరం, ౧౯౧౮-౧౯లో, ఆ సంగ్రామపురోభూమిలో పుట్టిన ఇన్‌ఫ్లూయింజా జ్వరంవల్ల ప్రపంచం అంతటా ౬౦ లక్షల జనం చనిపోయారనీ, మనదేశంలో ఆసంవత్సరంలోనే ఆజ్వరంవల్ల ౫౦ లక్షల జనం గతించారనీ లెఖ్ఖలున్నాయి. ఈ ఘోరమరణాలకు కారణం ఒక విరాసే.

ఉదాహరణలు పెంచుతున్నానని పాఠకులు అనుకున్నా సరేగాని, ఐర్లాండుదేశంలో ౧౯వ శతాబ్దంలో వచ్చిన కాటకం, అందువల్ల ౬౧ లక్షల మంది ఆ చిన్నదేశంలో మరణించడంగురించి చెప్పకుండా ఉండలేను. లయాంఓఫ్లహర్టీ (Liam O'Flaherty) అన్న రచయిత "కాటకం" (Famine) అన్న పుస్తకంలో ఈ కాటకంగురించి వ్రాస్తూ, దానికి ముఖ్యకారణం అయిన బంగాళాదుంపలకు కలిగిన రోగం, అందువల్ల దుంపల పైరు పాడయిపోవడం వర్ణిస్తాడు. మన దాక్షిణాత్యులకు వరిధాన్యం ఎలాగు ఆహారమో,ఐర్లాండువాసులకు ఆదుంప అంత ప్రాణాధారం. ఆ దుంపకు కలిగిన సంకటంవల్లనే, రాజకీయ కారణాలు అటుండనిస్తే, ఆదేశంలో కాటకం వ్యాపించింది. ఈ దుంపల సంకటం పెనుభూతంవంటి విరాసువల్ల పుట్టినదే. ఈ నాలుగువ్యాధులే కాకుండా మనుష్యులకూ, చెట్లకూ కలిగే విరాసజనితరోగాలు చాలా ఉన్నాయి. వాటి విషయం తరువాత ఎత్తుకుందాం.

రష్యనుశాస్త్రజ్ఞుడు ఇవానొవ్‌స్కీ ౧౮౯౨లో మొట్టమొదటి విరాసును కనిపెట్టాడని చెప్పాను. పొగాకు ప్రపంచంలో చాలా ముఖ్యమైన పైరుగా వ్యాపించింది. పొగాకుచెట్టు ఆకులు ఒక్కొక్కప్పుడు చుక్కచుక్కలుగానూ, గీతలేర్పడి, రంగు మారిపోయి, క్షీణించి, కురుచపడడం సైతుజనానికి తెలిసిన విషయమే. అయితే నేలలో సారం తగ్గిపోవడం వల్ల చెట్టు క్షీణించిందని అనుకుంటారు. ఈరోగానికి "పొగాకువర్ణరోగం"(Tobacco Mosaic Disease) అని పేరుపెట్టారు. ఇవానొవ్‌స్కీ అలా క్షీణించి ఉన్న ఆకుల్ని తీసుకొని, వాటిరసంతీసి, చేంబర్లాండు ఫిల్టరు అను వడపోతగొట్టంగుండా ఆ రసాన్ని వడపోశాడు. తెల్ల బంకమన్ను (Kaolin), తెల్ల ఇసుక (Quartz) తో చేసి కాల్చగా వచ్చిన పోర్సిలీను గొట్టాన్ని ఛేంబర్లేండుఫిల్టరు, లేక Candle అంటారు. ఏ ద్రవపదార్థాన్ని అయినా ఈ గొట్టంగుండా వడపోస్తే, బాక్టీరియావంటి సూక్ష్మక్రిములన్నీ గొట్టంలో ఉండిపోయి, గొట్టపు రంధ్రాలగుండా స్వచ్ఛమైన ద్రవపదార్థం దిగుతుంది. అంటే ఈ వడపోతయంత్రంలోని రంధ్రాలు సూక్ష్మక్రిములకన్నా మరీ చిన్నవి అన్నమాట. అయితే ఇవానొవ్‌స్కీ వడపోసిన పొగాకురసం పరిశుభ్రపడి సూక్ష్మక్రిమి విహీనం అయినా, మరికొన్ని పొగాకుచెట్లకు జాడ్యం కలుగజేసే శక్తి ఆ రసానికి మిగిలింది. దీనికి కారణం వడపోతకు వీలుగాని సూక్ష్మక్రిములే అయివుంటాయనీ, ఈ క్రిములకు వడపోతకు వీలుగాని విరాసులనీ (Non-filterable Viruses) అని పేరుపెట్టారు. అప్పటికి విరాసులను రోగజనిత పదార్థాలు అనే వాడుకున్నారు గాని, వాటిని కళ్ళతో చూడటం తటస్థించలేదు.

ఇవానొవ్‌స్కీతరువాత అనేకవిరాసులను కనుక్కున్నారు. పశువులకు వచ్చే పాదం నోరు(Foot & Mouth) రోగం, ఇన్‌ఫ్లుయింజా, టైఫసు, మశూచికం, మన్యజ్వరం (Yellow Fever), సీమకంకాయలకు వచ్చే మొలుగుజ్జురోగం వీటికి కారణాలైన విరాసులను ఈవిధంగా రసంతీసి, వడపోయడంవల్ల ఆచోకీ కట్టి కనిపెట్టారు. అయితే ఇప్పటికి కనిపెట్టబడిన ౨౦౦ విరాసులలో, సుమారు ౧౮౦ వృక్షరోగాలకు సంబంధించినవే. మిగతావిమాత్రం జంతువులను పీడిస్తాయి.

కొంతమంది ఒంటిమీదా, మొహంమీదా మొటిమెలు (Warts) మొలుస్తాయి. వయసుకాయలు (Pimples) కాని మొటిమెలు కొన్ని గుండ్రంగానూ, కొన్ని ఎత్తుగా చదునుగానూ ఉంటాయి. ఇవి అంటువ్యాధి అనీ, ఒకరినుండి ఇంకొకరికి పీటిరసం తగలడంవల్ల వ్యాపిస్తాయి అనీ ౧౮౯౩లో కనుక్కున్నారు. ఈ మొటిమెల రసం తీసి, వడపోస్తే వచ్చిన నిర్మలరసం కూడా మొటిమెలను కలిగించగలదని ౧౯౦౭ లో తెలిసింది. అందువల్ల మొటిమెల వ్యాధికి ఒక విరాసు కారణం అన్నారు. ఆ విరాసునుకూడా వేరుచేసి కనుక్కున్నారు. ఒక్కొక్కప్పుడు జ్వరం పోయినతరువాత ఆరాటంచేసిందని ఇంట్లో పెద్దలు చెప్పిన సందర్భాల్లో, పెదిమెలమీద చిన్నచిన్న పొక్కులు లేచి

తరువాత పెచ్చుకట్టి మానిపోతాయి. వీటిని జ్వర పొక్కులు (Fever Blisters) అంటారు. ఇదికూడ అంటువ్యాధే. కాని వీటికి కారణం అయిన విరాసు మన శరీరాల్లోనే అణిగి, మామూలుగా విచేతనంగా ఉండి, వర్షానికి కప్పలు బురదలోనుండి బైటపడ్డట్టుగా, జ్వరంవల్లనో, మరోవికారంవల్లనో వలవల పైకి వస్తాయని శాస్త్రజ్ఞుల అభిప్రాయం. కొన్నిరకాల బంగాళాదుంపల్లోకూడా ప్రకృతిసిద్ధంగా ఒక విరాసు మాటుపడి విచేతనంగా ఉండటని కనుక్కొన్నారు (Prince Edward Potato). కాని ఈ విరాసు మాత్రం ఇంకో బంగాళాదుంపకు ప్రాకే అంటువ్యాధి కాదు. అసలు ఏవ్యాధినీ కలిగించదుకూడా ఈవిరాసు. అందువల్ల స్వతహాగా కొన్ని జీవజాతుల శరీరాల్లో విరాసులు పుడతాయని ఒక వింత అభిప్రాయం.

అయితే, మనుష్యుల్లో తీవ్రవ్యాధి, మరణమే ఫలితంగా గలదీ అయిన విషవ్రణం (కాన్సరు) లేక మాంసార్బుదం ఒక విరాసువల్ల కలిగిఉంటుందా అన్న శంక కొంతమంది శాస్త్రజ్ఞులకు కలిగింది. కాన్సరు అన్న విషవ్రణం స్త్రీలకు, పురుషులకు, బిడ్డలకు హఠాత్తుగా కలిగి, వ్రణం మాన్పడానికి మందులేక పోవడంవల్ల, రోగి తీవ్రబాధ అనుభవించి మరణించడం కలుగుతుంది. స్త్రీల ప్రసవతిత్తిలో వ్రణం, ప్రేగుల్లో వ్రణం, స్త్రీల చన్నులకు వ్రణం, ఇంకా ఎన్నోరూపాల్లో ఈ కాన్సరు మనుష్యుల్లో ఉంది. కాని, ఒకరినుండి ఇంకొకరికి వ్యాపించే అంటువ్యాధి మాత్రం కాదని రూఢి అయింది. ఏటా ప్రపంచములో కొన్ని లక్షల మంది కాన్సరురోగులే. X - కిరణాలు, అల్ట్రాకయిలెట్టు కాంతికిరణాలు, న్యూట్రానులు అను పరమాణుకిరణాలు, రేడియము చికిత్సవల్ల, ఆడిలో శస్త్రచికిత్సవల్ల కొన్ని విషవ్రణాలను మాన్పుతూఉన్నారు వైద్యులు. అయినా ఈ వ్రణానికి ఫలానాచికిత్స అని తేలలేదు. శరీరంలో విచేతనంగా ఉన్న విరాసులు చైతన్యం పొందడంవల్ల ఈ విషవ్రణాలు కలుగుతున్నాయేమో అని ఇప్పుడు పరిశోధన చేస్తున్నారు. రౌసు సార్కోమా (Rous Sarcoma) అని కోళ్లకు కలిగే విషవ్రణం, కుందేళ్ల చెవులలో పుట్టే విషవ్రణాలు (Papilloma) విరాసులవలన కలిగినవే అని శాస్త్రజ్ఞులు తేల్చారు. కనుక విరాసుల పరిశోధనలవల్ల కాన్సరువ్యాధిని మాపుచేసే సాధనం దొరుకుతుందేమో నని ఎదురుచూస్తున్నారు.

చిన్నమ్మవారు (Chicken-Pox), ఆటలమ్మ (Measles), మశూచికం (Small-Pox) ఇవన్నీ ఒక కక్షకు చెందిన వివిధరోగాలు. మనం అంతా ఎప్పుడో ఒకప్పుడు వీట్లో ఏదొక్క జబ్బుతో అయినా బాధపడి ఇప్పటికీ ముఖంమీదా, శరీరంమీదా అందువల్ల కలిగిన మచ్చలతో ఉంటాము. చిన్నమ్మవారు వచ్చినవాడికి అదే వ్యాధి తిరిగీ రాదు. ఇది మామూలువిషయం. అలాగే మిగతా రెండుకూడాను. కాని చిన్నమ్మవారు వచ్చినవాడికి గాలి జల్లదని కాని, మశూచికం రాక పోవడంగాని లేదు. అవి వస్తే రావొచ్చు. అయితే చిన్నమ్మవారుకు, ఆటలమ్మకు విరుగుడుగా ఇంతవరకు ఏ టీకాలూ కనిపెట్టబడలేదు. కాని వాటికి కారణం అయిన విరాసులను ఇప్పుడు కనుక్కొన్నారు గాబట్టి వాటి విరుగుడు దొరుకుతుందేమో అన్న ఆశ కలుగుతూ ఉంది. కాని మశూచికానికిమాత్రం వాక్సినియా అన్న టీకాలువిరుగుడును జన్నరుమహాశయుడు (౧౭౪౯-౧౮౨౩) ౧౭౯౬ లో కనుక్కొన్నాడు. ఈ మూడు వ్యాధులూ అంటువ్యాధులనీ, ఇవి ఏ సహాయం లేకుండానే మనిషినుండి మనిషికి వ్యాపిస్తాయనీ ఏవైద్యుడైనా చెబుతాడు. జన్నరుమహాశయుని "వాక్సిను" మందు మరేమీ కాదు. ఆవుదూడకు కలిగే మశూచికానికి కారణం అయిన విరాసుక్రిమిమాత్రమే. అయితే ఆవుదూడకు తీవ్రవ్యాధి కలుగజేసే "వాక్సినియా" అనబడు విరాసు, మనిషికిమాత్రం, గుచ్చినచోటచిన్నకురుపు మాత్రం కలిగించిఊరుకుంటుంది. కాని మనిషిరక్తంలో రోగవిరోధులు అయిన Antibodies అను పదార్థాలను కలిగిస్తుంది. వాక్సినియావల్ల మన రక్తంలో కలిగిన రోగవిరోధులు, మశూచికం కలిగించే విరాసు శరీరంలో వ్యాపించి వ్యాధి కలుగజేయకుండా, ఆ విరాసును చంపడమో, అరికట్టడమో చేస్తాయి. ఇలాగుతే మనలో ఏ రోగక్రిమి ప్రవేశించినాసరే మన రక్తంలో ఉండే జీవాణువులు (Blood-cells) రోగవిరోధులను పుట్టిస్తాయి. కాని ఈ విరోధులను జయించి రోగక్రిములు వృద్ధిచెందినప్పుడు వ్యాధి పుడుతుంది శరీరంలో; సలక్షణంగా బయటపడుతుంది కూడాను. జెన్నరు తీవ్రవ్యాధి కలుగజేయని "వాక్సినియా" విరాసుతో మశూచికాన్ని పారద్రోలడానికి పన్నిన పన్నాగం చూడండి. కాని వాక్సినియా ఒక విరాసు అని జన్నరుకు అప్పటికి తెలియదు. ఇప్పటి శాస్త్రజ్ఞులు మశూచికాన్ని కలుగజేసే విరాసును మనిషిశరీరంలోనుండి కోతిశరీరంలోకి ఎక్కించి, కోతిలోనుండి కొన్నాళ్లకు ఆవుదూడలోకి ఎక్కిం

చారు. అప్పుడు ఆవుమూడిలో మనిషికి కలిగే మశూచికం విరాసు వాక్సీనియావిరాసుగా మారిపోయింది. విరాసులో కలిగిన మార్పును జీవపరిణామం (Mutation) అంటారు. ఒకజాతివిరాసు ఇంకో జాతివిరాసు అయిపోయిం దన్నమాట-ఉక్క నక్కగా మారిపోయి నట్లు. అన్ని విరాసులూ ఈ విధమైన జీవపరిణామం పొందుతాయి. ఒక జంతువులోనుండి ఇంకో జంతువు లోకి విరాసును మార్చి కృత్రిమంగా పరిణామం కలిగించడం శాస్త్రజ్ఞుడు కనుక్కున్నాడు. ఈ విధానం తెలియని జెన్నరు అనుభవంవల్ల వాక్సీనియాటీకాలను కనిపెట్టాడు. ఈ జీవపరిణామం X-కిరణాలవల్ల, అల్ట్రావయిలెట్టుకిరణాలవల్ల, పరమాణుకిరణాలవల్ల కొన్నిరకాల ఫువ్వుల చెట్టులలో, సూక్ష్మక్రిముల్లో కృత్రిమంగా శాస్త్రజ్ఞులు కలుగజేస్తున్నారు. Evolution అన్న జీవవికాసపరిణామం అనబడే ప్రకృతిసైద్ధాంతమువల్ల, సూక్ష్మక్రిమిరూపం అయి ఆదిలో ఉండిన జీవం (Life) ఇప్పటికి మనిషి గా మారింది. ఈ Evolution అన్న ప్రకృతి పరిణామం జీవజాతుల్లో, విరాసుల్లోవలె, అప్పుడప్పుడు కలుగుతూ వచ్చిన జీవపరిణామం వల్ల జరుగుతూ ఉందంటారు శాస్త్రజ్ఞులు.

ఇన్ఫ్లూయంజాజ్వరం జలుబుతో, దగ్గుతో, తలనొప్పితో, ఒళ్లునొప్పులతో, కీళ్లనొప్పులతో రావడం అందరికీ తెలిసిందే. జ్వరం వదిలేక రోగికి అమితనీరసం కలగడం, మనోదౌర్బల్యం ఏర్పడడం, దీనిమూలాన్న రోగి కోలుకునేరోజుల్లో, న్యుమోని యావంటి ఊపిరితిత్తుల రోగాలు, బాక్టీరియావల్ల కలిగేవి రావడం మామూలువిషయమే. ఈ ఫ్లూజ్వరం (Flu) గత ప్రపంచసంగ్రామంలో పుట్టిందని అభిప్రాయం. ఇది రోగి దగ్గడం, తుమ్మడం, చీదడం చేత బయల్పడే తుంపరలద్వారా గాలిలో వ్యాపించిన విరాసులవల్ల అంటువ్యాధిలాగా ఉప్పుపెరిగిపోతుం దని తెలుసుకున్నారు. ఫ్లూవిరాసును కనిపెట్టి, ఎలుక ల్లోనూ, మానుపిల్లుల్లోనూ దీన్ని పెంచి, ఆజంతువులకు ఫ్లూవ్యాధి కలుగుతుందని తెలుసుకున్నారు. మనుష్య జ్వరాన్ని ఎలుకల్లో పెంచడంచేత మనుష్యజ్వరవిరాసు పరిణామంపొంది నీరసించిన విరాసు అవుతుందనీ, ఆ విరాసును టీకాలమాదిరిగా ఇంజక్షనుద్వారా మను ష్యులకు ఎక్కించి, మనుష్యజ్వరం రాకుండా ఇప్పటి వరకు ౧౦ లక్షలమందిని కాపాడారు శాస్త్రజ్ఞులు. అలాగునే ఫ్లూజ్వరపువిరాసు ఎలుకల్లో నీరసించిన విరాసుగా మారడంలేదు. ఇందుకని ఈ విరాసును పెంచే ఇంకోమార్గాన్ని బర్నెట్టుమహాశయుడు కను క్కున్నాడు. దీన్ని egg-embryo technique-అంటే కోడిగ్రుడ్డులో పెంచే పద్ధతి అంటారు. కాస్త శాస్త్రవిజ్ఞానం ఉన్న ప్రతీవారికీ కోడిగ్రుడ్డు అంతర్భాగ నిర్మాణం తెలిసే ఉంటుందిగనుక నేను చెప్ప క్కరలేదు. అయితే పైచిప్పక్రింద రెండు పొరలు ఉంటాయనీ, గ్రుడ్డు మూదిమొనవైపు కొంత గాలి ఉంటుందనీ మాత్రం జ్ఞాపకంచెయ్యాలి. ఈ రెండు పొరల్లోనూ, క్రిందదానిమీద విరాసుని సన్నని గొట్టం ద్వారా, లేక సూదిమొనద్వారా ప్రవేశపెడుతారు. ప్రవేశపెట్టిన కొద్దిరోజుల్లోనే విరాసు అమితంగా విజృంభిస్తుంది. దాన్ని క్రొత్తగుడ్లకు మారుస్తూవస్తే, కొన్నాళ్లకు క్రొత్తగ్రుడ్డులో జీవకణాన్ని రెండు రోజుల్లోచంపెయ్యగలిగేటట్టుగా విజృంభిస్తుంది విరాసు. కాని విరాసుస్వభావం మారడంకూడా కలగవచ్చునని ఆశపడుతున్నారు శాస్త్రజ్ఞులు.

మనుష్యజ్వరాన్ని శరీరంమీద తెల్లని చారలుండే "Aedes Oegypti" అనుజాతిదోమ వ్యాపిచేస్తుం దని వాల్టరు రీడు అను అమెరికను కనుక్కున్నాడు. మలేరియాజ్వరాన్ని బోదజ్వరాన్ని కలిగించే క్రిములను కూడా ఇంకోరకమైన దోమలు వ్యాపిస్తాయి. దోమ శరీరంలో కొన్నాళ్లు ఈక్రిమి పెరిగితేతప్ప, ఆదోమ కరవడంవల్ల రోగం కలగదు. అలాగునే మనుష్యజ్వరానికి కారణం అయిన విరాసు ఈదోమలో ౧౦ రోజులు పెరిగితేతప్ప దోమ తన కాటువల్ల వ్యాధిని వ్యాపిచెయ్యలేదు. దోమ ఈ విరాసును మ్రింగిన మొదటివారంలో, విరాసు దోమలో చాలా కృశించి పోతుంది. అంటే విరాసుసంఖ్య క్షీణిస్తుందన్నమాట. కాని, ౧౦ రోజు లయ్యేటప్పటికి ఈ సంఖ్య పెరుగు తుంది. 3౦రోజులకు అత్యధిక సంఖ్యగా పెరుగుతుంది. దోమలో ౯౦ దినాలవరకు విరాసు జీవించేఉంటుంది. అయితే ఎలుకల్లోనూ, గ్రుడ్లలోనూ పెంచినట్లుగా, మనుష్యజ్వరవిరాసును దోమచర్మంలో పెంచు పద్ధతిని కనిపెట్టారు. కొన్ని లవణరసాల్లో (Serums, Solutions) చర్మం లేక కండగాని, మరేకణజాలం (Tissue) గాని వేస్తే, ఆ టిష్యూ పెరుగుతుందని కొంతకాలంక్రింద కనిపెట్టారు. ఈ పెంపకాన్ని Tissue - Culture అంటారు. దీన్ని డాక్టరు స్ట్రేంజివేసు (Doctor Strangeways) కనిపెట్టాడు. ఇలాగ కొన్నాళ్లు శరీరంలోని సుండె కాయను, కాలే

యాన్ని (Liver) కృత్రిమంగా పెంచారు శాస్త్రజ్ఞులు. కొన్ని టిష్యూలను సంవత్సరాలకొద్దీ పెంచి ఇప్పటికీ ఉంచారు. ఈ టిష్యూకల్చరుద్వారా దోమ రొమ్ముచర్మాన్ని పెంచి, దానిలో మన్యజ్వరవిరాసును కూడా పెంచారు. లక్షరెట్లు ఈ విరాసు పెరిగేటట్లు చెయ్యవచ్చుట ఈ పద్ధతిప్రకారం. బాక్టీరియాను ఏ పిండిపదార్థాల్లోనో, బలవర్ధకద్రావకంలోనో, పంచదారపానకంలోనో, లేక ఎగారు అను సముద్రపునాచు బంకలోనో పెంచవచ్చు; పెరిగిన బాక్టీరియా సంఘాన్ని కంటితో చూడవచ్చు. కాని విరాసును మాత్రం ఈ విధంగా బలవర్ధకద్రావకంలో, పానకంలో పెంచలేము. పెరిగేదాన్ని కంటితో చూడలేము. విరాసు జీవకణాల్లోనే పెరుగుతుంది. ఈ కణాలు సజీవాలు అయి ఉండాలి. పెరిగిందీ పెరగందీ మనం బాక్టీరియావలె కళ్లతో చూడలేము గనుక వేరే పద్ధతుల్లో తెలుసుకోవాలి. దోమ టిష్యూలో పెరిగిన విరాసును గుర్తించాలంటే, ఆ టిష్యూలోని రసాన్ని తీసి, దాన్ని నీటితో కలిపి, ఆ రసంద్వారా ఏ ఎలుకకో వ్యాధిని కలుగజేసి, ఎంత రసంలో ఎంత విరాసు ఉన్నదీ ఆ వ్యాధికలుగజేసే మోతాదువల్ల తెలుసుకోవాలి. ఇంకోమార్గం లేదు. దోమలో ౯౦ రోజులు మన్యజ్వరవిరాసు పెరిగినట్లే పందికి కలిగే ఫ్లూజ్వరానికి కారణంఅయిన విరాసు వానపాములో బ్రతికే ఒక పురుగులో నాలుగేళ్లు నివసిస్తుంది కావాలంటే. ఈ వానపాములోని పురుగు, పంది వానపామును మ్రింగడంవల్ల, పందిఊపిరితిత్తులలోకి రక్తనాళాలగుండా ప్రవేశించి అక్కడ ఇంకొన్నాళ్లు పెరిగి పెద్దదవుతుంది. పంది దగ్గినప్పుడు ఆ పురుగుద్వారా విరాసుకూడా బయటపడుతుంది. ఇంత వింతవిషయం సాధారణంగా చూడం.

అయితే ఇన్ఫ్లూయంజావిరాసు రోగిదగ్గితే గాలిలోకి చేరే తుంపరలవల్ల వ్యాప్తిచెందుతుందని చెప్పాను. మనకు సాధారణంగా కాలంమార్పువల్ల కలిగే జలుబు, పడిశంకూడా ఒక విరాసువల్లనే అని కనుక్కున్నారు. మనుష్యుల్లోకలిగే ఈరకమైన విరాసు జబ్బులన్నీ జనసమ్మర్దం ఉండేచోట కలిగే "భీడు రోగాలు" (Crowd diseases) తుంపరలమూలంగాను, తాకటం, సోకటంమూలానను మనిషీమనిషీమధ్య వ్యాపిస్తాయి. అందువల్ల నాగరికత కల ఏమనిషి అయినాసరే, కొంత బాధ్యత, సభ్యత కల వాడైతే తుమ్మడం, దగ్గడం మొదలైన పనులు ఏదేని రుమాలో అడ్డుపెట్టుకొని చెయ్యాలి. అలా చేయని వాడు ఇంకోమనిషికి విషంపెట్టినంత ద్రోహం చేసిన వాడవుతాడు. న్యాయం జరిగితే శిక్షార్హుడు అని తెలుసుకోవాలి. దగ్గులూ, తుమ్ములూవల్ల వ్యాధులు వ్యాపిస్తాయి అని తెలుసుకోవాలి.

మొదట్లో చెప్పిన టైఫసుజ్వరాన్ని మంచపుజ్వరం, జైలుజ్వరం అంటారు. శరీర అపరిశుభ్రత, పరిసరాల్ల అశుభ్రతవల్ల పేనులు శరీరంమీదా, జుట్టులోనూ పెరుగుతాయి. పేనులే టైఫసువిరాసును మ్రింగి ఒకచోటినుండి మరోచోటికి వ్యాప్తిచేస్తాయని తెలిసింది. అయితే అవి కరవడంవల్ల విరాసును రోగిరక్తంద్వారా మ్రింగినా, కాటువల్ల తిరిగి రోగాన్ని మాత్రం వ్యాప్తి చెయ్యవు. పేనల మలంద్వారా విరాసులు మన శరీరాల్లోకి గోకడువల్ల చేరుతాయి అని తెలిసింది. పాశ్చాత్యయువతులు కృత్రిమపద్ధతులద్వారా విద్యుత్తు నుపయోగించి, శాశ్వతంగా జుట్టును వంకలుతిప్పుకొనే అలవాటుపడిఉన్నారు. ఈ జుట్టుసంస్కరణకు Permanent wave లేక Perm అంటారు. తిరిగి దువ్వుకోడం కష్టం అవడంచేత నవీనపాశ్చాత్యయువతి ఈ Permలను కదల్చకుండా ఒక్కొక్కప్పుడు ౬ నెలలవరకూ ఉంచేసుకుంటుంది. అందువల్ల జుట్టులో విశేషంగా పేనులుపుట్టి వ్యాధికారణాలవుతాయని విదేశాల్లో శాస్త్రజ్ఞులు మొరపెడుతున్నారు. నూనె రాచుకొనో, మరోవిధమైన సంస్కారం చేసుకొని, రోజూ కొన్నిసార్లు తల దువ్వుకుంటూఉండే భారతస్త్రీ అలవాటు శ్రేష్ఠమైనది శాస్త్రరీత్యానూ. మన్యజ్వరం వ్యాప్తిచేసే దోమ విరాసువల్ల చావదుగాని, టైఫసువిరాసును వ్యాప్తిచేసే పేనుమాత్రం విరాసును మ్రింగిన ౧౧ దినాల్లో చస్తుంది.

పిచ్చికుక్క కాటువల్ల, రాబీసు లేక హైడ్రోఫోబియా (Rabies or Hydrophobia) అను పిచ్చికుక్కవాతం మనిషికి వచ్చి, కొన్నాళ్లకు కుక్కకూతలుకూసి, నీరుచూస్తే ముచ్చెమటలుపోసి, వళ్లు కొంకరలుపోయి యమయాతనపడే అవస్థ కలిగించే వ్యాధి మన దేశంలో ప్రబలిఉంది. ఇది మెదడు, వెన్నుపాము (Spinal Cord), కేంద్రనరాలకు కలిగే వ్యాధి. రాబీసువిరాసు నరాల్లో పెరిగి నరాలపై మెంటిమెలను పెంచి మనుష్యుణ్ని చేష్టలులేకుండాచేసి చంపుతుంది. ఈ భయంకరరోగం కుక్కకాటువల్లగాని కలగదు అని మొన్నటిదాకా అనుకునేవారు. కాని దక్షిణఆఫ్రికాలో అడవిగబ్బిలాలు (Vampire Bats) మన

మనుష్యుల్ని, జంతువులను కూడా కరవడంవల్ల రాబీసు వ్యాపిస్తుంది. అందువల్ల ఆదేశంలో ఈ వ్యాధిని అరికట్టడం ఎంత కష్టమో యోచించండి. ఉడుతలు, ముంగిస పిల్లులూ, నక్కలు, తోడేళ్లకుకూడా ఈ వ్యాధి వ్యాపిస్తుంది. కాని కుక్క, మనిషి పడ్డ బాధ మరేజంతువూ పడదు. పాశ్చరమహాశయుడు పిచ్చికుక్క బ్రతికి ఉండగా, దాని వెన్నులోని నరాన్ని, క్రమంగా ఎండించి, దానిలోని విరాసును శక్తిహీనంగా చేసి, అలాగ పరిణామం చెందిన రాబీసువిరాసు మనుష్యులకు హానిచేయదనీ, వారి రక్తంలో ఆ విరాసును నశింపచేసే విరోధులను (antibodies) జనింపచేయడానికి మాత్రం పనికివస్తుందనీ తెలుసుకున్నాడు. పాశ్చరుకు అప్పటికి రాబీసుకు కారణం ఒక విరాసని తెలియదు. అప్పటినుండి పిచ్చికుక్క కరచినవెంటనే ఏంటీ-రాబీసుసీరమును ఇంజక్షను ద్వారా ఇస్తే చికిత్స జరుగుతుంది. మదనపల్లికి రాబీసు రోగులను పూర్వంరోజుల్లో పంపేవారు. ఇప్పుడు విరాసులను పెంచేపద్ధతుల్లో మార్పులు చాలా తీసుకొచ్చారుగనుక, ఏంటీరాబీస్ సీరమును సులువుగా తయారుచేసే పద్ధతులు కనిపెట్టారు. కప్పకుకూడా రాబీసు వస్తుందట.

శిశుపక్షవాతం (Infantile Paralysis) తో కీర్తిశేషుడైన రూజువెల్టు అధ్యక్షుడు బాధపడి, కాళ్ల ఉపయోగం పోగొట్టుకొని, నిల్చుండలేకపోయినా తన పదవీకర్తవ్యాలను నిర్వహించడం లోకవిదితమే. ఇనుపపటకాలను కీళ్లకు తొడిగించుకొని ఎప్పుడో ఒకప్పుడు ఆయన నిల్చునేవాడు. ౧౫ ఏళ్లలోని బిడ్డలు ఈపక్షవాతం బాధ పడడం చాలామందికి తెలిసే ఉంటుంది. ఇది విరాసు జనితరోగమే. పెంపుడు చిలకలకు వచ్చేజ్వరం (Parrot fever, Psittacosis) వాటిని పెంచే మనుష్యులకు కూడ వచ్చి చంపడం కూడా ఉంది. ఇదికూడ విరాసువల్ల కలిగిందే. జంతులోకంలో ఆఖరకు తేనెటీగల గ్రుడ్లకుకూడా ఒక విరాసుజాడ్యం వస్తుంది.

వృక్షలోకంలో పొగాకువర్ణరోగం సీమవంకాయల చెట్లకు మొలగుజ్జు రోగంగా వస్తుంది. అందుచేత సీమవంకాయలు పెంచేతోటలపనివాళ్లు పొగాకును నములడం, పీల్చడం, పొడిగా పీల్చడం ఏమీ చెయ్యకూడదు. బంగాళాదుంపలకు, చిక్కుడు, బీర, పొట్ల, కాకర, తోటకూర, కాబేజి మొదలైన అన్నిరకాల కాయగూరచెట్లకు విరాసుజాడ్యాలు వస్తాయి. వీటిని చెట్టుచెట్టుకూ వ్యాపింపచేసే జంతువులలో ముఖ్యమైనవి రెండు—ఆకుపచ్చఈగ (Green fly-Aphis), మిడుత (Leaf-hopper). ఆకులను పళ్లతో కొరికి, కత్తిరించి తినే గొంగళిపురుగులవల్ల ఈ విరాసుజాడ్యాలు వ్యాపించవు. తమ దీర్ఘమైన సూదివంటి అవయవాల ద్వారా చెట్ల రసాన్ని పీల్చుకుత్రాగే పురుగులవల్ల ఇవి వ్యాపిస్తాయి. ఆరుద్రపువ్వులు, (Scarlet wall flowers), గుత్తి గులాబి (Tulip) పువ్వులు ఒక్కొక్కప్పుడు రంగుమారి ఎర్రనివి, పచ్చగీతలతోనూ ఇంకో విధంగానూ పుడతాయి. దీనికి కారణం ఒక విరాసు. చెట్లలో జీవకణాలను విరాసు మార్చడంవల్ల ఈ రంగుమార్పు కలుగుతుంది. ఆరుద్రపువ్వుకు వ్యాధి కలిగించే విరాసే కాబేజీకికూడా జాడ్యం పుట్టిస్తుంది. ప్రత్తిచెట్టు ఆకులను ముడిపెట్టురోగం (Cotton-leaf-crinkle disease), కోకో చెట్టు కొమ్మల్ని వాపుచేసే రోగం (Swollen-shoot Cocoa) ప్రమాదకరమైన విషరోగాలు. ఇవేగనక లొంగకుండా వ్యాపిస్తే, నూలుబట్టలూ, తినడానికి ఆకుకూరలూ లోటవుతాయి. దీనికి విరుగుడు ఏమిటి అంటే, ఈ విరాసులకు లొంగని జాతి చెట్లను సృష్టించడమే. అమెరికాలో విరాసులు ధ్వంసం చేసి చక్కెర పరిశ్రమనే పాడుచేస్తే, అమెరికనులు చక్కెరనిచ్చే బీటుదుంపల్లో క్రొత్తరకాలవాటిని, విరాసులను ఎదిరించడానికి, కర్ణుడికిమల్లే కవచకుండలాలు కలవాటిని విశ్వామిత్రసృష్టి చేశారు. అలాగునే బంగాళాదుంపల్లో రకాలు, మొక్కజొన్నలో రకాలు పుట్టించారు అంట్లు కట్టడం మొదలైన పద్ధతులద్వారా.

అయితే విరాసులను చూసే దెలాగ, వాటి లక్షణాలను తెలిసికొనే దెలాగ అని ప్రశ్నించుకున్నారు శాస్త్రజ్ఞులు. అప్పుడు అమెరికాలో స్టేన్లీ అను రసాయన శాస్త్రజ్ఞుడు విరాసులు అతిసూక్ష్మక్రిములు కాబట్టి, లవణాలలాగునే వాటినికూడా గుర్తించవచ్చని తెలుసుకొని, మామూలు రసాయనపద్ధతులద్వారా వాటిని మొట్టమొదట పొగాకురసంనుండి వేరుచేసేడు (Precipitated); అవక్షిప్తం చేసేడు. సముద్రంనీటిలోనుండి ఉప్పును వండినట్లుగా. సజీవపదార్థాలవలె ప్రవర్తించే విరాసులు, ఉప్పు పంచదారవలె స్ఫటికాలుగా, ఇసుకరేణువుల్లాగా ఒక పొడిగా బైట పడ్డాయి. ఆ పొడిరూపం విరాసును, పంచదారలోనుండి గ్లూకోసు పంచదారను విడతీసినట్లు, విరాసులోని నిర్మాణం, దానిలోని రసాయన పదార్థాలు ఏమిటో వెదుకుతున్నారు. విరాసు మనజుట్టు, మాంసం

మొదలైన పదార్థాల్లోని మాంసకృత్తు (Protein) పదార్థాలజాతికి చెందిన మాంసకృత్తే నని తెలిసింది. కర్త్రీలేని మాంసకృత్తే అయితే దానికి జీవమేమిటి? అది జీవపరిణామం ఎలా చెందుతుంది? లవణాలమల్లే స్ఫటికరూపంలో అవక్షిప్తం చేయవచ్చుకదా, దీని రూపం ఏమిటి అని ప్రశ్నించుకుంటున్నారు శాస్త్రజ్ఞులు. అసలు జీవపదార్థాలు ఇవీ, నిర్జీవపదార్థాలు ఇవీ అని నిర్ధారణచెయ్యడం దుస్సాధ్యం. కనుకనట అవి ఆహారాన్ని భక్షించి పెరగగలవి, వృద్ధిపొందగలిస్తే జీవపదార్థం అంటారు తేలికగా. కాని విరాసు, బాక్టీరియావలె గాకుండా, సజీవఅణువుల్లోనే, జంతుశరీరాల్లోనూ పెరుగుతుంది. కాని బైట అది విగతజీవిగా ఉండి, విచేతనం అయి పడిఉండి కొద్దికాలంలోనే నశించిపోతుంది. అందువల్ల జీవరహస్యం విరాసుల పరిశోధనవల్ల తేలుతుందేమో?

విరాసును కళ్లతో చూడడం అసంభవం. కళ్లతో దేనినైనా చూస్తున్నాం అంటే, ఆవస్తువు మీదపడిన కాంతికిరణాలు పరావర్తనం (Reflection) పొంది మన కంటిపాపలో పడడంవల్ల అని అందరికీ తెలుసు. మనకళ్లలో చర్మం మాంసంతో నిర్మింపబడ్డ దర్శని (lens) ఉంది. దీనికి కొన్ని హద్దు లున్నాయి. హద్దులు మీరి ఈదర్శని పనిచేయదుకనుక మనం సూక్ష్మవస్తువులను చూడలేం. కాని, రెండుగాజుదర్శనులను ఒకగొట్టంలో ఇమడ్చగా ఏర్పడ్డ సూక్ష్మదర్శని యంత్రంగుండా సూక్ష్మ క్రిములను చూడగలం. బాక్టీరియా మొదలైనవి మంచి సూక్ష్మ దర్శనులగుండా చూస్తే మన కళ్లకు కనపడతాయి. కాని బాక్టీరియాకన్నా విరాసులు మరీ చిన్నవి. కాంతికిరణాల కిరణపునిడివి (Wavelength) ౦. ౦౦౦, ౦౦, ౩౯ అంగుళాలు. అందుచేత ౨౫౦ × ౦. ౦౦౦, ౦౦౦, ౦౩౯ అంగుళాల వెడల్పు, లేక వ్యాసం ఉన్న వస్తువుకన్న పెద్ద వస్తువులనుగాని చూడలేము అన్నమాట. సుమారు ౧౦ వేల వస్తువులు, అలాంటివి ఒకదానికి తగిలి ఒకటి పెడితేగాని ఒక అంగుళంపొడవున ఉండవు. కాని మామూలు కాంతికిరణాలు కాకుండా, అల్ట్రావయిలెటు కాంతికిరణాలు (కళ్లకు కనబడనివి కాని కెమెరాతో చిత్రం తీయవచ్చు) సూక్ష్మదర్శని ఉపయోగించి, ౧౦౦ × ౦. ౦౦౦, ౦౦౦, ౦౩౯ అంగుళాల పొడవును మించిన వస్తువులను ఛాయాచిత్రం తీసిచూడగలం. ఈ రకం అయిన యంత్రాన్ని అల్ట్రామైక్రోస్కోపు అంటారు. అతి పెద్దదయిన విరాసు పరిమాణం ౨౬౫ × ౦.౦౦౦, ౦౦౦౦౩౯ అంగుళాలు (మైఫసువిరాసు), మశూచికం వాక్సీనియా విరాసు, ౨౦౦ × ౦.౦౦౦,౦౦౦,౦౩౯ అంగుళంమాత్రమే. కాని పసువులకు వచ్చే నోరూపాదం జబ్బువిరాసు పొడవు ౧౦ × ౦. ౦౦౦, ౦౦౦, ౦౩౯ అంగుళమే. మన నెత్తురులో ఉండే హెమోగ్లోబిను అను ఎర్రరంగు ఒక మాంసకృత్తు. దాని మిశ్రాణువు పరిమాణం ౬ × ౦.౦౦౦,౦౦౦,౦౩౯ మాత్రమే. అంటే అతి చిన్నవిరాసు ఈ మిశ్రాణువు కన్న ౧౦/౬ వంతులు పెద్ద. ఇంత చిన్నవిగనకనే విరాసులు మాంసకృత్తులే అని శాస్త్రజ్ఞుల వాదన. సకలఅణువుల్లోఉండే ఎలక్ట్రానుల కిరణాల కిరణపునిడివి కాంతికిరణపునిడివికన్న ఒకలక్షరెట్లు తక్కువ. అందుచేత ౫ × ౦. ౦౦౦, ౦౦౦, ౦౩౯అంగుళాలపొడవు ఉన్న వస్తువుకంటె అన్నివస్తువులను ఎలక్ట్రానుకిరణాలద్వారా చూడొచ్చు. అంటే అన్ని విరాసులను చూడొచ్చును, ఛాయాపటాల్లో. ఇందుకని ఎలక్ట్రానుమైక్రోస్కోపు అను శక్తికిరణసూక్ష్మదర్శనిని తయారు చేసేరు. ఇందులో గాజు దర్శనులకుబదులు అయస్కాంతపుదిమ్మల నుపయోగించి, ఎలక్ట్రానుకిరణాలను వస్తువుపై కేంద్రీకరిస్తారు. ఈ యంత్రంతోనే విరాసులను శక్తిచక్షువుతో శాస్త్రజ్ఞుడు చూస్తున్నాడు.

విరాసుల పరిశోధనకు స్టేన్లీ మహాశయుడికి ఈ యేడు నోబెలుబహుమతి ఇచ్చారు.






— శ్రీ మావిండిపూడి వెంకటరంగయ్య —

ప్రపంచములోని దేశములన్నియు పరస్పరాశ్రయములు. ఏ దేశము గాని ఇతర దేశముల సహాయము లేక వృద్ధిగాంచుట సాధ్యము కానిపని. రాకపోకలకుగాను సౌకర్యములు లేని కాలమందలి పరిస్థితులకును, ఇప్పటి పరిస్థితులకును ఎంతో తారతమ్యమున్నది. ఏదేశము గాని స్వయంపోషకముగ నుండుటకు ప్రయత్నించుట తెలివితక్కువ. ఇతర దేశములతోటి సంబంధమును అధికము చేసుకొనినయెడల ప్రపంచములోని ప్రజలందరు ఇప్పటికంటె ఎన్నిరెట్లో ఎక్కువగ భోగభాగ్యముల ననుభవించుటకు వీలుండును. ఇటి ఆర్థిక సంబంధము వృద్ధిగాంచుటమూలమున స్నేహభావము పెరిగి, ప్రపంచమందు శాంతిభద్రతలు సులభముగ స్థాపితము కాగలవు. యుద్ధములు అంతరించుటకు గాని, వాటి తీవ్రత తగ్గుటకు గాని ఇదియే సాధనము.

## అమెరికా సహాయము

ఈ సాధనమును ఆచరణలో పెట్టుటకై అమెరికా ప్రధానకార్యదర్శియగు మార్షల్ యూరపుఖండవాసుల సహాయార్థమై జూన్ నెలలో ఒక సూచనను చేసెను. యూరపుఖండములోని ప్రజలు రెండవ ప్రపంచ యుద్ధముమూలమున ఎంతో నష్టపడిరి. వ్యవసాయము, పరిశ్రమలు, గనులు, రవాణాసౌకర్యములు—అన్నియు వినాశముగాంచెను. అమెరికా ఇట్టి నష్టమును పొంది యుండలేదు. ఇంతేగాక యుద్ధకాలమందు అమెరికాలోని వ్యవసాయము, పరిశ్రమలు విపరీతముగ పెరిగెను. వారు పూర్వముకంటె ఇప్పుడు ఎన్నోరెట్లు ఎక్కువగ సమస్తపదార్థములను తయారుచేయుచున్నారు. యూరపుఖండములోని దేశములవారందరు కలిసి, మొత్తము మీద వారికెంత సహాయము కావలసినదీ చెప్పగలిగిన యెడల అంతటి సహాయమును తాము చేయుటకు సిద్ధపడినట్లు మార్షల్ సూచించెను. ఈ సూచనకు ప్రధానమైన ఆధారము యూరపులోని దేశములవారందరు కలిసి పనిచేయవలయు ననుటయే.

## ముగ్గురుమంత్రుల సమావేశము

అట్టి ఐకమత్యమును సాధించుటకై బ్రిటిష్ మంత్రియగు బెవిన్, ఫ్రాన్సుమంత్రియగు బిడో, రష్యామంత్రియగు మాలటోవులకు ఆహ్వానము పంపుటయు, ఈ ముగ్గురు మంత్రులు జూన్ ౨౭ తేదీ ప్యారిస్ నగరములో సమావేశమగుటయు చదువరులకు తెలిసియున్నది. కాని గతమాసపు భూప్రదక్షిణమున సూచించినట్లు ఈ సమావేశము జయప్రదముగ జరుగలేదు. మాలటోవునకును, తక్కిన ఇద్దరుమంత్రులకును మధ్యన తీవ్రమగు అభిప్రాయభేదములు కలిగెను. అమెరికాయొక్క ఆర్థికాధిపత్యమును, తద్వారా రాజకీయాధిపత్యమును యూరపుదేశములపై స్థాపించనుద్దేశించియే మార్షల్ తన

ప్రణాళికను ఏర్పాటుచేసె నను అనుమానము మొలటోవుకు కలిగెను. యూరపుదేశము లన్నియు కలిసి పని చేయుట అవసరము లేదనియు, ఏదేశమునకు ఎంత సహాయము కావలెనో ఆ దేశమున కాసహాయము చేయుటకు అమెరికావారు సిద్ధపడవలెననియు వాదించెను. కాని దీనికి తక్కిన ఇద్దరు మంత్రులు అంగీకరింపరైరి. అంతటితో సమావేశము భగ్నమయ్యెను.

## ప్యా రి స్ స భ

కాని బెవిన్ బీడోమంత్రులు దీనితో నిరుత్సాహపడక రష్యావారి సహకారము లేకున్నను తక్కిన దేశముల సహకారముతో మార్షల్ సూచనను ఆచరణలో పెట్టుటకు కావలసిన ప్రయత్నములు చేయుదలచి, ఆ దేశముల ప్రభుత్వమువారికి ప్యారిస్‌లో జరుగబోవు మరియొక సభకు రావలసినదని ఆహ్వానమంపిరి. అట్లు ఆహ్వానింపబడిన ఇరవై రెండు దేశములలో ఆరుతప్ప తక్కిన పదహారు దేశముల ప్రభుత్వమువారు ఆహ్వానమునంగీకరించి ప్యారిస్‌లో సమావేశమై మార్షల్ ప్రణాళికను విమర్శించి, అందులోని వివరముల నన్నిటిని నిర్ణయించుటకు ఒక ఉపసంఘమును ఏర్పాటుచేసిరి. ఈ ఉపసంఘమువారు ఆ పదహారుదేశములకు సంబంధించిన ఆర్థిక అవసరములను నిర్ణయించి ఒక నివేదికను తయారుచేయు ప్రయత్నములో ఉన్నారు. ఈ నివేదికలో యూరపునకు అమెరికానుండి ఎంత సహాయము కావలసినదీ తెల్పబడును. దానిని ఆధారముచేసుకొని అమెరికావారు వారికి సహాయముచేయగలరని చెప్పవచ్చును.

## ఆ ర్థి క మాం ద్య ము

అమెరికావారు యూరపుఖండవాసులకు సహాయముచేయుటలో ఉద్దేశ మేమి? ఇది ఉచితసహాయము కాదు. వర్తకవ్యాపారములమూలమున జరుగునట్టి సహాయము. అమెరికాలో ఎంతో ఎక్కువగ వస్తుసామగ్రి తయారగుచున్నది. దానిని విదేశములకు ఎగుమతిచేసి అచ్చట విక్రయించినగాని వారికి ఎక్కువ లాభము దొరకదు. విదేశములకు ఎగుమతిచేయుటకు వీలులేనియెడల అమెరికాలో వాటి ధరలు తగ్గిపోవుటయు, వర్తకమాంద్యము సంభవించుటయు, ఫ్యాక్టరీలు మూతవేయబడుటయు, ఆకారణముచేత కార్మికులకు పనిపాటలు దొరకక నిరుద్యోగసమస్య ఏర్పడుటయు సంభవించును. మొందటి ప్రపంచయుద్ధము ముగిసినతర్వాత కొన్ని సంవత్సరములకు ఇట్టి ఆర్థికమాంద్యము కలిగి దానిమూలమున అమెరికాలోనే గాక ప్రపంచములోని అన్ని దేశములందును ధరలు పడిపోవుటయు, వ్యవసాయదార్లు, పెట్టుబడిదార్లు, కూలివాండ్రు—అందరు నష్టపడుటయు సంభవించెను. ఇప్పుడు కూడ అట్టి కారణములమూలమున అమెరికాలో ఆర్థికమాంద్యము కలిగినయెడల అక్కడివారు ఎక్కువనష్టమును పొందవలసియుందురు. ఆనష్టమునుండి తప్పించుకొనుటకు యూరపుఖండమునకును, ఇతరదేశములకును అమెరికాలో ఉత్పత్తియగు వస్తుసామగ్రిని ఎక్కువగ ఎగుమతిచేయుటతప్ప ఉపాయాంతర మేదియు లేదు. కాని యూరపుఖండవాసులు అమెరికావారి వస్తువులను డబ్బిచ్చి కొను స్థితిలో ప్రస్తుతము లేరు. కొన్ని సంవత్సరములవరకు వారు ఇట్టి స్థితిలోనికి రాజాలరు. ఈ మధ్యకాలమున వారు అమెరికాలో తయారగు వస్తువులను అరువుపద్ధతిమీద కొనవలసియున్నారు. అమెరికాయొక్క సహాయమనిన, ఈ అరువుపద్ధతిమీద వారి సరుకులను యూరపువారికి ప్రస్తుతము విక్రయించుటయే. ఈ వస్తువులలో చాలభాగము యంత్రములు, బొగ్గు, ఎరువుల రూపమం దుండును. ఆకారణముచేత వాటిని కొనుగోలుచేయు యూరపుఖండవాసులు కొన్ని సంవత్సరముల కాలములో వారి వ్యవసాయము, పరిశ్రమలను పునరుద్ధరించుకొని, ఎక్కువ పదార్థములను తయారుచేసి, వాటిలో కొంతభాగమును తమ అనుభవమునకు ఉంచుకొని, తక్కిన భాగమును అమెరికావారి ఋణమునుతీర్చుటకై వినియోగింపగలవారగుదురు. గనుక మార్షల్‌సూచన ఉభయులకును—అమెరికావారికి, యూరపుఖండవాసులకు—లాభకరమైనదే. ఇది వర్తక సరళిని చేయబడిన సూచన యను కారణముచే త్రోసి వేయతగ్గది కాదు. కష్టపడి వ్యవసాయము చేయుదలచినను పెట్టుబడి పెట్టలేని బీదరైతునకు బ్యాంకిచేయు సహాయమువంటిదే యూరపుఖండవాసులకు అమెరికా చేయుదలచుకొన్న సహాయము.

## రష్యా వైఖరి

కాని రాజకీయస్పర్ధమూలమున రష్యావారు మార్షల్ సూచనను నిరాకరించిరి. ఈ సూచనమూలమున అమెరికావారి ప్రాబల్యము యూరపులో అధికమగునన్న భయము వారికి గలదు. తాము ఆసూచనను నిరాకరించినను ఇంగ్లీషువారు, ఫ్రెంచివారు కలిసి దానిని ఆచరణలో పెట్టుటకు కంకణముకట్టుకొని ప్యారిస్ నగరములో పదహారురాజ్యముల సమావేశమును సమకూర్చిన కారణమున రష్యాకును వీరికిని మధ్య మరికొంత విరోధము ఏర్పడుటకు అవకాశము కలిగెను. ఈ కారణముచేత అమెరికాపట్ల రష్యా కిదివర కుండిన స్పర్థ, విరోధము మరికొంచెము అధికమయ్యెను. దీనికిఫలితముగ రష్యావారు తూర్పుయూరపుదేశములలో తమకు గల ప్రాబల్యమును వృద్ధిచేసుకొనుచున్నారు. ఈ దేశములవారు కొందరు ప్యారిస్ సమావేశములో పాల్గొన సిద్ధపడియుండినను వారిని బలవంతపరచి అందులో పాల్గొనకుండ చేసిరి. ముఖ్యముగా ఇది జెకోస్లోవేకియా విషయమున జరిగెను. కమ్యూనిస్టుపక్షముల ప్రాబల్యమును ఈదేశము లన్నిటిలో వ్యాపింపజేయుటకై వారు మరికొన్ని ఏర్పాటులను చేసిరి. రుమేనియా దేశములో అపక్షమునకు చెందని రాజకీయపక్షములు అక్రమసంఘములని వాటిని రద్దు చేయించిరి. వారియొక్క ప్రోద్బల ముండుటచేత వారి అనుచరులగు యూగోస్లావియా, ఆల్బేనియా, బల్గేరియావారు గ్రీసుదేశములోని కమ్యూనిస్టులకు సహాయముచేయుచు, కమ్యూనిస్టుల మూలమున గ్రీసు ప్రభుత్వమునకు కలుగుచుండు ఇబ్బందులను మరికొంత వృద్ధి చేయుచున్నారు.

ప్యారిస్ సభ భగ్నమగుటమూలమున రష్యాకును, పాశ్చాత్యదేశములగు ఇంగ్లండు, ఫ్రాన్సు, అమెరికాలకును మధ్య విరోధ మభివృద్ధిగాంచుచున్నది అనుకొనుటకు మరికొన్ని నిదర్శనములుకూడ జూలై నెలలో కనుపించినవి: (౧) నాలుగైదునెలలుగా రష్యావారు, ఇంగ్లీషువారు తమ రెండు దేశములమధ్యన జరుగుచుండు వ్యాపారమును వృద్ధిచేసుకొను ఉద్దేశముతో కొన్ని సంప్రతింపులు జరుపుచుండిరి. ఇవి జయప్రదము కాగలవని అందరును ఆశించుచుండిరి. కాని ఇవికూడ భగ్నమైనట్లు తెలియవచ్చుచున్నది. (౨) రెండవ ప్రపంచయుద్ధములో జర్మనీపక్షమున చేరి మిత్రమండలివారితో యుద్ధముచేసిన ఇటలీ, రుమేనియా, హంగరీ, బల్గేరియా, ఫిన్లాండులతో కొన్నినెలలక్రిందట శాంతి ఒడంబడికలు జరిగినను అవి ఖాయపడవలసియుండెను. ఇంగ్లండు, అమెరికాదేశములు వీటిని ఇదివరకే ఖాయపరచెను. కాని రష్యావారు ఖాయపరచుట వాయిదా వేసినట్లు కొద్దిరోజులక్రిందట తెలియపరచిరి. (3) ౧౯౪౫ కు పూర్వము జపాన్ పరిపాలనలో ఉండిన కొరియా దేశములో ఉత్తరభాగము రష్యా పాలనలోను, దక్షిణభాగము అమెరికా పాలనలోను ఉన్నది. దేశమును ఈ విధముగ విభాగముచేయుట మూలమున ప్రజలకు అనేకకష్టములు కలుగుచున్నవి. అందుచేత దేశమునకంతకు ఒకే సంయుక్తప్రభుత్వమును స్థాపించు నుద్దేశముతో రెండు నెలలనుండి అమెరికావారు, రష్యావారు ఒక సభను సమకూర్చి వివరములనుగురించి ఆలోచించుచుండిరి. ప్యారిస్ సభ రద్దగుటచేత ఈ సభకూడ రద్దయ్యెను. అగ్రరాజ్యముల మధ్య ఏర్పడిన స్పర్థల వలన ఏపాపము ఎరుగనట్టియు, స్వాతంత్ర్యమును చవి చూచుటకు ముప్పైసంవత్సరములుగ వేచియున్నట్టియు కొరియా ప్రజలు చిక్కులపాలగుచున్నారు. "పిల్లికి చెరలాటము, ఎలుకకు ప్రాణసంకటము" అను పూర్వోక్తి స్మరణకు వచ్చుచున్నది. (౪) ఉత్తర కొరియాపై తమ అధికారమును రష్యావారు వదలుకొనునట్లు లేదు; దానిని కమ్యూనిస్టురాష్ట్రముగ వారు మార్చివేయుచున్నారు. అక్కడి ప్రజలనేకులకు సైనికశిక్షను నేర్పి, చైనాలో కమ్యూనిస్టులకును, జాతీయ ప్రభుత్వమునకును జరుగుచుండు అంతర్యుద్ధములో కమ్యూనిస్టుల పక్షమున యుద్ధముచేయుటకు పంపుచున్నారు. (౫) జపాన్ రెండు సంవత్సరములుగ అమెరికావారి ఆక్రమణలో నున్నది. ఇప్పుడు అచ్చట ఒక ప్రజాప్రభుత్వము స్థాపింపబడినది; సామ్రాజ్యవాదులందరు నిహతులైరి; ప్రజలు నిరాయుధులుగ చేయబడిరి. అందుచేత జపానుతో ఒక శాంతిఒడంబడికను చేసుకొనుటకు కాలము వచ్చినదనియు, ఆ ఒడంబడిక షరతులను నిర్ణయించుటకు ఒక సభ జరుగవలెననియు,

ఆ సభలో జపానును అణచుటయందు పాల్గొనిన పద కొండు దేశములవారు పాల్గొనవలెననియు చెప్పుచు, అమెరికా ప్రభుత్వమువారు కొద్దిరోజులక్రిందట ఆ దేశములవారికి ఆహ్వానమంపిరి. కాని రషియావారు అట్టి సభ జరుగకూడదనియు, ఈ నిర్ణయము పెట్టమొదట అగ్రరాజ్యములవారు—రషియా, ఇంగ్లండు, అమెరికా, ఫ్రాన్సు—మాత్రమే ఆలోచింపవలెననియు, ఇతరులను ఆహ్వానించుట తగదనియు ఆక్షేపించుచున్నారు. (౬) రషియావారి స్పర్థ ఇంతటితో ముగియలేదు. గ్రీసు దేశమందలి కమ్యూనిస్టులకు రషియా అనుచరవర్గములో చేరిన అల్బేనియా, యూగోస్లావియా, బల్గేరియా ప్రభుత్వములవారు సహాయము చేయుచున్నారని ఐక్యరాజ్యసమితివా రేర్పరచిన సంఘమువారు ఋజువుచేసి, అట్టి అక్రమచర్యను అపుటకై గ్రీసు సరిహద్దులలో ఐక్యరాజ్యసమితియొక్క విచారణసంఘ మొకటి కొన్ని సంవత్సరములు కాపలాయుండుట అవసరమని నివేదించిరి. అట్టి సంఘమును ఏర్పరచుటకై భద్రతా సంఘమువారొక తీర్మానము చేయజూచిరి కాని రషియావారు దానిని ప్రతిఘటించినందున అది జరుగుటకు వీలుకాదయ్యెను. గనుక రోజురోజుకు అగ్రరాజ్యములమధ్య ఏర్పడిన స్పర్థ వృద్ధిగాంచుచున్నది.

## పశ్చిమదేశముల వైఖరి

రషియావారు వారి ప్రాబల్యమును వృద్ధిచేసుకొనుటకును, ఇంగ్లండు అమెరికాల పలుకుబడిని తగ్గించుటకును ప్రయత్నము చేయుటలో ఆశ్చర్యమేమియు లేదు. దీనికి ప్రత్యామ్నాయముగ ఈ రెండుదేశములవారు కూడ వారికి తగిన చర్యను తీసుకొనుచున్నారు. చైనాలోని జాతీయప్రభుత్వమును బలపరచి కమ్యూనిస్టులను ఓడించుటకై ఎట్టి ఏర్పాట్లు చేయవలసియున్నవి, ఎంతటి సహాయము అవసరమైనదీ నిర్ణయించుటకు అమెరికా అధ్యక్షుడు ఒక ప్రత్యేక రాయబారిని చైనాకు పంపెను. అత డిప్పుడు చైనాలోని పరిస్థితులనన్నిటిని విమర్శపూర్వకముగ పరీక్షచేయుచున్నాడు. జర్మనీ విషయమై తమకును, ఫ్రెంచివారికిని మధ్య ఇటీవల ఏర్పడిన అభిప్రాయభేదములను సవరసపరచుకొను ఉద్దేశముతో కొన్ని సంప్రతింపులు ప్రారంభించియున్నారు. ఇట్లే ఇంగ్లీషువారు ఫ్రెంచివారితో ఎక్కువ సన్నిహితసంబంధమును సమకూర్చుకొనుటకు ప్రయత్నము చేయుచున్నారు. ప్యారిస్ సభనుండి రషియా విడిపోవుటమూలమున కలిగిన ఫలితములలో ఇంగ్లండు ఫ్రెంచి దేశములమధ్యన ఎక్కువ ఆనుకూల్యము ఏర్పడుట ఒక గొప్ప ఫలితమని చెప్పవచ్చును.

జూలై మాసమున భూప్రదక్షిణము చేయువారికి ముఖ్యముగ గోచరించు విషయ మొక్కటే. అగ్రరాజ్యములగు రషియా అమెరికాలమధ్యన స్పర్థ, విరోధము దినదినాభివృద్ధి గాంచుటయే ఈ విషయము.

## ఇండోనీషియా

ఇదిగాక మరియొక విషయము ప్రపంచపుదృష్టి నంతను ఆకర్షించియున్నది. ఇండోనీషియాలో డచ్చి ప్రభుత్వమువారు ఇండోనీషియన్ రిపబ్లిక్‌తో చేయుచుండు అక్రమయుద్ధమే ఈ విషయము. (దీనినిగురించి గతమాసపు భూప్రదక్షిణమున కొంత ప్రశంస యున్నది. దానిని ఆధారముచేసుకొని ఈ వివరణమును చదువుట మంచిది) అయిదునెలలక్రిందట డచ్చివారు రిపబ్లిక్ అధికారులతో 'లింగర్జతిఒడంబడిక' అను ఒడంబడికను చేసుకొని జావా సుమత్రాద్వీపములలోని చాల భాగము రిపబ్లిక్ ఆధిపత్యమున నుండుట కంగీకరించిరి. కాని ఈ ఒడంబడికలోని కొన్ని షరతుల వ్యాఖ్యానముగురించి ఇరుపక్షములవారికి అభిప్రాయభేదములు కలిగెను. అందుపై డచ్చివారు మరికొన్ని షరతులకు రిపబ్లిక్‌వారు అనుమతించవలసినదిగ కోరిరి. రిపబ్లిక్‌వారు ఒక షరత్తుతప్ప తక్కినవాటికన్నిటికి అంగీకరించిరి. రిపబ్లిక్ ఆధిపత్యములో నుండు ప్రదేశములలోని పోలీసుపనులలో డచ్చివారుకూడ నుండవలెనను షరత్తును రిపబ్లిక్‌వారు నిగ్రహించిరి. ఇట్టి షరత్తు వారి స్వాతంత్ర్యమునకును, గౌరవమునకును భంగకరమని వేరుగ చెప్పనక్కరలేదు. కాని దీనివిషయమై కూడ వారు ఆలోచించుటకు సిద్ధముగ నున్నట్లును, అర గంటలకాలము నిరీక్షించియుండవలెననియు వారు డచ్చివారిని కోరిరి. కాని ఆకోరికను డచ్చివారు నిరాకరించి వెంటనే యుద్ధమునకు పూనిరి.

## డచ్చివారి దుండగము

ఈ విధముగ యుద్ధమునకు దిగుట లింగర్జతి ఒడంబడికకు విరుద్ధము. ఆ ఒడంబడికకు సంబంధించిన షరతులనుగురించి అభిప్రాయభేదములు కలిగినయెడల వాటినన్నిటిని మధ్యవర్తులద్వారా పరిష్కరించుకొనునట్లు వా రాఒడంబడికలోనే నిర్ణయించుకొనిరి. అట్టి పరిష్కారమునకు తాము బద్ధులగుటకు సిద్ధముగ నున్నట్లు రిపబ్లిక్ అధికారులు పదేపదే చెప్పిరి. కాని డచ్చివారు వారి మాటలను పెడచెవిని బెట్టిరి. తగిన మధ్యవర్తులు లేకపోవుట కాదు దీనికి కారణము. ఇంగ్లండుప్రభుత్వమువారు యుద్ధము రానున్నదని గ్రహించి, తత్పూర్వమే తాము రెండుపక్షములవారికి మధ్యవర్తులుగ నుండుటకు సమ్మతించిరి. కాని డచ్చివారికి అది నచ్చలేదు. వారు యుద్ధమున కుపక్రమించిరి. మొదటినుండియు వారు దౌర్జన్యము నుపయోగించి, తమ సామ్రాజ్యాధికారమును పునఃప్రతిష్ఠచేసుకొనుటకు నిశ్చయించుకొన్నవారు. వారికడ్డ టాంకులు, కవచయుతములగు మోటారులు, విమానములు, లక్ష ఇరవై వేల సైన్యము ఉండెను. అందుచేత వారు ప్రచండముగ యుద్ధముచేసి పట్టణములను, పల్లెలను నాశముచేసిరి. రిపబ్లిక్ అధికారులు వారితో పరిసమానముగ యుద్ధము చేయలేనివారై, తమ పంటలు, తోటలు, ఫ్యాక్టరీలు వారిచేతులలో పడుట కిష్టపడక వాటిని తామే నాశముచేసిరి. ఈవిధముగ యుద్ధము ప్రారంభమై రెండు వారములు కాకున్నను కలిగిన జననష్టము, ద్రవ్యనష్టము అపారము.

## ఇండియా జోక్యము

ఇట్టి క్లిష్ట సమయమున రిపబ్లిక్ అధికారులు ఇండియాయొక్క సహాయమును కోరుటలో ఆశ్చర్యమేమియు లేదు. రిపబ్లిక్ ప్రజలు ఆశియాఖండవాసులు. మనముకూడ ఆశియాఖండవాసులమే. మనవలె వారు కూడ పాశ్చాత్యుల సామ్రాజ్యాధికారబంధనమును త్రెంచివేసుకొనుటకు పోరుచున్నవారు. స్వాతంత్ర్యమునకై పోరాడు ఆశియాఖండవాసులందరికి మనము యథాశక్తి సహాయముచేయ సిద్ధపడియుండవలెను. వారందరు మన నాయకత్వమును అనుసరించుట కంగీకరించియున్నారు. ఇదిగాక ఇండోనీషియాలో ప్రారంభమైన ఈ యుద్ధము క్రమక్రమముగ తక్కిన ప్రాంతములకుకూడ వ్యాపించ నవకాశమున్నది. ఈ కారణములచేత పండిత నెహ్రూ రిపబ్లిక్ అధికారులకు సహాయము చేయ నిశ్చయించి, దానికి ప్రాతిపదికగా ఈ వ్యవహార విషయమై భద్రతాసంఘములో ఫిర్యాదు గావించెను. ఈ సంఘము ఐక్యజాతిసంస్థయొక్క కార్యనిర్వాహక సంఘము. ప్రపంచములో యుద్ధము లేకుండచేయుటయు, యుద్ధపరిస్థితులు ఏర్పడినప్పుడు రాజీమార్గమున వివాదముల పరిష్కరించుటయు దీనియొక్క ఉద్దేశము. దీనిని పురస్కరించుకొనియే నెహ్రూ ఇట్టి ఫిర్యాదుచేసెను. ఈ విషయములో ఆస్ట్రేలియాప్రభుత్వము వారుకూడ ఇండియాతో ఏకీభవించి వారును ఫిర్యాదు చేసియున్నారు. వీటిఫలితములు ఎట్లుండునో చూడవలసియున్నది.

## నెహ్రూసిద్ధాంతము

ఈ సందర్భములో పండిత నెహ్రూ ఒక క్రొత్త సిద్ధాంతమును ప్రతిపాదించెను. ఆశియాఖండమందెచ్చటను ఖండాంతరములవారి సైన్యములుండరాదను సిద్ధాంతమే ఇది. పాశ్చాత్యులు వారిసైన్యములతో ఆశియాదేశములపై బడి, వాటిని జయించి, మూడునాలుగువందలసంవత్సరములనుండి వాటిని పాలించుచున్నారు. ఇట్టి దాస్యమునుండి విముక్తిగాంచుటకు ఈ దేశములవారందరు ప్రస్తుతము గట్టి ప్రయత్నములు చేయుచున్నారు. పాశ్చాత్యుల సైన్యములు ఈదేశములం దుండునంతవరకు దాస్యవిముక్తి లభించజాలదు. అందుచేత నెహ్రూ ప్రతిపాదించిన సిద్ధాంతమే న్యాయమైన సిద్ధాంతము. దీనిని నిలబెట్టుకొనుటకు కావలసిన శక్తిని మనము సంపాదించవలసియున్నది. శక్తిలేనంతవరకు మన సిద్ధాంతములను లక్ష్యపెట్టువారెవ్వరు ఉండరు. అమెరికాఖండము విషయమై ౧౨౦ సంవత్సరములనాడు అమెరికాఅధ్యక్షుడైన మన్రో ఇట్టిసిద్ధాంతమునే ఒకదానిని ప్రతిపాదించెను. కాని మన్రోకును, నెహ్రూకును ఒక భేదమున్నది. తన సిద్ధాంతమును ఆచరణలో పెట్టుట

కును, దానికి విరుద్ధముగ ప్రవర్తించదలచిన యూరోపియన్ ప్రభుత్వములవారితో యుద్ధముచేసి వారిని ఓడించుటకును మన్రో సమర్థముగ నుండెను. అట్టి సామర్థ్యమును ఆశియాఖండ విషయమున మనము సంపాదించవలెను. అప్పుడే మనము ధన్యులము.

## బర్మా

పాశ్చాత్యుల సామ్రాజ్యబంధమునుండి విముక్తి గాంచుటకు ఇటీవల ప్రయత్నము చేసినవారిలో బర్మా వారొకరు. ఇందు ఆంగ్‌సాన్ వారికి నాయకుడయ్యెను. వయస్సున ఇతడు ౩౨ సంవత్సరములవాడైనను



ఆంగ్‌సాన్

స్వాతంత్ర్యసమరమును కడుదక్షతతో కొనసాగించిన వాడు. తుదకు బ్రిటిష్‌వారు ఇతనితో గత జనవరిమాస మున రాజీచేసుకొని, అతని నాయకత్వమున తాత్కాలిక ప్రభుత్వము నొకదానిని నిర్మాణముచేసిరి. ఆ రాజీ ఫలితముగ రాజ్యాంగపరిషత్తుకూడ ఏర్పడెను. క్రొత్త రాజ్యాంగవిధానమును ఆ పరిషత్తు నిర్మించినవెంటనే దాని ననుసరించి ఏర్పడు ప్రభుత్వమునకు సంపూర్ణ స్వాతంత్ర్యమును ఇచ్చునట్లు బ్రిటిష్‌వారు ఒడబడి యుండిరి. అప్పటినుంచి ఆంగ్‌సాన్ అధ్వర్యమున బర్మా ప్రభుత్వము జరుగుచుండెను. కాని అతని పక్షమునకు విరోధులుగ మరికొన్ని పక్షములు బయలుదేరెను. బహుశః వారి కుట్రలమూలమున కాబోలు— జూలై ౧౯ తేదీన ఆంగ్‌సాన్ అధ్యక్షతను ప్రభుత్వ కార్యవర్గ సమావేశము జరుగుచుండినపుడు సాయుధులగు దుండగులు సభాభవనమును ప్రవేశించి అతనిని, అతని అనుచరమంత్రులు మరి అయిదుగురుని కాల్చి చంపిరి. మరి ఇద్దరికి గాయములు తగిలి, వారుకూడ తర్వాత మరణించిరి. ఇట్టి హత్య ఇదివరకు కనివిని ఎరుగనిది. హత్యలమూలమున రాజకీయాదర్శములను సాధింపప్రయత్నించుటకన్న ఖండనార్హమైన మార్గము మరియొకటి లేదు. భిన్నరాజకీయ పక్షములవారు దౌర్జన్యరహితమైనట్టియు, క్రమమైనట్టియు మార్గమును అనుసరించి వారి యుద్దేశములను నెరవేర్చుకొనవలయునేగాని ఇట్టి చర్యలకు కడగుట గర్హింపదగియున్నది.

కాని ఆశియాఖండములో ఇది విప్లవయుగమన్నమాట మనము మరవకూడదు. పాశ్చాత్యుల అధికారము తొలగి, ప్రజల అధికారము స్థాపితమగుచుండు ఈ కాలమున దారిద్ర్యబాధ ననుభవించువారందరు అట్టి బాధనుండి తప్పించుకొనుటకు సర్వవిధముల ప్రయత్నము చేయుదురు. దేశమందు అశాంతి, దోపిడులు, అల్లరులు అధికమగును. బర్మా ప్రస్తుతము ఇట్టి స్థితియందున్నది. మూడు సంవత్సరముల కాలము జపాన్ పాలనలోనుండి, యుద్ధకాలమున ప్రజలు అనేకకష్టములకు గురిఅయిరి. అనేకులవద్ద ఆయుధము లున్నవి. దౌర్జన్యము నుపయోగించి ధనికుల భూములను, ఆస్తిపాస్తులను అపహరించదలచువా రనేకు లున్నారు. అనేక గ్రామములందును, ప్రాంతములందును ప్రాబల్యమంతయు వారిదే. బ్రిటిష్‌వారు వారి అధికారమును ప్రజానాయకుల పరము చేసిన మాట వాస్తవమే. కాని

ఈ నాయకులు నిర్మాణకార్యక్రమమునకు పూని, ధనికుల దరిద్రుల మధ్య నుండు అంతరమును తగ్గించి, అందరి సౌఖ్యము అభివృద్ధియగుటకు కావలసిన మార్పులను వెంటవెంటనే చేసినగాని వారి అధికారము స్థిరపడజాలదు. అతృప్తితో కూడినట్టియు, విప్లవములను లేవదీయుటకు సిద్ధపడినట్టియు వర్గములవారు బర్మాలో ఎందరో ఉన్నారు.

## భరతఖండము : స్వాతంత్ర్యము

జూలై నెల భరతఖండ చరిత్రమున మిక్కిలి ప్రధానమైనది. బ్రిటిష్‌వారికిని, భారతీయులకును మధ్య నుండిన వివాదము చాలవరకు ఈ నెలలో పరిష్కారమయ్యెనని చెప్పవచ్చును. భారతస్వాతంత్ర్యచట్టమును బ్రిటిష్ పార్లమెంటువారు ఆమోదించిరి. దాని ఫలితముగ ఆగష్టు ౧౫ తేదీకి మన దేశముపై ఇదివరకు బ్రిటిష్‌వారి కున్న అధికారము అంతరించును. మనకు స్వాతంత్ర్యము లభించినది. బ్రిటిష్ ప్రభువు ఇండియా చక్రవర్తి అను బిరుదము దీనితో తొలగిపోయెను. బ్రిటిష్ పార్లమెంటువారికి మనకు సంబంధించిన శాసనములను చేయుటకు ఎట్టి అధికారము ఉండదు. వారిదివరకు చేసిన శాసనములనుకూడ మనము రద్దుచేసుకొనవచ్చును. చక్రవర్తిత్వముతోపాటు వైస్రాయి బిరుదము తొలగిపోయెను. మన దేశము బ్రిటిష్ సామ్రాజ్యములో "డొమినియన్" హోదాతో ఉండునంతవరకు ఇంగ్లండు రాజు మనకుకూడ రాజుగ నుండును. కాని ఇతనికి అధికార మేమియు ఉండదు. ఇతని తరపున ప్రతినిధిగ ఒక గవర్నరుజనరల్ ఉండును. కాని మన మెవరిని సూచించెదమో అతనినే గవర్నరుజనరలుగ నియమించుట ఇప్పటినుండి సాంప్రదాయమగును. గనుక చట్టదృష్ట్యా మనకు స్వాతంత్ర్యశాసనము మూలమున స్వరాజ్యము లభించినదని చెప్పవచ్చును. ఆగష్టు ౧౫ తేదీ మన స్వాతంత్ర్య జన్మదినము. అటుతర్వాత మన కిష్టమున్నయెడల బ్రిటిష్ సామ్రాజ్యములో ఉండవచ్చును; లేదా విడిపోవచ్చును. గనుక స్వాతంత్ర్యచిహ్నములన్నియు మనకులభించినవని అనుటలో అతిశయోక్తి లేదు.

కాని స్వాతంత్ర్య లాంఛనములకును, నిజమైన స్వాతంత్ర్యమునకును చాల భేద మున్నది. బ్రిటిష్ వారియొక్కగాని, ఇతర అగ్రరాజ్యములయొక్కగాని అపేక్ష లేకుండ మనము మన దేశమును రక్షించుకొనగలిగిననాడే మనకు నిజమైన స్వాతంత్ర్యము లభించును. అందుకు కావలసిన సైన్యము, నౌకాబలము, విమానబలము, ఫిరంగులు, టాంకులు మొదలగు ఆయుధములు, ఇవి తయారగుటకు కావలసిన పరిశ్రమాగారములు, వీటిలో నేర్పుతో పనిచేయగల శాస్త్రవేత్తలు నాయకులు, ఇట్టి కార్యము జరుగుటలో ప్రభుత్వముతో ఉత్సాహముతో తోడ్పడ సిద్ధముగనుండు ప్రజలు, ప్రజల సుఖమును ఏకదీక్షతో వృద్ధిచేయు ప్రభుత్వము—ఈ అంగము లన్నియు ఏర్పడిననాడే మనకు నిజమైన స్వాతంత్ర్యము. ఇప్పుడు మనకు లభించినది అట్టి స్వాతంత్ర్యమును సంపాదించుకొనుటకు మహదవకాశము. ఇప్పటినుండి మన ప్రభుత్వ విధానమందుగాని, ఆర్థిక విధానమందుగాని లోపము లేవియుండినను దానికి మనమే కారణమగుదుముగాని బ్రిటిష్‌వారు కారణభూతులుకారు. ఈ నిజమైన స్వాతంత్ర్యము బ్రిటిష్‌పార్లమెంటు శాసనమూలమున లభించునది కాదు. మన స్వశక్తిద్వారా లభించునట్టిది.

## దేశవిభజనము

స్వాతంత్ర్యచట్టఫలితముగ బ్రిటిష్‌పాలనలో నున్న భరతఖండము (౧) ఇండియా (౨) పాకిస్థాన్ అని రెండు రాజ్యములుగ విభజితమయ్యెను. ఇదియే చాల విచారకరమైన విషయము. స్వాతంత్ర్యము వచ్చినదని సంపూర్ణముగ మనము సంతోషింపకుండుటకు ఇదియే కారణము. ఈ చట్టములో మరియొక లోపమున్నది. సంస్థానములపై ఇదివరకు తామనుభవించుచుండిన సామ్రాజ్యాధిపత్యమును బ్రిటిష్‌వారు వదలుకొనిరిగాని, ఆ ఆధిపత్యమును వారి స్థానమున ఏర్పడు ఇండియాపాకిస్థాన్ ప్రభుత్వములకు పరివర్తనము చేయరైరి. ఇట్లు చేయకపోవుటచేత సంస్థానములు కొన్ని సంపూర్ణస్వాతంత్ర్యమును ప్రకటించి, ఈ సందిగ్ధసమయములో దేశమునకు అనవసరముగ మరికొన్ని చిక్కులు తెచ్చిపెట్టుచున్నవి.

ఇట్లు ఏర్పడిన ఇండియారాజ్యమునకు లార్డు మౌంట్‌బాటన్, పాకిస్థానుకు జిన్నాయును గవర్నరు

జనరలు అయ్యెదరు. రెండురాజ్యములకు ఒకే గవర్నరుజనరల్ ఉండునని ఇదివరకు అందరు ననుకొనుచుండిరి. అట్లే జరుగునని ఇండియారాజ్యమునందలి కాంగ్రెసునాయకులు మౌంట్ బ్యాటన్ గవర్నరుజనరలగుట కంగీకరించిరి. కాని రెండురాజ్యములకు వేరు వేరు గవర్నరుజనరలు లుండవలెననియు, పాకిస్థానుకు తానే గవర్నరుజనరల్ కావలెననియు జిన్నా పట్టు పట్టుటచేత అనుకొన్నది ఒకటి, జరుగుట మరియొకటిగా పరిణమించెను. పాకిస్థానుకు భారతీయుడు గవర్నరుజనరలగుటయు, ఇండియాకు అట్టి అదృష్టము లేకపోవుటయు విచారకరమైన విషయమే. కాంగ్రెసునాయకులు దూరదృష్టితో ప్రవర్తించలేదని చెప్పవలసియున్నది.

## రాజ్యాంగపరిషత్తు

జూలై నెలలో జరిగిన మన రాజ్యాంగపరిషత్తు యొక్క సమావేశము చాల ప్రధానమైనది. ఇదివరకు దీనిని బహిష్కరించిన లీగుప్రతినిధులు ఇప్పుడిందులో పాల్గొనిరి. వీరుగాక సంస్థానప్రతినిధులు అరవై మంది హాజరైరి. ఇందులో చేరని సంస్థానములలో ప్రధానములైనవి తిరువాంకూరు, హైదరాబాదు, ఇండోరు, భోపాలు, కాశ్మీరములు. మొత్తముమీద ఈ సమావేశము సర్వాంగములతో కూడుకొన్నదియని చెప్పవచ్చును. దీనితో పాటు ఈ సమావేశములో రాజ్యాంగపరిషత్తు సంపూర్ణస్వామ్యము కలదిగ మారినదయ్యెను. ఇందుచేత దీనికొక నూతనవర్చస్సు లభించెను. ఇదివరకు ఇది సమావేశమైనప్పుడు ౧౯౪౬, మే ౧౬ తేదీన మంత్రిత్రయమువారు ప్రకటించిన ప్రణాళికలోని నిర్బంధముల ననుసరించి వ్యవహరింపవలసియుండెను. ౧౯౪౭, జూన్ ౩ తేదీ ప్రణాళికమూలమున ఇదంతయు మారెను. గ్రూపులు, సెక్షనులు రద్దయ్యెను. లీగు మెంబర్లు ఆమోదించినగాని పరిషత్తువారు కొన్ని తీర్మానములను చేయరాదను నిర్బంధముకూడ తొలగిపోయెను. అందుచేత సర్వస్వామ్యముతో పరిషత్తు వ్యవహరించుట కవకాశ మేర్పడెను.

## ఫెడరల్ విధానము

జూలై ౧౪ తేదీ మొదలు ౩౧ తేదీవరకు సమావేశమైయుండిన రాజ్యాంగపరిషత్తు ఇండియారాజ్యములోని రాష్ట్రములు, కేంద్రము ఏవిధముగ పరిపాలింపబడవలెనో తెలియపరచుచు కొన్ని సిద్ధాంతములను నిర్ణయముగావించెను. దీనినిబట్టి రాబోవు మన రాజ్యాంగవిధాన మెట్లుండునో మన మిప్పుడు చెప్పవచ్చును. ఈ రాజ్యాంగము ఫెడరల్ విధానముగ నుండును. అనగా కొన్ని అధికారములు రాష్ట్రములకును, తక్కిన అధికారములు కేంద్రములోని ఫెడరల్ ప్రభుత్వమునకును ఉండును. రాష్ట్రాధికారములను మార్పుటకుగాని, రద్దుచేయుటకుగాని కేంద్రమునకు అవకాశ ముండదు. ఇదియే రాష్ట్రస్వాతంత్ర్యము. ఫెడరల్ విధానమునకు ఇదియే ప్రధానలక్షణము. మొత్తముమీద ఏవో కొన్ని కొద్దికొద్ది మార్పులతో మనరాజ్యాంగపరిషత్తువారు ౧౯౩౫ లో బ్రిటిష్ పార్లమెంటువారు చేసిన చట్టమునే అనుసరించి మన రాజ్యాంగవిధానమును ఏర్పరచుచున్నారని చెప్పవచ్చును.

## రాష్ట్రపాలనము : గవర్నరు

ఇండియాలోని ప్రతిరాష్ట్రమునకు ఒక గవర్నరు ఉండగలడు. కాని ఇతనిని రాష్ట్రములోని వయసు వచ్చిన (అనగా ౨౧ సంవత్సరములకు మించినవారు) పురుషులు, స్త్రీలు ఎన్నుకొనెదరు. ఇతని ఉద్యోగపరిమితి నాలుగుసంవత్సరములు. ఎవడుగాని రెండు పర్యాయములకంటె ఎక్కువగ ఎన్నుకొనబడకూడదు. ఇతని వయస్సు ౩౫ సంవత్సరములకు మించియుండవలెను. ఇతడుగాక రాష్ట్రశాసనసభవారిచే ఎన్నుకోబడ్డ డిప్యూటీగవర్నరు ఒకడుండును. తాత్కాలికముగ గవర్నరుపదవిలో ఖాళీఏర్పడినయెడల ఇతడు తాత్కాలికపుగవర్నరగును. సాధారణకాలములలో గవర్నరుకు ఎట్టి అధికారముండదు. ఇంగ్లండులో రాజుగారున్నట్లు ఇతడుకూడ ఒక అలంకారవిగ్రహముగా నుండును. కాని ఏదైన క్లిష్టపరిస్థితులు ఏర్పడి మంత్రులద్వారా పరిపాలన జరుగుట దుస్సాధ్యమని అతనికి తోచినప్పుడు అతడు సర్వాధికారి యగును. అట్టి పరిస్థితులలో అతడు కేంద్రప్రభుత్వాధ్యక్షునికి లోబడి ప్రవర్తించవలెను. అట్టి అధికారము రెండు వారములవరకు మాత్రమే. ఈ విషయమును

గురించి దీర్ఘమైన వాదోపవాదములు పరిషత్తులో జరిగెను. ఇంతటి అధికారము గవర్నరు కుండకూడదని అనేకులు వాదించిరి. కాని వారి వాదము నెగ్గలేదు. బ్రిటిష్ పార్లమెంటువారి ౧౯౩౫ సం॥ చట్టమున ఇట్టి అధికార మున్నది.

## శాసనసభ

రాష్ట్రములో ఒక శాసనసభ ఉండవలెను. ఇందులో ౬౦ కంటె తక్కువగాక ౩౦౦ కంటె ఎక్కువగాక సభ్యులుందురు. జనసంఖ్యనుబట్టి సభ్యుల సంఖ్య నిర్ణయమగును. శాసనసభలో ఒక శాఖ ఉండవలెనా, రెండుశాఖ లుండవలెనా అన్నది ఆయా రాష్ట్రముల ప్రతినిధులు నిర్ణయించుకొనవలెను. వయోజనులందరికి ఎన్నికలలో పాల్గొనుటకు హక్కు ఉండును. కులము, వృత్తి, మతము మొదలైనవాటిని అనుసరించి ఎన్నికవర్గములు ఏర్పడవు. ఎన్నికవర్గము లన్నియు (Constituencies) ప్రాంతీయములుగ నుండును (Territorial). ఇది గొప్ప సంస్కరణము. కులకక్షలు, మతకక్షలు రాజకీయములలో ప్రాకకుండుటకు ఇది ఉపకరించగలదు. శాసనముల చేయు అధికారము, పన్నుల విధించు అధికారము, వాటిని ఖర్చుపెట్టు అధికారము శాసనసభ కుండును.

## మంత్రుల సభ

రాష్ట్రపరిపాలనము మంత్రుల సభద్వారా జరుగును. అధికసంఖ్యాకుల పక్షమునకు చెందిన నాయకుడు ప్రధానమంత్రి అగుట; తక్కిన మంత్రులను అతడు నియమించుట; అందరు కలిసి (సమిష్టి) బాధ్యతను వహించుట; శాసనసభవారి ఆమోదము ఉన్నంతవరకే వారు అధికారములో ఉండుట—అను లక్షణములు ఈ సభకు ఉండును. ఇవన్నియు ౧౯౩౫ చట్టపు లక్షణములే. దీనికి భిన్నముగా, శాసనసభవారు దామాషా ఎన్నికలపద్ధతిని (Proportional System) మంత్రులను ఎన్నుకొనవలెననియు, అట్లు చేసినయెడల ఒకపక్షమువారేగాక రెండుమూడు పక్షములవారు మంత్రిసభలో సభ్యులు కాగలరనియు, మిశ్రిత మంత్రివర్గము ఉత్తమమైనదనియు, వారి కాలపరిమితి శాసనసభా కాలపరిమితితో సమానముగ నుండవలెననియు కొందరు—ముఖ్యముగ లీగుపక్షమువారు—వాదించిరి. కాని వారి వాదము గెలువలేదు. స్విట్జర్లాండు దేశములోని మంత్రివర్గము లిట్టివి. కొంతకాలమునుండి మనము ఇంగ్లీషుపద్ధతికి అలవాటుపడియుండుటచేత ఇతరదేశముల పద్ధతిని ప్రవేశపెట్టుట అనుచితమనియు, ఆ పద్ధతిలో అనేకలోపము లున్నవనియు కాంగ్రెసులోని ప్రధాన నాయకులు వాదించుటచేత లీగు సవరణలు వీగిపోయెను.

## కేంద్ర పాలనము

రాష్ట్రపరిపాలనవిధానమందు గమనించతగ్గ విశేషములు మరేవియు లేవు. కేంద్ర ప్రభుత్వములో ఇండియారాజ్యమున కంతకు ఒక అధ్యక్షుడు ఉండును (President). అనగా రాజ్యాంగపరిషత్తు ఇప్పుడు నిర్మించుచుండు విధానము అమలులోకి వచ్చునాటికి ఇండియా బ్రిటిష్ సామ్రాజ్యమునుండి విడిపోవనిశ్చయించుకొనవలెను. అప్పుడు గవర్నరుజనరల్ స్థానమున అధ్యక్షుడు ఏర్పడును. ఇతనిని దేశములోని వయోజనులందరుగాక కేంద్రశాసనసభలోను, రాష్ట్రముల శాసనసభలలోని ప్రజాశాఖలోను ఎన్నుకొనబడిన సభ్యులందరు కలిసి ఎన్నుకొనెదరు. రాష్ట్రగవర్నరుల ఎన్నిక ప్రత్యక్షమైనది (Direct); అధ్యక్షుని ఎన్నిక పరోక్షమైనది (Indirect). ఇదికూడ ప్రత్యక్షముగ నుండవలెనను వాదము వీగిపోయెను. ఇతని ఉద్యోగకాలము అయిదు సంవత్సరములు. రెండు పర్యాయములకంటె ఎక్కువకాలము ఎవరుకూడ అధ్యక్షుడుగ నుండరాదు. ఇదిగాక ఉపాధ్యక్షు డొకడుండును. ఇతడు కేంద్రశాసనసభకు అధ్యక్షుడై, రాజ్యాధ్యక్షుని పదవిలో తాత్కాలికమైన ఖాళీ సంప్రాప్తించినయెడల అధ్యక్షుడగును. అధ్యక్షునికికూడ నిజమైన అధికారము లేదు. క్లిష్టపరిస్థితులలో ఇతనికి కొంత అధికారముండును. కేంద్రపరిపాలనకుంతయు మంత్రుల సభ అధీనమందుండును. ఈ సభ రాష్ట్రములోని మంత్రిసభ యొక్క లక్షణములు కలది. దీనినికూడ స్విట్జర్లాండు పద్ధతిని నిర్మాణముచేయుటకు లీగువారు సవరణలు ప్రతిపాదించిరిగాని అవి నెగ్గలేదు. కేంద్రమందు రెండు శాఖలతో కూడిన శాసనసభ ఉండును. ప్రజాసభలో ౫౦౦ సభ్యులు, కౌన్సిల్ ఆఫ్ స్టేటులో ౨౫౦ ఉందురు. వృత్తులనుబట్టి ఎన్నుకొను సభ్యులు ౧౨ మంది కౌన్సిలులో ఉండవచ్చును. సంస్థానముల తరఫున నూటికి నలభైమంది దామాషాకంటె ఎక్కువ సభ్యులు ఉండరాదు. హైకోర్టు, సుప్రీంకోర్టులవిషయములో బ్రిటిషుపద్ధతినే మన రాజ్యాంగపరిషత్తువారు చాలవరకు అనుసరించిరి.

ఇవన్నియు సిద్ధాంతములు. వీటిని అనుసరించి చట్టము తయారు చేయబడును. ఆ చట్టమును ఆగస్టు ౧౫ వ తేదీన సమావేశమగు పరిషత్తు చర్చించి దృఢపరచును. అక్టోబరు నాటికి క్రొత్తరాజ్యాంగము తయారు కాగలదు.

## సంస్థానములు

ఇండియా రాజ్యములో సంస్థానములు చేరగలవా, లేదా అన్న విషయము ఇంకను సందిగ్ధముగ నున్నది. దీనికి కొంతవరకు బ్రిటిష్‌వారే కారకులు. స్వాతంత్ర్య చట్టమున వీరి విషయమును స్పష్టీకరించక, గోడమీది పిల్లి మోస్తరు ప్రవర్తించిరి. స్వాతంత్ర్యమును ప్రకటించిన సంస్థానముల స్వాతంత్ర్యమును తాము అంగీకరించుటలేదనియు, అట్టి సంస్థానములకు అంతర్జాతీయ సంస్థలలో స్థానముండదనియు వారు ప్రకటించియుండినయెడల హైదరాబాదు, భోపాలు, ఇండోరు మొదలగు సంస్థానములు ఇప్పుడు ఆడుచుండినట్లు ఆడియుండవు. కాని జిత్తులమారితనమునకు పేరుప్రతిష్ఠలుగాంచిన బ్రిటిష్‌వారు ఇట్లు చేయరైరి. ఈ విషయమై జూలై నెలలో నెహ్రూ, పటేలు, మౌంట్‌బ్యాటన్ ప్రముఖులు కొన్ని ప్రకటనలను చేసిరి. నెహ్రూ ప్రకటనలో సంస్థానములు ఏదో ఒకపద్ధతి ననుసరించి ఇండియా రాజ్యములో చేరనిపక్షమున వారనేక కష్టములపాలగుదురని అతడు తెలియబరచెను. పటేల్ అంతటి కఠిన వాక్యములను వాడక, రక్షణ, విదేశవ్యవహారములు, రాకపోకలు అను ఈ మూడువ్యవహారములలో సంస్థానములన్నియు ఇండియాతో సంబంధములను ఏర్పరచుకొని, ఇండియా ప్రభుత్వము వారు చేయు శాసనములను, ఏర్పాటులను అనుసరించవలయుననియు, తక్కిన విషయములలో వారు సర్వస్వాతంత్ర్యము ననుభవించవచ్చుననియు రాజీమాటలను ఉపయోగించెను. ఇది శ్రేయస్కరమగు మార్గమనియు, సంస్థానముల గౌరవమునకు ఇందులో లోప మేదియు లేదనియు బికానీర్ సంస్థానాధీశుడు చెప్పుచు, పటేల్ వాదమును బలపరచెను. కొన్నిరోజులతర్వాత, మౌంట్‌బ్యాటన్ ప్రభువు సంస్థానాధీశుల నేతలను, వారి దివానులను సమావేశపరచి, ఆ సభలో ఉపన్యసించుచు పటేలు సూచించిన పద్ధతినే సంస్థానాధీశులందరు అనుసరించుట యోగ్యమని ఉద్ఘాటించెను. వీటి అన్నిటికి ఫలితముగ హైదరాబాదు, భోపాలు, కాశ్మీర్, ఇండోరుసంస్థానములు తప్ప తక్కినవన్నియు రక్షణ, విదేశవ్యవహారములు, రాకపోకలు అను విషయములలో ఇండియా ప్రభుత్వమునకు లోబడి ప్రవర్తించుటకు అంగీకారమును తెలియబరచినట్లు కనుపించుచున్నది. ఎన్నటికిని స్వాతంత్ర్యమును వదలుటకు తిరువాన్కూరు ఇష్టపడజాలదని మిన్నుముట్టునట్లు రెండునెలలుగ ఘోషించుచున్న సి. పి. రామస్వామయ్యరుకూడ తన వాదమును మానుకొనెను.

కాని ఇంతటితో సంస్థానముల సమస్య పరిష్కారమయ్యెనని చెప్పుటకు వీలులేదు. ఇండియా రాజ్యములో చేరెదమని చెప్పిన సంస్థానములన్నియు క్రొత్తరాజ్యాంగము అమలులోనికి వచ్చునంతవరకే తాము చేరియుండెదమనియు, అటుతర్వాత ఇందు విషయమై తాము పునరాలోచన చేసెదమనియు, అప్పుడు తాము విడిపోయినను విడిపోవచ్చుననియు వాదించుచున్నారు. ఈ తాత్కాలికదాంపత్యమువలన లాభమేమిటి! ఇప్పుడు చేరుటయు, తరువాత విడిపోవుటయు జరిగినయెడల రక్షణవిషయమై ఏర్పడు చిక్కులు, కష్టములు యథాప్రకారముగ నుండుననియు, చేరదలచుకొనిన సంస్థానములు శాశ్వతముగ చేరుటకు సిద్ధపడవలెననియు కాంగ్రెసునాయకుల వాదము. ఈ వాదమే సబబైనది. గనుక వారు నయముననో, భయముననో సంస్థానముల నన్నిటిని లొంగదీసి ప్రధానవ్యవహారములు మూడింటివిషయమునైనను ఇండియాప్రభుత్వమునకు లోబడి వారు ప్రవర్తించునట్లు చేయవలెను. ఇది జరుగనిపక్షమున రాజ్యాంగపరిషత్తులో సంస్థానముల ప్రతినిధులు పాల్గొనుటవలనగాని, తాత్కాలికముగ వారు ఇండియా రాజ్యములో చేరుటవలనగాని లాభము లేదు.

స్వతంత్రులుగ నుండవలెనను సంస్థానాధీశుల దృష్టి బహుసంకుచితమైనది. ఇటీవల వారెన్నడు స్వతంత్రులుగ నుండినవారు కారు. అంతర్జాతీయ సంస్థలలో వారికి స్థానము లేదు. వారిని రక్షించగలవారెవ్వరు లేరు. వారి స్వాతంత్ర్యమూలమున దేశమంతయు అనేక చిన్నచిన్న రాజ్యములుగ విభజితమై పరాయిపరిపాలన పునఃప్రతిష్ఠితమగుటకు అవకాశమిచ్చును. ఇట్టి విభాగమే మన కష్టములన్నిటికి కారణమైనదని పటేలు ప్రకటనలోని వాక్యమును వారు గమనించవలెను. (1-8-47).

# కలగూరగంప

## కొత్తరకం అద్దాల తలుపులు

ఆదివారంనాడు హాయిగా భోజనం చేసుకొని పడుకొని విశ్రాంతి తీసుకుంటున్నా రనుకోండి. ఇంతలో ఎవడో వచ్చి మీ యింటి తలుపు తట్టుతాడు. ఎవరో పెద్దమనిషి వచ్చాడని భ్రమపడి మీరు గబగబా వెళ్లి తలుపుతీస్తారు. అప్పుడు అప్పులవాడో, లేకుంటే అలాంటివాడే మరొకడెవడో ఎదు రవుతా రనుకోండి. అటువంటి సమయాల్లో మీ కెంత చీకాకు పుట్టుకొస్తుంది? ఎవరు తలుపు కొట్టుతున్నదీ మీ కేగనక ముందు తెలిసివుంటే మీరు తలుపుతియ్యకుండా మీ సేవకుణ్ణి పంపించి లేరని చెప్పించడమో, లేకుంటే వా రెంత పిలిచినా పెల్లంకొట్టినరాయిమోస్తరు పరుండడమో చేసివుంటురు. అప్పు డా తలుపు తట్టిన మనిషి విసిగి వేసారి వెళ్ళిపోతాడు.

ఇటువంటి క్లిష్టసమయాల్లో మీకు తోడ్పడడానికి విజ్ఞానశాస్త్రజ్ఞుడు ఒక కొత్తరకం అద్దాల తలుపు తయారుచేశాడు. ఈ అద్దాన్ని ఒకవైపునుంచీ చూస్తే మీకు అవతలపక్క ఏముండేదీ కనపడదు. మీ ప్రతిబింబంమాత్రం మామూలు దర్పణంలోమోస్తరు ఈ అద్దంలో కనిపిస్తుంది. అదే అద్దాన్ని రెండోవైపునుంచి చూస్తే మామూలు గ్లాసుమోస్తరు దానిగుండా అవతలపక్కనుండే దంతా చూడవచ్చు. అంటే ఏమన్నమాట? ఆ అద్దమును ఒకవైపునుంచి చూస్తే మామూలు చూపుడద్దంమోస్తరుగాను, ఇంకోవైపునుంచి చూస్తే మామూలు Transparent గ్లాసుగాను ఉపకరిస్తుంది.

ఈ అద్దానికి ఒకవైపునమాత్రం ౧/౧,౦౦,౦౦,౦౦౦ అంగుళంమందాన క్రోమియం అణువులు పల్చగా కప్పబడివుంటాయి. ప్రతి రెండణువులకూ మధ్య ఖాళీస్థలం (కంటికి గోచరింపనంత) వుంటుంది. ఈ ఖాళీస్థలాల వల్లనే ఆ అద్దంయొక్క ప్రతిఫలింపని ముఖం (Non-reflecting side)గుండా చూస్తే మామూలుగ్లాసులో వలె Transparent గా కనిపిస్తుంది.



[స్వతంత్రభారత పతాకమీది ధర్మచక్రానికి మూలాధారమై, సారనాథులో వెలసియున్నట్టి అశోకుని స్తంభాగ్రపీఠం.]

---

ఈ విచిత్రపు అద్దాన్ని వైద్యాలయాల్లోను, హోటళ్ళలోను, బ్యాంకులలోను చాలావిధాలుగా వుపయోగపెట్టుకోవచ్చు.

మీ యింటిముంగిట ఈ అద్దంతో చేసిన తలుపులు బిగించండి. ఎవరైనా వచ్చి తలుపుకొడితే వారికి లోపల ఎవరుండేదీ కనుపించదు. ఆ అద్దంలో వాళ్ళకు తమ ప్రతిబింబమాత్రం కనిపిస్తుంది. మరి మీకో? ఎవరు తలుపుకొట్టేదీ మీకు తెలిసిపోతుంది. తలుపు తీయవచ్చునా, తీయకూడదా అని నిరవ్యాకు తేల్చుకోవచ్చు!

చెరుకుమూడి రాధాకృష్ణమూర్తి.



# విమర్శనము



## కుమారదేవ పండితీయము

రచయిత: విద్వాన్ శాస్త్రుల ఆరుముగం పిళ్లె గారు. ప్రకాశకులు: వేదం వెంకటరాయశాస్త్రి బ్రదర్సు, ౮, మల్లికేశ్వరగుడిసందు, జి. టి. మద్రాసు.

ఈ ప్రౌఢవ్యాకరణవ్యాఖ్యాగ్రంథమున నాంధ్రుల గొప్ప యక్కఱ యొకటి ఇన్నాళ్లకుఁ దీఱినది. ఇది గ్రాంథికాంధ్రకల్పకమై, వ్యాకరణాధ్యాపకాధ్యేతృతతికి తారకమై విలసిల్లుననుట అత్యుక్తి కానేరదు. ఈ వ్యాఖ్యానమందలి యింపుసొంపులంబట్టి దీని 'బాలబోధసుధ'యను నామాంతరంబును ననురూపమై, అన్వర్థమై ఎసఁగుచున్నది.

ఆంధ్రమునకు సమగ్రమగు వ్యాకరణ మిప్పటికి లేదని పండితులు పలువురు చిరకాలముగ ఘోషించుచున్నారు. వీరు ఇరుతెఱంగులవారై యున్నారు. కొందఱు ఇప్పుడిప్పుడు తలసూపుచున్న భాషాశాస్త్ర పరిశోధకుల 'క్రొంబల్కు'ల పోకడకు లోనై ఇప్పటి కున్న వ్యాకరణములందును, పూర్వమహాత్ముల బుద్ధిప్రభావమందును ప్రామాణికబుద్ధి యుడిగినవారును, కొందఱు వానియందలి ప్రామాణ్యముచేతనే వానినే యుపజీవించి లక్ష్యానుభవమూలమున ఆ లక్షణగ్రంథములలో సందిగ్ధములై పొడకట్టు పట్టులకు వివరణరూపముగను, విపులీకరణరూపముగను గ్రంథములు కావలయునని కోరువారును.

లక్ష్యపరిశోధన మూలమున శ్రీ చిన్నయసూరిగారి బాలవ్యాకరణమునకు పూరక మొండు వలసినట్లు అనుభవగోచరము కాఁగా శ్రీమాన్ బహుజనపల్లి సీతారామాచార్యులవారు 'త్రిలింగలక్షణశేష'మను నామాంతరము గల ప్రౌఢవ్యాకరణమును రచించి రనుట ఎల్లరెఱిఁగినదే. ఆ 'బాలము'ను ఈ 'ప్రౌఢము' పూరించువిధమును ఆరుముగంపిళ్లె గారు 'కుమారదేవపండితీయో'పోద్ఘాతమున ఎంతయు సమంజసముగ తెలిపియున్నారు. 'బాల' 'ప్రౌఢము'లం గలిపినచో వ్యాకృతికిఁ గొంత సమగ్రత యేర్పడునని శ్రీ వజ్ఝల చిన సీతారామస్వామిశాస్త్రులవారు ఆంధ్రసాహిత్య పరిషత్పత్రికాష్టమ సంపుటమున సూచించియున్నారు. ఈ సూచన నందుకొనిరో యనునట్లు కొందఱు బాలవ్యాకరణమును వ్యాఖ్యానింపం దొరకొని వివరణవశమున 'ప్రౌఢ'సూత్రముల నెక్కడిదాని నక్కడికి అన్వయించుచు వచ్చిరి. వీనికిఁ బ్రత్యంతరముగ ప్రౌఢవ్యాకరణమును వ్యాఖ్యానించుచు ఆ వ్యాఖ్యాసందర్భమున 'బాల'సూత్రముల నెక్కడిదాని నక్కడికి అన్వయించి వివరింప నింతదనుక ఇతరులు పూనరైరి. ఆ మార్గము పట్టినదగు నీ కుమారదేవపండితీయము అపూర్వ మనక తప్పదు.

సూత్రతతో సామగ్ర్యమును మేళవించుట పూర్వ భారతీయశాస్త్రకృన్మహనీయుల ప్రతిభావిహార ప్రకారములలో అన్యతమము. మన పూర్వుల ఛందోవ్యాకరణాలంకార సూత్రకరణ నైపుణికి నాగరకతలో 'వయమేవ వా'యను పాశ్చాత్యులును ఆశ్చర్యస్తబ్ధులై వేవిధముల జోహారు పెట్టుచున్నారు. ఆ నైపుణియందు 'బాల' 'ప్రౌఢ'కారులగు సూర్యాచార్యుల యంతర మరయఁదగును. సంక్షేపసామగ్ర్య సమ్మేళనంపు సొబగు సూరిసూత్రములలో సిద్ధించినంత శ్రీమదాచార్యులవారి సూత్రములం గానము. సామగ్ర్యమునకై సూత్రత బలియై కొన్నికొన్ని 'ప్రౌఢ'సూత్రములు కొండవీటి చేఁతాడుపాటివై కుదిరినవి. సూత్రముల క్రింది యుదాహరణములలో దేనిని దేనిని సూత్రోక్తవిషయములందు దేనికి దేనికి అన్వయింపనగునో వ్యాఖ్యానిరపేక్షముగ విద్యార్థులకు బోధపడు పట్టులు 'ప్రౌఢము'న విరళములు. కావున వ్యాఖ్యయొక్క యక్కఱ 'బాలము'నకన్న

'ప్రౌఢము'నకే యెక్కుడైయుండఁగా ఇంతవఱకు 'బాలము' నకే వ్యాఖ్యలు రచితములగుచుండినవి. ఆ వ్యాఖ్యావసరములలో ఆనుషంగికముగ నేకాక 'ప్రౌఢము' దలంపకుండిరి. శ్రీ పిళ్లెగారు ఈ కొదువను గుర్తించి 'ప్రౌఢము'ను వ్యాఖ్యాసనాథముంగావించి ఎల్లర కృతజ్ఞతకుఁ బాత్రులైరి.

సూత్రములకు సంక్షేపమును, వ్యాఖ్యలకు వైపుల్యమును గుణములని స్థూలబుద్ధులు గ్రహింతురు. ఐనను 'నామూలం లిఖ్యతే కించి న్నానపేక్షిత ముచ్యతే' అను పదవాక్యప్రమాణపారావారపారీణోక్తరీతి ఉపయుక్తములం జార్పకయు, అప్రసక్తములం జేర్పకయు వ్యాఖ్యను నిర్వహించుటే నేర్పు. పిళ్లెగారు దీని నెట్లు నిర్వహించిరో తెలుపు నుదాహరణములను గ్రంథవిస్తరభీతిచే నొకరెంటినే చూపెదను.

ప్రౌ. శ. సూ. ౪౫. పూజ్యతాతిశయంబున యుష్మదర్థబహువచనంబునకు మఱుఁగా నాత్మార్థబహువచనంబు ప్రయుక్తంబగు.

ఉ. స్వామీ తాము దయచేయవలెను మొ.

వ్యా. పూజ్యతయందు 'మీరు', పూజ్యతాతిశయంబున 'తాము'; సూ. ౩౪ చే 'తమరు' 'తారు' అనియుం బ్రయోగింపనగు.

ప్రౌ. క్రి. సూ. ౨౩. ఒకానొకచో నన్నంతము నగుధాతువు దీర్ఘంబునకు భావార్థంబున నున్నపరంబగునపుడు హ్రస్వము గానంబడియెడి.

ఉ. 'క. తరుణీ యేరికిఁ జెల్లునె, యరయఁగ నే మింతవార మనుజోన నిదిగో, విరుపీఁడు గనున్నది కాఁ, గర మద్భుతమైన నవతి కయ్యముచేతన్.' (గనున్నది = కానున్నది యని యర్థము. విరుపీఁడు కర్త.) కళా. ౧ ఆ. 'నీవు నాథుఁడు గనున్న-మహామహా నా నృపాలు నా కెప్పుడు చూడఁగాఁగలుగు' (నాథుఁడు గనున్న = నాథుఁడు కానున్న యని యర్థము.) కళా. ౫. ఆ. మొ.

వ్యా. -అన్నంతమగు నగుధాతువునకుఁ గ్రియావిశేషణపూర్వకమునకే సూరి వైభాషికహ్రస్వతం జెప్పినాఁడు. భావార్థమందును హ్రస్వత నెనయుట గలదని ప్రౌఢకారుఁడు. 'ఒకానొకచో' ననుట ప్రయోగవైరళ్యసూచనార్థము.

పారిశేష్యనిత్యములలో, సంక్షేప సామగ్య్రములలో వ్యాఖ్యాపంక్తి సూత్రపంక్తిని మించుట నీ యుదాహృతులం బరికింపఁదగును.

ఇట్లు ఈ కుమారదేవపండితీయము అవశ్యకమనియు, అపూర్వమనియు, అనన్యాదృశమనియు ఏర్పడినది. ఇఁక నాకు మిగిలినది బాలవ్యాకరణమునకును ఇట్టి వ్యాఖ్య యొండు వెలసియున్నదని ఏతద్వ్యాఖ్యాతృప్రకాశకులకు విన్నవించుకొనుటే.

నే. భ.

---

## జయశ్రీ

రచయిత: వఝల వెంకటనరసింహారావుగారు. వెల ఒక రూపాయ. లభించు చోటు: సుందరరామ్ అండ్ సన్సు, తెనాలి.

ఈ గ్రంథంలో చిన్నవి, పెద్దవి కలిసి యిరవై కథ లున్నాయి. శైలి ధారాళంగా వుంది. "నరసింహారావుగారి నవోదయ 'జయశ్రీ' సార్థకనామంతో సాహితీపిపాసువుల సరససౌహార్దాన్ని సంపాదించుకో గలదని ఆశిస్తున్నాను"అని ప్రవేశికను చిత్రించిన కరుణశ్రీగారు అంటున్నారు. ఈ అభిప్రాయంలో అతిశయోక్తి యేమీ లేదు. రచయిత చేయితిరిగిన వ్యక్తి అని గ్రంథం చెబుతూవుంది.

"సాంఘికంగా పతితమైన మానవజీవితంలోని నగ్నసత్యాన్ని చూపడానికి యెంతో ప్రయత్నం కనిపిస్తుంది. ప్రతికథలో చితికిపోయిన జీవితాలకు ప్రతినిధిగా రచయిత మనకు కనిపిస్తాడు. ఇందలి పాత్రలన్నీ మా సంగతేమిటి, మమ్మల్ని గురించి యేమి ఆలోచించావు అని ముక్తకంఠంతో పాఠకుణ్ణి ప్రచ్ఛన్నంగా ప్రశ్నిస్తూవుంటాయి" అంటున్నారు పీఠికకర్త. ఇది ముమ్మాటికీ యథార్థము.

అయితే అక్కడక్కడ కొన్ని అసహజఘట్టాలు కానవస్తున్నాయి. "త్యాగము"అనే కథలో నాయకుడు యేట్లో స్నానం చేస్తూవుండగా చేతికేదో తగి

లిందట. అమాంతం పట్టుకుని పైకి లాగాడట. మనిషి శవం - లక్ష్మి. "ప్రతీకారం" అనే కథలో నాయిక నాయకుడికి తెలియకుండా చీరముడి వదులు చేసి నీళ్లు తోడబోయినట్లు పోయి బావిలో పడింది. నాయకుడు దగ్గరనే స్నానం చేస్తున్నాడు. బావిలో ఆమె బుడగలుమాత్రమే కనబడ్డాయి. వెంటనే దూకాడు బావిలోకి. అమాంతం లోపలకు పోయి జుట్టుపట్టుకుని పైకి తెచ్చాడు. వెంటనే కాముడు తెలియనట్లుగానే రెండు చేతులలో బిగ్గ కౌగలించుకుని తన వక్షాన్ని అతని వక్షానికి అదుముకుంది. గోపాలానికి ఒక్కసారిగ ఒళ్లు పులకరించినట్లయింది...............అమాంతం లేచి ప్రక్కనే పడివున్న పాతగుడ్డ చుట్టుకు నిలబడ్డది, గోపాలం లేని స్వాతంత్ర్యం తెచ్చుకుని కౌగలించుకో బోయాడు.

ఇట్టి ఘట్టాలు కొన్ని అసహజంగా కనపడుతున్నాయి. ఇట్టి చోట్ల కవి చాలా తొందరపాటు కనపరుస్తున్నాడు. ఆధునికయుగాన్ని చిత్రించే సందర్భంలో సహజాన్ని అతిక్రమిస్తే చేదుమందు మింగటంలాగ వుంటుంది. కథ వ్రాయటమంటే రెండు ప్రధానం. అవి రెండూ రెండు అంగాలు—ఒకటి Visualisation; రెండవది భాష. ఈ కవికి భాషలో లోపం లేదు. ఊహాపటిమకూడా వుంది. Climax లో కొంత తొట్రుపాటు కనపడుతోంది. దానిని కొంచెం సవరించుకొనగలిగితే నరసింహారావుగారు మంచి కథలు వ్రాయగలరు.

---

## శ్రీ రత్నపాంచాలిక

రచయిత: పిసుపాటి విశ్వేశ్వరశాస్త్రిగారు. ప్రకాశకులు: చిదంబర గ్రంథమాల, కాకినాడ, పుటలు ౬౨. వెల ఒక రూపాయి.

ఇది చతురంకనాటిక. శ్రీ సర్వజ్ఞ సింగభూపాలుని 'కువలయావళి' యను సంస్కృతకృతికి ఆంధ్రీకృతి. భూదేవి కువలయావళియై యవతరింపగా నామెను శ్రీకృష్ణుడు వివాహమాడుట యిందలి కథ. నారదు డిచ్చిన రత్నాంగుళీయక ప్రభావమున కువలయావళి మొదట శ్రీకృష్ణునకు రత్నపాంచాలికవలె నగపడెను. పిమ్మట వివాహము జరుగును.

రచయిత నెల్లూరు - వేంకటగిరి రాజకళాశాల ఆంధ్రాధ్యాపకులగుటను, సంస్కృతమునకు ఆంధ్రీకరణమగుటను భాష యించుక జటిలమనియే యనవలెను. ఈ నాటిక రసవత్తరమై రత్నావళీ ప్రియదర్శికాది నాటికలను బోలినది. ప్రదర్శనమునకు ఒక డజను మంది స్త్రీలు కావలసియుందురు. ప్రదర్శనయోగ్యమైనది.

---

## భారతదేశము: ఆర్థిక వ్యవహారములు

గ్రంథకర్త: శ్రీ కాశీనాథుని పూర్ణ మల్లికార్జునుడుగారు, యం. ఏ., బి. యల్., దొరికేస్థలం: కళాపీఠం, బెజవాడ. వెల ఒకటిన్నర రూపాయి.

గ్రంథము ౬౫ పేజీలే అయినప్పటికీ విషయం మాత్రం సంపూర్ణంగా తెలుపబడింది. భారతదేశము యొక్క నైసర్గికస్వరూపము, ప్రజలు, భూమి విధానము, వ్యవసాయము, పరిశ్రమలు, రహదారులు-వాణిజ్యము, కరెన్సీ-బ్యాంకింగు, ప్రభుత్వాదాయ వ్యయములు మొదలైన అనేకవిషయాలు చర్చించబడినాయి. దేశసుభిక్షము ప్రజయొక్క జీవితప్రమాణమునుబట్టి వుంటుంది. భారతదేశం దుర్భిక్షమైన దనటానికి యిక్కడి నిరుద్యోగమే కారణము. అన్నిటికంటే మునుముందు గృహపరిశ్రమలకు తగు ప్రోత్సాహమిచ్చిన నిరుద్యోగపిశాచము అంతరించునని అటు గవర్నమెంటుకు, యిటు ధనికవర్గానికి, ప్రజకు హెచ్చరిక నిస్తున్నారు యీ గ్రంథంద్వారా పూర్ణమల్లికార్జునుడుగారు.

## గాంధీ చరిత్రము

గ్రంథకర్త: కా. శఠగోపాచార్యగారు, ఎం. ఏ., బి. ఎల్., కాకినాడ. వెల రెండు రూపాయలు.

ఈ గ్రంథమునందు గాంధీమహాత్ముని పూర్తి జీవితము కలదు. జీవితము ఎనుబది ఘట్టములక్రింద విభజింపబడినది. ఇది రెండవ ముద్రణము. ప్రథమ ముద్రణముకంటె ఇందులో విశేషవృత్తాంతములు చేర్చ